# ఆదిశక్తి యొక్క లీలాకథలు



హిందీ మూలం

**యుగ ఋషి, వేదమూర్తి, తపోనిష్ఠ**

**పండిత శ్రీరామశర్మ ఆచార్య**

*Presented by*

**www.awgpsouth.org & www.missionrk.com**

# ఆదిశక్తి యొక్క లీలాకథలు





హిందీ మూలం

**యుగ ఋషి, వేదమూర్తి, తపోనిష్ఠ**

**పండిత శ్రీరామశర్మ ఆచార్య**

తెలుగు అనువాదకర్తలు

**శ్రీమతి లక్ష్మీరాజగోపాలు**

**శ్రీమతి కె. కృష్ణకుమారి**

***Edited by***
**ముక్కామల రత్నాకర్**

***Presented by***
**www.awgpsouth.org & www.missionrk.com**

# ముందుమాట

గాయత్రి యొక్క విస్తృత రూపమే ఆదిశక్తి లీలాకథలు. గాయత్రీ మంత్ర సాధనతో పాటు, సప్తశతి మంత్ర సాధన ఆధ్యాత్మిక మనోవాంఛను సిద్ధింపచేస్తుంది. ఈ సాధనలో అవరోధాలను గుర్తించి, జీవనశైలిని వికసింపచేసుకోవాలనే నిర్దేశం ఉన్నది. ఆత్మబల వికాసము, ఉన్నత లోకాలలోకి ప్రవేశమే సాధన యొక్క ఫలశృతి సాధకునిలో అంతర్వివేకం జాగృతం అయి, బంధనముల నుండి విముక్తి లభించ గలదు. దుర్గా సప్తశతి యొక్క రహస్యార్థం, పారాయణా విధానం ఈ పుస్తకంలో వివరించబడింది. సఫలతకు మూలాధారం పారాయణే. అర్గలా స్తోత్రం సాధనలో వచ్చే ఆటంకాలను తొలగించి వేస్తుంది. పవిత్ర అంతరంగం కలవారే శక్తి పాత్రులవు తారు.

మూర్తి రహస్యాలను తెలుసుకోవాలని భావనలే ముఖ్యమని ఈ పుస్తకంలో వివరించబడింది. ఇంకా నవార్ణ మంత్రం, గాయత్రీ మంత్రముల సారూప్యత. చమత్కారవంతమైన దేవి సూక్తం, దుర్లభ శక్తులకు ద్వారం. శ్రీ సిద్ధ కుంజికా స్తోత్ర వివరణ, ఇంకా ఎన్నెన్నో రహస్యమయ వివరణలు ఈ అమూల్య గ్రంథములో ఇవ్వబడ్డాయి. శ్రీ దుర్గాసప్తశతి కథ గాయత్రీ సాధనా మర్మమును తెలుపుతుంది. అన్నింటికన్నా ముఖ్యం మన సాధనలో వేగం, తీవ్రత.

'యుగశక్తి గాయత్రి' మాసపత్రిలో 2007 జనవరి నుండి 2010 ఏప్రిల్ వరకు ధారావాహికంగా ప్రచురింపబడ్డ ఆదిశక్తి లీలాకథలను పుస్తక రూపంలో పూజ్యశ్రీ రామకృష్ణమాస్టర్ గారి జన్మదిన సందర్భమున, దేవి నవరాత్రుల పావన సమయమందు తీసుకురావాలని సంకల్పించటం ముదావహం. ఈ పుణ్యకార్యాన్ని చేపట్టిన శ్రీమతి కాటూరి తేజశ్రీకి అభినందనలు.

**ముక్కామల రత్నాకర్**

తేది: 12.10.2020

# దుర్గాసప్తశతి - సాధనాత్మక వివరణ

దుర్గాసప్తశతి మహామహిమాన్వితమైన జగన్మాత స్తుతి. ఈ స్తుతిలో గల సమస్త విభూతులను, లాభాలను సాధకులకందించే ప్రయత్నంలో భాగంగా పూజ్యగురుదేవులు శ్రీరామశర్మ ఆచార్యగారు 'ఆదిశక్తిలీలాకథ' ను సాధకలోకానికి అందించారు.

దుర్గాసప్తశతి పారాయణ క్రమంలో ముందుగా ధ్యానపూర్వకంగా 'కవచ పారాయణ' చెయ్యాలి. ఈ కవచపారాయణ చేసే సాధకుని చూడడంతోనే అన్ని రకాల రోగాలు, వ్యాధులు, భూత, ప్రేత, పిశాచాది అరిష్టకారక శక్తులు మొత్తం నశించిపోతాయి. గాయత్రీమాత లేదా దుర్గాదేవి పటం ముందు ఆవునేతి దీపం వెలిగించి శుద్ధమైన ఉచ్చారణతో ఈ కవచాన్ని పఠిస్తే అన్ని దురాలోచనల నుండి, అన్ని మనోరోగాల నుండి సాధకుడు విముక్తుడవుతాడు. తాను స్వయంగా చేయలేక పోయినా తనకోసం, తనకు కావలసిన వారు ఎవరైనా సంకల్పం చెప్పి ఈ సాధనను చేస్తే కచ్చితంగా అద్భుత ఫలితాలు వస్తాయి.

దుర్గాసప్తశతిలో రెండవ చరణం – అర్గళాస్తోత్రం. ఆదిశక్తి లీలను దర్శించ టానికి అర్గళాస్తోత్ర పారాయణ చెయ్యాలి. ఆదిశక్తి సాధన చెయ్యటానికి సాధకుడు ముందు శక్తివంతుడు కావాలి. దానికొరకు ముందుగా కవచధారణ చెయ్యాలి. ఈ సాధనా మహాసంగ్రామంలో సాధకునిపై లెక్కింపనలవిగాని దృశ్య, అదృశ్య అసురీ శక్తుల విజృంభణ ఉంటుంది. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వాటి పీడ నుండి తట్టుకోవటం అసాధ్యమైన పని. కవచసాధన సక్రమంగా చేస్తే బాహ్య ఉత్పాతాలు అంటే రోగాలు మరియు ఇతర విఘ్నాల నుండి రక్షణ పొందటమే కాక అనేక ప్రారబ్ధ కర్మల నుండి విముక్తుడౌతాడు. అందుచేత సాధకుడు తప్పనిసరిగా 'కవచ ధారణ' చేసుకోవాలి. ఈ కవచం సాధకునికి బాహ్యజగత్తులో వచ్చే అనేక ఆపదల నుండి రక్షణ కల్పిస్తుంది.

నిజమేమిటంటే బాహ్య శత్రువుల కంటే ఆంతరిక శత్రువులు చాలా భయంకర మైనవి. వాటి నుండి రక్షణ పొందటానికే ఋషులు అర్గళా సాధనను రూపొందించారు. అర్గళ అంటే సంకెళ్ళు అని అర్థం. ఈ అర్గళాసాధనకు అధిష్ఠాన దేవత మహాలక్ష్మీ మాత. సింధూరవర్ణంలో అత్యంత కోమలంగా దరహాసంతో ప్రసన్నంగా ఉండే ఈ తల్లికి ప్రేమగా ప్రణామం చేసి సాధకుడు తన సాధనను మొదలుపెట్టాలి. అత్యంత

దీక్షగా అర్గళా ప్రయోగం సక్రమంగా చేసినట్లయితే నిశ్చింతగా సాధనా పథంలో ముందుకు సాగిపోవచ్చు.

నలుచెరగులా సంకటములు చుట్టుముట్టినప్పుడు, ఏ మార్గమూ గోచరించ నప్పుడు ఈ మంత్రమును సఫలతాపూర్వకంగా ప్రయోగించవచ్చు. సాధకుడు నిష్కామముగా ప్రయోగించినచో సాధకునిలో అద్భుతమైన, అంతులేని ఆత్మబలం వికసిస్తుంది. జీవితంలో అలుముకున్న చీకట్లను పారద్రోలటానికి సాధకుడు నిష్కల్మషమైన హృదయంతో, ఆర్తితో ఎలుగెత్తి "అమ్మా, అమ్మా, అమ్మా" అని ఆ తల్లిని పిలిచి తనకు కావల్సినవి అడిగితే, అవి భౌతిక సంపదలు గానీ, ఆధ్యాత్మిక సంపదలు గానీ ఆలస్యం చేయకుండా తక్షణమే ఆమె వాటిని ప్రసాదిస్తుంది.

దుర్గాసప్తశతిలో తృతీయచరణం–కీలకం. మహాసరస్వతి దీని అధిష్టానదేవత. అత్యంత భక్తిశ్రద్ధలతో సాధకుడు కీలకస్తోత్ర పారాయణ చేస్తే సమస్త మంత్ర శక్తులు, సిద్ధులు ప్రకటితమౌతాయి. కీలకం చివరి శ్లోకంలో ఫలశృతి ఇలా చెప్పబడి ఉంది.

**ఐశ్వర్యం యత్ప్రసాదేన, సౌభాగ్యారోగ్య సంపదః ।**
**శతృహానిః పరోమోక్షః స్తూయతే సాన కిం జనైః ॥**

దీని అర్థం తెలుస్తూనే ఉంది కదా! తరువాత ఏ సాధకుడు కృష్ణపక్ష చతుర్దశి లేదా అష్టమినాడు ఏకాగ్రచిత్తుడై భగవతి సేవలో తన సర్వస్వాన్ని ఆ తల్లికి అర్పించి 'దదామి, ప్రతిగృహ్ణామి' అని చెప్పి ఆ తరువాత స్వీకరిస్తాడో వాని ఎడల ఆ తల్లి అత్యంత ప్రసన్నురాలవుతుంది. ఇందులో చేయవలసినదంతా సాధకుడు తన సంపూర్ణ అస్థిత్వాన్ని మాత చరణాలకు సమర్పించడమే!

సంక్షిప్తంగా చెప్పాలంటే ప్రథమ చరితము మహాకాళీసాధన. ఈ పారాయణ సాధకునిలోని అజ్ఞానమును, తమోగుణమును పోగొడుతుంది. అననుకూల పరిస్థితులను పోగొట్టి సమస్యల నుండి బైటపడేస్తుంది. మధ్యమ చరితములో మహాలక్ష్మీసాధన ఇవ్వబడింది. మహాలక్ష్మీ అనగా వనరులను సమకూర్చుకోగలిగే సామర్థ్యమును సాధించుట. ఇది మంచిది అని తెలిశాక దానిని వెంటనే చేసే అలవాటు చేసుకోవాలి. శరీరము బలంగా, ధృఢంగా, ఉత్సాహంగా ఉన్నప్పుడే మంచి పనులు చేయాలి. ఆ తరువాత చేయాలన్నా శరీరము అందుకు సహకరించదు. ఇకపోతే మూడవది ఉత్తమచరితము, మహాసరస్వతి. నికట భవిష్యత్తులో అడ్డంకి తొలగి విశ్వప్రణాళికలో ప్రతి ఒక్కరూ భాగస్వాములు అయ్యే అవకాశము లభిస్తుంది.

**మీ రాజ్యలక్ష్మి**

# ఆదిశక్తి యొక్క లీలాకథలు-1

ఆదిశక్తి యొక్క లీలలను తెలియజేసే గాథలు చెప్పాలనే ఆలోచనలు హృదయంలో పరవళ్ళుతొక్కుతున్నాయి. ఆదిశక్తి యొక్క లీలాగాథలు సూత్రరూపంలో గాయత్రీమహా మంత్రంలోని 24 అక్షరాలలో నిక్షిప్తం చేయబడివున్నప్పటికీ, యుగయుగాలలో ఈ తల్లియొక్క భక్తులు కన్నవి, విన్నవి అయిన ఎన్నో విశేషాలతో కూడిన విస్తృతమైన వివరణ శ్రీ దుర్గాసప్తశతిలో ఇవ్వబడింది. ఋగ్వేదం యొక్క ఋషి అయిన అంభృణుడు చేసిన కన్యావాక్ అనే సాధనకు సిద్ధిరూపంలో ఈ కథలు ఉత్పన్నమైనట్లు చెప్పబడుతున్నది. 'శ్రీదేవీసూక్తము' అనే రూపంలో కూడా ఇది వెల్లడికాబడినది. ఐతే ఇవన్నీ చరిత్రకు చెందిన అంశాలు. భావనాలోకంలో, తల్లియైన భవాని భక్తుల హృదయాలలో నిత్యమూ విరాజమానమై ఉంటుంది. ఆమె ఏవిధంగా 'నిత్యమో' అదేవిధంగా ఆమె కథలు కూడా నిత్యమై విలసిల్లుతున్నాయి. అనంతకోటి బ్రహ్మాండ నాయిక, అఖిలాండేశ్వరి అయిన ఆ తల్లియొక్క లీలాచరిత్ర ఆమె వలే అనంతమైనది. దానిని సరియైన రీతిలో వర్ణించడం సహస్ర ఫణిఫణాలంకృతుడైన ఆ ఆదిశేషువునకు కూడా సాధ్యంకాదేమో! ఇప్పటికీ అమ్మను గురించి సరిగా ఉచ్చరించడం కూడా చేతకాని వ్యక్తులు ఇక ఆమె లీలాగాథలను ఏవిధంగా గానం చెయ్యగలరు?

అయినప్పటికీ ఆ తల్లిమీదనే నమ్మకం. ఆమె తన యొక్క ఈ చిన్నిబిడ్డ యొక్క పిలుపును విని తప్పకుండా సంతసిస్తుంది. కల్లాకపటమెఱుగని, చిన్నపిల్లల స్వచ్ఛమైన మాటలు విని తల్లి కిలకిలా నవ్వుతుంది. వారి చిలుకపలుకులను వింటుంటే ఆమెకు ఎంత ముద్దువస్తుందంటే అమాంతం వారిని ఒడిలోకి తీసుకొని హృదయానికి హత్తుకుంటుందామె! వణుకుతున్న చేతివ్రేళ్ళమధ్య కలాన్ని అదిమిపెట్టి వ్రాస్తున్న ఈ అల్పమైన జీవునకు కూడా అదే నమ్మకం! గోస్వామి మహరాజ్, భగవంతుని చరిత్రను ప్రారంభించటానికి ముందుగా.....

**'జౌ బాలక కహ తోతబరితా సునహి ముదిత మన పితు అరుమాతా'** అంటారు.

అనగా 'పిల్లవాడు చెప్పే మాటలు చిలుకపలుకుల వలె ఉంటాయి. వాని తల్లిదండ్రులు వాటిని ఎంతో సంతోషంతో వింటారు' అని అర్థము. నాకైతే మా

అమ్మే సమస్తమూ! నేను ఎన్నడూ ఎవ్వరివద్దకు వెళ్ళలేదు. మరిక ఎవ్వరిగురించీ వినలేదు, ఆలోచించలేదు. నాకు తెలిసినదల్లా ఒక్కటే. 'సృష్టికర్త ఆమెయే! సృష్టిలో ఏర్పడే ప్రతిఒక్క కదలిక కూడా ఆమెయే!'

ఆదిశక్తిని పరిచయం చేస్తూ మహాకవి తులసీదాసు, 'ఆదిశక్తి జెహి జగ ఉపజాయా' అంటారు. అనగా తన గర్భం నుండీ ఈ యావత్ప్రపంచానికీ జన్మనిచ్చినటు వంటి, మన పాంచభౌతికమైన శరీరాలకేకాదు, మన ఆత్మలకు కూడా తల్లియైనటు వంటి ఆమెయే ఆదిశక్తి!' అని అర్థం. బిడ్డ తన తల్లియొక్క ఉదరంలోనే పోషింప బడతాడు. ఆమె యొక్క రక్తమాంసాల నుండి లభించిన ఒక అంశతోనే అతని అస్తిత్వం నిర్మించబడుతుంది. ఆమె శ్వాసనుండే అతని శ్వాస నడుస్తుంది. గర్భంలో ఉన్నప్పుడు అతడు తల్లికన్నా అభిన్నంకాడు. గర్భంనుండీ వెలుపలకు వచ్చిన తరువాత అమ్మా! అని పిలవడంలో అతనికి ఆనందమూ, తల్లి తనను హృదయానికి హత్తుకున్నప్పుడు శాంతి లభిస్తాయి. తల్లి అతనికి స్తన్యమిచ్చి పెరిగి పెద్దయిన తర్వాత తన చేతితో ఆహారాన్ని తినిపిస్తుంది. తద్వారా అతడు సంతృప్తి చెందుతాడు.

**'యస్యాః పరతరం నాస్తి'** అని వేదవాక్కు అనగా 'ఆమెను మించి మరెవ్వరూ లేరు' అని అర్థం. ఇంకెవ్వరూ ఉండటానికి ఆస్కారం కూడా లేదు. ఆమెయే 'పరాపరాణం పరమా పరమేశ్వరీ' అని చెప్పబడింది. అనగా లౌకికమైన, అలౌకికమైన అన్నింటికన్నా ఆవలవుండే ఆమెయే పరమేశ్వరీ అని తెలుసుకోవాలి. ఆమెను గురించిన సరియైన, ఖచ్చితమైన జ్ఞానం ఎవ్వరికీ లేదు. అయితే ఆమెకు మటుకు అందరినీ గురించిన సంపూర్ణమైన జ్ఞానం ఉంది. ఇది యుక్తమే! ఎందుకంటే, అమాయకుడైన పసిబాలుడు తన తల్లి యొక్క సంపూర్ణత్వాన్ని గురించి ఎలా తెలుసుకొనగలడు? అయితే తల్లికిమాత్రం తన బిడ్డను గురించి సమగ్రంగా తెలుసు. బిడ్డను గురించి తల్లికి తెలియని విషయమేదీ ఉండదు. బిడ్డలు ఆమెతో చెప్పడం వల్ల, ఆమెకు ఈ జ్ఞానం రాదు. ఆమె అంతరంగంలో బిడ్డను గురించిన అనుభూతి వల్ల తెలుసుకొనగలుగుతుంది.

ప్రజ్ఞావంతులు దీనిని అతిశయోక్తిగా భావించవచ్చునేమో గానీ, శ్రద్ధావంతులకు మాత్రం ఇది సంపూర్ణమైన సత్యం! వారి అనుభవం వారికి "ప్రతిఒక్క తల్లీ అంతర్యామియై ఉంటుంది. తన గురించి తాను చెప్పుకొనలేని పిల్లల గురించికూడా

ప్రతివొక్క విషయమూ ఆమె ఎంతో తేలికగా అర్థం చేసుకొనగలదు. చమత్కార పూర్వకమైన వాక్కులకన్నా, సరళతతోనిండిన మృదు భావాలే ఆమె హృదయాన్ని స్పృశిస్తాయి. ఆ మృదుభావాల్లోని ఆర్ద్రత ఆమె హృదయాన్ని తడిపివేస్తుంది. ఇవన్నీ ఈ ప్రపంచంలోని సర్వసాధారణమైన తల్లులకు సంబంధించిన విషయాలు. మరి జగద్ధాత్రియైన ఆదిశక్తి యొక్క అంతర్ జ్ఞానాన్ని గురించి ఏమని చెప్పగలం? ఆమె అంతర్ జ్ఞానం అనంతములకన్నా అనంతమైనది. ఆమెను పిలవటానికి కూడా సాధ్యంకాదనేదిమాత్రం సత్యం! తన బిడ్డల యొక్క హృదయ స్పందనతోపాటే ఆమె హృదయం కూడా స్పందిస్తుంది!" అని తెలియజేస్తుంది.

అమాయకులు, పసివారు అయిన తన సంతానాన్ని గురించి, తల్లికాకపోతే మరి ఎవరు ఆలోచిస్తారు? – అనేది అంగీకరించబడే సత్యం. పిల్లవాడు పిల్లవాడిగానే ఉంటాడు. వాడు నిప్పులో చెయ్యిపెట్టవచ్చు లేదా పామును పట్టుకొనవచ్చు. ఫలితంగా అతడి చేతిని కాల్చవచ్చు లేదా పాము అతడిపై బుసకొట్టవచ్చు. ఏది జరిగినా అతడు కేవలం ఏడుస్తాడు తప్ప ఏమీ చెయ్యలేడు. వీటన్నింటిని గురించి తల్లే ఆలోచించవలసి ఉంటుంది. ఆమెయే ఉఱుకులు–పరుగులు తీయవలసి ఉంటుంది. మన అమ్మయొక్క ఈ అలవాటును గురించి మనకు బాగా తెలుసు, అందువల్లనే మనం సంపూర్ణమైన నిశ్చింతతో ఉండగలుగుతున్నాం. ఎందుకంటే మనం ఎంత అజ్ఞానులం, మూర్ఖులం అయినప్పటికీ మన తల్లి సంపూర్ణమైన జ్ఞానం కలిగిన వ్యక్తి అన్న విషయం మనకు చక్కగా తెలుసు కాబట్టి.

ఆమెను గురించి వేదాలు **'యస్యాః స్వరూపం బ్రహ్మాదయో న జానంతి తస్మాదుచ్యతే అజ్ఞేయా'** అని చెప్తున్నాయి. బ్రహ్మాదిదేవతలకు కూడా ఆమె స్వరూపాన్ని గురించిన జ్ఞానం లేదుకాబట్టి ఆమె 'అజ్ఞేయా!' అని పిలువబడుతున్నది. ఈ దేవతల విషయం నాకు తెలియదు. వారి యొక్క జ్ఞానాన్ని గురించి కూడా నాకేమీ తెలియదు. ఆదిశక్తి అని పిలువబడే నా తల్లి 'మమతామూర్తి' అన్న విషయం మాత్రం నాకు తెలుసు. ఆమె తన బిడ్డలకు, మృదుహృదయులైన తన శిశువులకు, తనను గురించిన సమస్త విషయాలు తెలియజేస్తుంది. అందుచేత మూడు వ్రేళ్ళ మధ్య ఉన్న యీ కలం నుండి, ఆదిశక్తి యొక్క లీలలకు సంబంధించిన వేదాంతపరమైన, యోగ పరమైన, భక్తిమయమైన రహస్యాలు వెల్లడి అవుతున్నవంటే ఆశ్చర్యపడవలసినదేమున్నది? భక్తిపూరితమైన నా భావన కూడా 'అమ్మయే ఈ పని చేయిస్తున్నది' అని చెప్తున్నది.

ఆమె యొక్క అహైతుకమైన కృప ఉన్నట్లైతే మూగవాడు మాట్లాడగలడు, కుంటివాడు కొండను కూడా దాటగలడు. 'ఎట్లా? ఏ విధంగా?' అన్నది ఈ వ్యాసమాల చదివేవారు క్రమంగా తెలుసుకొనగలరు. అమ్మ యొక్క ప్రేమ మీద ప్రగాఢమైన విశ్వాసం, ఆరాధ్య సద్గురువు యెడల నిశ్చలమైన నమ్మకం నాకు ఉన్నాయి.

1986వ సంవత్సరంలో, శాంతికుంజ్‌లోని ప్రవచన వేదికపై నుండి, సద్గురువైన ఆ ప్రభువు ఈవిధంగా చెప్పారు, 'వందనీయ మాతాజీని చూసినవారు నన్ను చూసినట్లే! నన్ను చూసినవారు గాయత్రీమాతను చూసినట్లే!' అనగా పరమపూజ్య గురుదేవులు, వందనీయ మాతా భగవతీదేవి మరియు గాయత్రీమాత... వీరు ముగ్గురూ తాత్వికంగా ఏకస్వరూపులు. వారిలో భేదం లేదు. ముందు ముందు ఒకరి లీలాగాథలో మిగిలిన ఇద్దరి యొక్క లీలాకథలు కూడా ఇమిడిఉన్నాయి' అని కూడా చెప్పుకుంటాం.

శ్రీ దుర్గాసప్తశతి యొక్క ఋషి సుమేధుడు ఈ రహస్యాన్ని కొంత ఈ క్రింది విధంగా తెలియజేశాడు.

**దేవానాం కార్య సిద్ధ్యర్థమావిర్భవతి సా యా । ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యాప్యభిధీయతే ॥ (1/65/66)**

'ఆమె నిత్య, పుట్టుకలేనిది' అయినప్పటికీ, దేవతల యొక్క కార్యాలను సిద్ధింపజేయుటకు అప్పుడప్పుడూ ప్రకటీకృతమౌతుంది. అప్పుడు ఆమె లోకంలో ఉత్పన్నమైనట్లు చెప్పబడుతుంది. ఈవిధమైన ఋషి వాక్కు, 'వేదమాత అయిన గాయత్రీదేవియే అసురసంహారిణియైన దుర్గ'–అనే సత్యాన్ని ధృవీకరిస్తున్నది. ఆమెయే సీత, రాధ, ఆమెయే శ్రీరామకృష్ణుల జీవనసహచరి శ్రీ శారదామాతా, ఆమెయే ప్రభు శ్రీరామశర్మ యొక్క జీవన సహధర్మచారిణియైన వందనీయ మాతా భగవతీదేవి యొక్క స్వరూపంలో ఆవిర్భవించినది. ఆ ఆదిశక్తియే ప్రతి యుగంలోనూ యుగశక్తిగా అవతరిస్తున్నది.

శ్రీ దుర్గాసప్తశతి ఆమె యొక్క దార్శనిక, మాంత్రిక, యోగపరమైన లీలాగాథ. ఇప్పుడు మేం మా పాఠకులచేత ఆ సప్తశతియొక్క శ్రవణం, పఠనం చేయించ బోతున్నాం. భక్తులైనవారు దీనిని చదివి తన్మయులౌతారు. దార్శనికులైన జిజ్ఞాసువులకు (వేదాంతపరమైన సంశయములున్నవారికి) ఇందులో సృష్టివిద్య, ఆత్మవిద్యలకు

సంబంధించిన రహస్యాలు లభిస్తాయి. మంత్రవేత్తలైన వారికి ఈ లీలాగాధలు మంత్ర సాధనకు సంబంధించిన లెక్కలేనన్ని క్రొత్త కోణాలను ప్రసాదించ గలవు. యోగసాధకులు ఇందులోనుండి యోగం యొక్క వివిధ రహస్యాలను పొంద గలరు. సంతానంపట్ల వాత్సల్యం కల్గిన, పరమ దయా మూర్తియైన, అమ్మ యొక్క అభిమానం పిల్లలమైన మాకు లభించినది. అందువల్లనే మా చేతుల నుండి 'శ్రీ దుర్గాసప్తశతి యొక్క గాయత్రీమయ వ్యాఖ్య' వెలువడుచున్నది. పిల్లవాడికైతే **క్షుధాతృషార్తా జననీం స్మరన్తి** – అనేది సాధారణ విషయం. అంటే పిల్లలకు ఆకలి అయినప్పుడు, దాహం వేసినప్పుడు అమ్మను పిలవాలి అన్న విషయం మాత్రం తెలుసు. ఐతే జ్ఞానమూర్తియైన అమ్మ యొక్క జ్ఞానకోశం అక్షయమైనది. దానిలోనుండి ఒక చిన్న అంశం, 'శ్రీ దుర్గాసప్తశతి ఏవిధంగా గాయత్రీమయమైనది' అనే విషయాన్ని పాఠకులు చదివిన తర్వాత తెలుసుకొనగలరు.

## 2. శ్రీ దుర్గాసప్తశతీ యొక్క రహస్యార్థం

ఆదిశక్తి యొక్క లీలలే గాథలై శ్రీదుర్గాసప్తశతీగా రూపుదాల్చి అవతరించినది. ఆదిశక్తి నిత్యమైనది. ఆమె లీలలుకూడా నిత్యమైనవి.

ఆ లీలలను వర్ణించేటటువంటి కథ అయిన ఈ దుర్గాసప్తశతీకూడా నిత్యమైనదే! దేవి యొక్క ఇతర అవతారాల వలెనే యుగయుగాలలో ఇది కూడా ప్రకటీకృతమైనది. మన యొక్క ఈ యుగంలో ప్రస్తుతం అమలులో ఉన్న శ్రీదుర్గాసప్తశతీ యొక్క రూపాన్ని గురించి పురాణంలో ఈ విధంగా చెప్పబడింది. వ్యాసమహర్షి శిష్యుడైన జైమిని మార్కండేయమహర్షిని ఈ కథల యొక్క విచిత్రతను, విశిష్టతను గూర్చి ప్రశ్నించగా, ఆయన తనకు తగినంత సమయం దొరకనందున, ద్రోణముని నలుగురు కొడుకులైన పింగాక్షుడు, వివోధుడు, సుపుత్రుడు, సుముఖుడు అనువారి వద్దకు ఆయన జైమినిని పంపించారు. తమ తండ్రి ఇచ్చిన శాపకారణంగా పక్షియోనిలో జన్మించిన ఆ నలుగురు ఆ సమయంలో వింధ్యపర్వతం మొక్క గుహలలో నివసిస్తున్నారు. మార్కండేయముని, కోష్టుకి (భాగురి)కి చెప్పిన 14మన్వంతరాల విశేషాల సంవాదాన్ని ద్రోణపుత్రులు వినియుంటిరి. ఆ వివరాలను వారు జైమినికి చెప్పారు. అందులో ఎనిమిదో మన్వంతరానికి చెందిన విశేషాలలో ఈ దుర్గాసప్తశతీ యొక్క కథ వస్తుంది.

ఈ గాథలను గురించిన విశేషాలకు ఉపనిషత్తులలోని వేదాంతచర్చను జోడించినచో, తల్లియైన ఆదిశక్తి వలెనే, ఆమె కథలు కూడా పూర్ణమైనవే అన్న విషయం మనకు బోధపడుతుంది.

**'ఓం పూర్ణమద: పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

అని ఉపనిషత్తు వాక్యం. బృహదారణ్యకోపనిషత్తులోని పంచమోధ్యాయం యొక్క ప్రథమ బ్రాహ్మణమునకు చెందిన మొట్టమొదటి ఖండికలో ఇమిడివున్న భావం ద్వారా భావమయి అయిన ఆ దేవి పూర్ణమైనది. ఆమె యొక్క ఈ సప్తశతీలోని కథావతారం కూడా పూర్ణమైనదే. ఎందుకనగా ఆ పూర్ణత్వంలోనుండే ఈ పూర్ణత్వం ఉదయించినది. అంతేకాదు, పూర్ణంలోనుండి పూర్ణమును తీసివేసినప్పటికి పూర్ణత్వమే మిగిలిఉంటుంది అని కూడా మనకు అర్థమౌతుంది.

ఉపనిషత్తులు ఏ బ్రహ్మ గురించి చర్చించునో, ఆ బ్రహ్మం జగదంబయే!! దేవ్యథర్వశీర్షంలో ఆమెయే స్వయంగా **'అహం బ్రహ్మస్వరూపిణి'** అనగా నేను బ్రహ్మ రూపమును అని ప్రకటించింది. అంతేకాదు **వేదోహం** అని కూడా సెలవిచ్చినదామె. అనగా నేనే వేదాన్ని అని అర్థం. ఆదిశక్తి యొక్క ఉపాసకులైన సాధకులు ఒకొక్క యుగంలోనూ అనుభూతి చెందిన ఈ అంశం ఎంతో సత్యమైనది. ఆ తల్లి వేదమే కాదు, వేదజననికూడా! సూత్రరూపంలో ఆమె గాయత్రీ అయితే, శాస్త్రరూపంలో శ్రీదుర్గాసప్తశతీగా విలసిల్లుతున్నది. వేదాలలో చెప్పబడిన విషయమే మంత్రరూపం లోనూ, సూత్రరూపంలోనూ, గాయత్రీమంత్రం యొక్క 24 అక్షరాలలో, 9 శబ్దాలలో, మూడు చరణాలలో కూడా వ్యక్తీకరించబడియున్నది. ఈ తత్త్వమే శ్రీ దుర్గాసప్తశతీ మొక్క మూడు చరిత్రలలో, 13 అధ్యాయాలలో చెప్పబడియున్నది.

శ్రీ దుర్గాదేవి మొక్క 9 రూపాలలో గాయత్రీమంత్రం యొక్క 9 శబ్దముల మర్మం ఇమిడిఉన్నది. శ్రీదుర్గాసప్తశతీ యొక్క సంపూర్ణతత్త్వమును తెలియజేయుటకు భగవంతుడైన సదాశివుడొక్కడే సమర్థుడు. మహాకాలుడైన ఆ పరమేశ్వరుడు మహాకాళియైన పరమేశ్వరి యొక్క లీలలనుగూర్చి తెలిసినవాడు. మేరుమంత్రములో ఆయన ఈ క్రిందివిధంగా వచించియున్నాడు.

**సప్తశత్యాక్ష్వ సకలం తత్త్వం వేద్యయమేవహి ।**
**పాదోనం శ్రీహరిర్వేత్తి వేత్యర్థం తు ప్రజాపతిః ॥**
**వ్యాసస్తుయ్యాంశకం వేత్తి కోట్యంశమితరే జనః ॥**

అనగా "శ్రీదుర్గాసప్తశతీ యొక్క సంపూర్ణమైన రహస్యాన్ని గూర్చి నాకుమాత్రమే సంపూర్ణంగా తెలియును. విష్ణుభగవానునకు దీనియొక్క మూడు పాదాలను గురించిన విషయాలు తెలుసు. బ్రహ్మదేవునికి రెండు పాదాలను గురించిన జ్ఞానమున్నది. ఇతరులైన జనులు దీనిగురించి కేవలం కోటిలో ఒక వంతు మాత్రమే తెలుసు కొనగలరు' అని అర్థం.

ఈ ఒకవంతు కూడా ఎంత మహత్త్వపూర్ణమైనదంటే దీని అనుభూతి చెందిన తరువాత జీవితంలో ధర్మార్థ కామమోక్షములనే చతుర్విధపురుషార్థములు వాటంతట అవే లభ్యమవుతాయి. ఆతల్లి యొక్క దయ అనే కొంగునీడలో కూర్చున్నంత మాత్రముననే సమస్తమైన కష్టములు, ఆపదలు వాటంతట అవే తొలగిపోతాయి. అన్నిరకములైన భౌతిక, ఆధ్యాత్మిక సంపదలు తామే స్వయంగా నడచివచ్చి సాధకుని చెంతకు చేరగలవు. శ్రీ దుర్గాసప్తశతీని ఒక పుస్తకం అని మాత్రమే అని భావించేవారు మూర్ఖులే అవుతారు. తన సంతానం పట్ల ఎంతో వాత్సల్యం కలిగిన తల్లియొక్క మంత్రరూపమిది. దీని చెంతకు వచ్చినవారికి జగన్మాత యొక్క ప్రేమ, మమతలేకాదు, వారు కోరుకున్నవి ఏదైనాసరే ప్రతిక్షణమూ లభిస్తూనే వుంటాయి. ఇంతకన్నా అధికంగా ఏమి చెప్పగలం? దీని సహాయంతో అసంభవమనుకున్నవి కూడా సంభవమైతీరుతాయి.

వేదమయి, దేవజనని యొక్క రూపమైన శ్రీ దుర్గాసప్తశతీని ఏ సాధకుడైనాసరే ఎంతో సహజంగా అర్థం చేసుకొనగలడు. వేదాలకు ఆరు అంగాలు ఉంటాయి 1. శిక్ష 2. కల్పం 3. వ్యాకరణం 4. నిరుక్తం 5. ఛందశ్శాస్త్రం 6. జ్యోతిష్యం. ఈ ఆరు వేదాంగముల వలెనే శ్రీ దుర్గాసప్తశతీకి కూడా ఆరు అంగాలు ఉన్నాయి. 1. శ్రీదేవీ కవచము 2. అర్గళా స్తోత్రము 3. కీలకం 4. ప్రాధానిక రహస్యం 5. వైకృతిక రహస్యం 6. మూర్తి రహస్యం. ఈ ఆరు అంగాలలోనూ జీవితం – సృష్టి ఈ రెండింటికి సంబంధించిన వివిధరకాలైన రహస్యాలు ఇమిడిఉన్నాయి. తన మూలరూపంలో శ్రీ దుర్గాసప్తశతీ మూడువేదముల స్వరూపం. ఋగ్వేదస్వరూపమైన

ప్రథమ చరిత్ర - సృష్టి జ్ఞానాలకు చెందిన మొట్టమొదటి (తొలి) రహస్యాలను వెల్లడిచేస్తుంది. యజుర్వేదస్వరూపమైన రెండవ చరిత్రలో జీవితం సృష్టి ఈ రెండింటి యొక్క అభివృద్ధికి చెందిన ఆధ్యాత్మిక సూత్రములున్నాయి. ఇక మూడవ చరిత్ర సామవేదస్వరూపం. ఇందులో పరా-అపరా ప్రకృతికి చెందిన జ్ఞానానికి సంబంధించిన గీతములు గానం చేయబడ్డాయి.

గాయత్రీమంత్రం వేదాలయొక్క సారం. ఆ విధంగానే నవార్ణమంత్రం శ్రీ దుర్గాసప్తశతీయొక్క సారం. గాయత్రీమహామంత్రం యొక్క ప్రథమ బీజాక్షరమైన **'ఓంకారం'** యొక్క భావం నవార్ణమంత్రం యొక్క వాగ్బీజమైన **'ఏం'**తో కలుస్తుంది. వ్యాహృతీ త్రయం యొక్క ఉత్కృష్టభావం మాయాబీజరూపమైన **హ్రీం** శబ్దముతో కలుస్తుంది. వ్యాహృతులు సంపూర్ణమైన క్రియాశీలతను కలిగి ఉంటాయి. నవార్ణంలో మాయను గూర్చి చెప్పబడియున్నది. గాయత్రీమంత్రం యొక్క ఒకటవ, రెండవ పాదాలకు..... 'ఆ తేజోమయుడైన, శ్రేష్ఠుడైన, సర్వవ్యాపకుడైన భగవంతుడిని నేను ధ్యానిస్తున్నాను" అని అర్థం. మనస్సు దేనినైతే ధ్యానిస్తుందో ఆ రూపంలోకి మారిపోతుంది. సాధకుడు సవితామయుడుగా మారే భావం నవార్ణమంత్రం యొక్క **'క్లీం'** బీజంలో నిహితమైయున్నది. **'ధియోయోనః ప్రచోదయాత్'** అనగా 'ఎవరైతే నా బుద్ధిని సన్మార్గంవైపు ప్రేరేపించుచున్నారో' అని అర్థం **చాముండాయై విచ్చే** అనే శబ్దం కూడా ఇదే భావాన్ని కలిగియున్నది. అనగా 'చాముండీదేవిలో నేను అర్పితం కాగోరుతున్నాను' అని అర్థం. గాయత్రీ మంత్రంలో సాధకుడు 'స్థితిలో గతిని' కోరుకుంటున్నాడు. నవార్ణమంత్రంలో సాధకుడు 'ఎవరిలోనైతే ఈ విశ్వం యొక్క ఉత్పత్తి, స్థితి, లయ ఈ మూడు కూడిఉన్నాయో, ఎవరైతే ఈ విశ్వం యొక్క గతిని పర్యవేక్షిస్తున్నారో, 'చణ్డవేగేతిచాముణ్డా' అని చెప్పకే ఆ చాముండిలో (తీవ్రమైన వేగంలో), **విచ్చే** శరణు పొందగోరుతున్నాడు లేదా అర్పణ చేసుకొనగోరుతున్నాడు.' ఈ విధంగా గాయత్రీ మంత్రం యొక్క సంపూర్ణ భావం నవార్ణమంత్రంలో ఉంది.

ఇంతేకాదు శ్రీదుర్గాసప్తశతీ స్వయంగా గాయత్రీ మంత్రమయమే!! గాయత్రీ మంత్రం యొక్క మూడు పాదాలు శ్రీదుర్గాసప్తశతీ యొక్క మూడు చరిత్రలకు ఆధారమైయున్నది. గాయత్రీ మంత్రం యొక్క మొదటి చరణమైన **'తత్సవితుర్వరేణ్యం'** దుర్గాసప్తశతీ యొక్క ప్రథమ చరిత్ర. ఈ చరిత్ర యొక్క అధిష్ఠాన దేవత మహాకాళి. ఋషి-బ్రహ్మ. సృష్టి ఉత్పత్తి సమయంలో, అంధకారాన్ని నశింపచేయుటకై మహాకాళి

క్రియాన్వితమౌతుంది. గాయత్రీమంత్రంలోని మొదటి పాదాన్ని సాధకుడు హృదయంగమం చేసుకుని, ఎప్పుడైతే సవితాదేవతను తన ఆరాధ్యదైవంగా ఎన్నుకుంటాడో, అప్పుడే అతని అస్తిత్వంలోని అంధకారం తొలగిపోవడంతోపాటు, ఆధ్యాత్మిక ఉషోదయం ప్రారంభమౌతుంది కూడా!!

గాయత్రీ మంత్రం యొక్క రెండవ పాదమైన **'భర్గోదేవస్యధీమహి'**కి విస్తృతమైన వివరణ శ్రీదుర్గాసప్తశతీ యొక్క మధ్యమ చరిత్రలో ఉన్నది. ఈ చరిత్రకు అధిష్ఠాన దేవత శ్రీ మహాలక్ష్మి, ఋషి–శ్రీమహవిష్ణువు, **'భర్గోదేవస్యధీమహి'** అనగా సవితాదేవత యొక్క తేజస్సును ధరించిన సాధకునకు యోగం, ఐశ్వర్యం లభ్యమౌతాయని అర్థం. అతనికి పాలనా, పోషణా సామర్థ్యం కలుగుతుంది. దీనినే విష్ణుతత్త్వంగా, మహాలక్ష్మియొక్క కృపగా తెలుసుకొనవలెను. గాయత్రీమంత్రం యొక్క మూడవపాదం **'ధియోయోనః ప్రచోదయాత్.'** దీనియొక్క వివరణ శ్రీదుర్గాసప్తశతీ యొక్క మూడవ చరిత్రలో పొందుపరచబడినది. దీనికి మహాసరస్వతి అధిష్ఠానదేవత కాగా, ఋషి–రుద్రభగవానుడు. ఈస్థితిలో సాధకుడు తన కర్మబీజాలను సంపూర్ణంగా నశింప జేసుకొని, మోక్షజ్ఞానాన్ని పొందుతాడు. ఇదే గాయత్రీమంత్రం యొక్క చరమ లక్ష్యం. ఇక్కడ భగవంతుడైన రుద్రదేవుని కృప, మహాసరస్వతియొక్క జ్ఞానం ప్రకటీకృత మౌతాయి. శ్రీదుర్గాసప్తశతీకి చెందిన రహస్యార్థములు ఇంకా మరెన్నో కలవు. వాటినన్నింటినీకూడా ముున్ముందు క్రమంగా వివరించబడతాయి.

ఓం శాంతిః శాంతిః శాంతిః

★★★

# 3. శ్రీ దుర్గాసప్తశతి యొక్క రహస్యం, పారాయణ విధానం

ఆదిశక్తి యొక్క లీలలనే కథల (గాథలు)ను తనలో ఇముడ్చుకున్న శ్రీ దుర్గాసప్తశతి ఆధ్యాత్మిక సంపదల, వైభవాల భాండాగారం. దీని యొక్క గూఢమైన అర్థాలు అద్భుతమైనవి, విలక్షణమైనవి. దీనియొక్క ప్రతి అక్షరంలోనూ తత్త్వజ్ఞానం, తంత్రజ్ఞానం జోడింపబడివున్నవని సాధనామయమైన జీవితం ద్వారా తేలిన సత్యం. ఇందులో లోతైన వేదాంతజ్ఞానం ఉంది. అదే విధంగా జటిలమైన సాధనల యొక్క

సాంకేతిక జ్ఞానమున్నది. అయితే అక్షయమైన ఈ జ్ఞానకోశం పైన కఠోరమైన తాళం వేయబడిఉంది. సాధకుడికి ఎంతో కఠినమైన, కఠినతరమైన, కఠినతమమైన పరీక్షలను నిర్వహించవలసి ఉంటుంది. పరీక్షలో సఫలీకృతమై, పాత్రత సిద్ధించి నప్పుడు భగవతి యొక్క వరప్రసాదం వలన అసంభవమనకున్నవన్నీ ఒక్కసారే సంభవమగుటయేకాదు, సాకారమౌతాయికూడా! అవును, ఇది మూడు కాలాలోనూ, ముమ్మాటికీ నిరూపితమైన సత్యం. శ్రీ దుర్గాసప్తశతిని అనుష్ఠానం చేయడం వల్ల సమస్తమూ సంభవమే! అయితే, దీని యొక్క నిగూఢమైన అర్థాన్ని తెలుసుకొనుటకై తీవ్రంగా ప్రయత్నించినవారి విషయంలో మాత్రమే ఇది సత్యం.

ఈ రహస్యార్థం యొక్క మొట్టమొదటి ప్రవేశద్వారం ఆదిశక్తి యొక్క లీలాగాథ! దీని యొక్క సాహిత్యసౌందర్యం, కావ్యసౌందర్యం ఎంతో ప్రత్యేకమైనవి. దీని యొక్క మర్మం కూడా చాలా లోతైనది. ఈ లీలాగాథ మూడు చరిత్రలలో, 13 అధ్యాయాలలో, 700 మంత్రాలలో ఇమిడిఉన్నది. వీనిలో మొదటి చరిత్రయొక్క అధిష్ఠానదేవత భగవతి మహాకాళి, దానికి ద్రష్ఠయైనటువంటి ఋషి సృష్టికర్తయైన బ్రహ్మ. ఈ గాథ సృష్టియొక్క ప్రారంభకాలానికి సంబంధించినది. మొదటి అధ్యాయం మొదటి శ్లోకం నుండి 104 మంత్రాలలో చెప్పబడిఉంది. ఇందులో చీకటిని పారద్రోలేటటువంటి, చీకటికి అధిస్ఠానదేవతయైన దేవి మహాకాళియొక్క ప్రబోధంతో లీలాపురుషుడైన విష్ణుభగవానుడు మధు–కైటభులను సంహరిస్తాడు. ఫలితంగా సృష్టికర్తయైన బ్రహ్మదేవునికి సృష్టిని రచించటానికి మార్గం సుగమమౌతుంది.

రెండవ చరిత్రయొక్క అధిష్ఠానదేవత మహాలక్ష్మి. స్వయంగా విష్ణుభగవానుడే దీనికి ద్రష్ఠ! తల్లియైన మహాలక్ష్మీదేవి ఇందులో మహిషాసురుని సంహరిస్తుంది. మహిషాసురమర్దిని యొక్క ప్రత్యేకమైన ఈ చరిత్ర 2, 3, 4 అధ్యాయాలలోని 69, 44, 42 మంత్రాలలో చెప్పబడియున్నది. మహిషుని యొక్క మాయను నాశనం చేసిన కారణంగా, ఇక్కడ భగవతి 'మహామాయ'గా మారి, తన యొక్క లీలను విస్తృతంగా గావించింది. ఈమె దయవలన సాధకుడు అన్నివిధాలైన లౌకిక, ఆధ్యాత్మిక సంపదలను పొందగలడు. దీని తరువాత మూడవ చరిత్ర యొక్క విస్తృతమైన వర్ణన ఉంది. దీనికి అధిష్ఠానదేవత శక్తిస్వరూపిణి మహాసరస్వతి, ద్రష్ఠ స్వయంగా మహారుద్రుడే! ఈ చరిత్ర ఐదు మొదలుకొని పదమూడవ అధ్యాయం

వరకు విస్తరించియున్నది. శుంభ-నిశుంభుల యొక్క గర్వాహంకారాలను అణచివేసిన గాథ ఇది. అలాగే ఈ మహాగాథలో దేవి అనేక రూపాలలో ప్రకటీకృతమౌతుంది.

ఈ లీలగాథకు చెందిన మూడు చరిత్రలను అర్థం చేసుకొనుట వలన సాధకునిలో భక్తి జాగృతమౌతుంది. అతనిలో సాత్త్వికమైన జిజ్ఞాస ఉదయిస్తుంది. ఫలితంగా అతడు దీనియొక్క తాత్త్విక రహస్యాలను తెలుసుకొనుటకు అధికారి కాగలుగుతాడు. తాత్త్విక రహస్యాల వరుసలో ద్వైతం-అద్వైతం - ఈ రెండింటి యొక్క సౌందర్యం వెదజల్లబడినది. ప్రస్తుతం అమలులో ఉన్న వేదాంతపరమైన అర్థాలతో ఈ రెండింటినీ సంఖ్యాపరంగా, వేదాంతపరంగా పోల్చవచ్చుగానీ, అది ఖచ్చితంగా ఆ విధంగా లేదు. మూల ప్రకృతి నుండి ఈమె వికాసక్రమము ఏవిధంగా జరిగినది అన్న విషయం ఇక్కడ మనకు లభ్యమౌతుంది, ఈ స్థితి అద్వైత తత్త్వానికి సంబంధించినది. వేదాంతముల యొక్క బ్రహ్మ ఇక్కడ శక్తిలోనే భాసిస్తున్నాడు. ఇది అద్వైతమే, కానీ శక్త్యాద్వైతం. **'మమైకైతిష్ఠ'** (10/8) అనగా 'నేను ఒక్కదానినే ఉన్నాను' అని భగవతి చెప్పిన వాక్యాలలో దీనికి ప్రమాణం లభిస్తుంది.

వేదాంతపరమైన ఈ రహస్యార్థం బోధపడిన తరువాత సాధకుని 'యోగ రహస్యము'నకు చెందిన ద్వారం తెరువబడుతుంది. యోగరహస్యానికి చెందిన ఈ ప్రక్రియ కఠినమైనదీ, సులభమైనదీ కూడా!! ఇప్పటివరకూ మోహ పాశాలలో, కర్మబంధాలలో చిక్కుకున్నవారికి ఇది కఠినం. ఇటువంటి వారికి ఎన్ని దెబ్బలు తగిలినా అర్థం కాదు. నిజమైన వివేకవంతులకు ఇది సుగమం. రాజా సురథ, సమాధి వైశ్య, మేధా ఋషి... అనే మూడు స్థితులను సాధకుడు సాధించవలసి ఉంటుంది. వీనికి సంబంధించిన జ్ఞానం, 'కొన్ని పంక్తులలో ఇమడ్చలేనటువంటి నిగూఢమైనది. జటిలమైన ఈ విషయం, దీనికి సంబంధించిన మంత్రాలలో కొద్ది కొద్దిగా అర్థమౌతూ ఉంటుంది. ఈ మంత్రములలో యోగసాధనకు చెందిన విఘ్నాలు, యోగ గ్రంథుల గురించిన జ్ఞానం మాత్రమే గాక, వీటి నివారణకు సంబంధించిన విధివిధానాలు కూడా విస్తృతంగా వివరించబడిఉంటాయి. యోగం యొక్క రహస్యార్థాలను తెలుసుకొని, ఏ సాధకుడైనా తన సాధనలో ఎదురయ్యే విఘ్నాలను తొలగించుకొని, కుండలినీ శక్తి యొక్క ఆరోహణ ప్రక్రియను చక్రబేధన క్రియనూ సాధించుకొనగలడు.

యోగరహస్యాలను తెలుసుకున్న తర్వాతగానీ లేదా వీనిని తెలుసుకుంటూ ఉన్నప్పుడుగానీ సాధకుని ఎదుట తంత్ర రహస్యార్థములు తెరువబడతాయి. ఇది దుర్గాసప్తశతి యొక్క అత్యంత గోపనీయమైన భాగం. ఇందులో తంత్రం యొక్క స్థూలప్రక్రియలు ఉన్నాయి. వాటితోపాటే సూక్ష్మపక్షాలు కూడా ఉంటాయి. 'ఏయే మంత్రాల యొక్క ప్రయోగం, ఏ ప్రత్యేక స్థితులలో, ఏయే సామగ్రితో చేయవలసిన విషయాలు స్థూల ప్రక్రియలలో ఉద్ఘాటించబడినవి. తాంత్రిక యజ్ఞపద్ధతిలో జరిగే ఈ ప్రక్రియలో సాంకేతికమైన వివరణ, వివేచనను తెలుసుకొనవచ్చు. సూక్ష్మమైన తాంత్రిక క్రియలు చేతనత్వం యొక్క పదార్థస్థాయి నుండి, ప్రాణం యొక్క ఉన్నతస్థితి నుండీ పైకి లేస్తూ చిత్తశక్తి యొక్క లీలారహస్యాలను తెలుసుకొనుటకు సమాయత్తమవుతూ ఉంటుంది. ఈ క్రమంలోనే కుండలినీ జాగరణ, షట్చక్రబేధన పద్ధతి కూడా ఉంటాయి. విధిపూర్వకంగా తాత్వికదీక్ష తీసుకున్నవారికీ లేదా యోగంలో అత్యంత ముఖ్యమైన భాగాలను పూర్తిచేసినవారికి మాత్రమే ఇది వర్తిస్తుంది.

తంత్రం యొక్క రహస్యార్థాలతోనే మంత్రం యొక్క రహస్యార్థాలు కూడా జోడింపబడిఉంటాయి. తాంత్రిక క్రియనుండీ వీటిని పూర్తిగా వేరుచేయలేం. అయితే ఈ ప్రయోగం అనుకున్నంత కఠినమైనది కాదు. ఈ మంత్రప్రయోగాల క్రమంలోనే శ్రీదుర్గాసప్తశతిని చదువవలసిన విధానమున్నది. సాధకులు చెప్పినదానినిబట్టి, శాస్త్రాలలో వర్ణించిన దానిని బట్టి, 11 పాఠ్యక్రమాలు ప్రచారంలో ఉన్నాయి. అందులో మొదటిది **(1) మహావిద్యాక్రమం.** దీనివలన సమస్త కోరికలు నెరవేరగలవు. ఇందులో ప్రథమభాగం, మధ్యభాగం, ఉత్తరభాగం వరుసక్రమంలో చదువవలెను. రెండవది **(2) మహాతంత్రి వరుస.** శత్రునాశనం, ఐశ్వర్యప్రాప్తిని కోరి దీనిని చదువవలెను. ఇందులో ఉత్తరభాగం, ప్రథమభాగం, మధ్యభాగం....... ఈ వరుసలో పఠించవలెను. మూడవది **(3) చండీక్రమం.** శత్రునాశనం కొరకు దీనిని ఉత్తరం, మధ్యమం, ప్రథమం.... ఈ వరుసలో పఠించవలెను. నాలుగోది **(4) మహాచండీ క్రమం.** ఉత్తర, ప్రథమ, మధ్యమభాగాలనే వరుసలో ఈ చరిత్రను పఠించవలెను. ఇది కూడా శతృనాశనం చేసి, ఐశ్వర్యమును సమకూర్చగలదు. ఐదవది **(5) సప్తశతిక్రమం** సంపదలు, జ్ఞానాన్ని ప్రాప్తింపజేయును. మధ్యమం, ప్రథమం, ఉత్తర చరిత్ర.... క్రమంలో దీనిని పఠించవలెను. ఆరవ (6) విధానాన్ని **మృతసంజీవని**

**పద్ధతి** అంటారు. ఇది ఆరోగ్యలాభాన్ని చేకూర్చగలిగేది. ఈ క్రమంలో మధ్యమ, ఉత్తర, ప్రథమ చరిత్రలను వరుసలో పఠించవలెను. ఏడవది **(7) రూపదీపిక.** ఇది విజయాన్ని, ఆరోగ్యాన్ని ప్రసాదించగలిగేది. ప్రథమ, ఉత్తర, మధ్యమ చరిత్రలను వరుసక్రమంలో పఠించాలి. దీనితోపాటే విశేషమంత్రాన్ని సంపుటీకరించే పద్ధతి కూడా ఉంది. దీని తరువాత ఎనిమిదవ (8) దానిలో **నికుంభలా విధానంలో** పఠించే క్రమం వస్తుంది. ఇది సంరక్షణకు, విజయానికి మధ్యమ, ప్రథమ, ఉత్తర చరిత్రలను క్రమంగా పఠించడం దీని ప్రయోగ విధానం. ఇది కూడా విశేష మంత్రాలతో సంపుటీకరించబడగలదు. తొమ్మిదవది **(9) యోగినీ పాఠవిధానం.** బాలోపద్రవమును (బాలరిష్ఠాలను) అణిచివేయుటకు ఉపయోగపడుతుంది. ఇందు లోని ప్రతిఒక్క చరిత్రకూ ముందర 64 యోగినుల గురించి పాఠం విశేష మంత్రాలతో సంపుటీకరించే విధానమున్నది. పదియవది **(10) సంహార క్రమం.** ఇందులో 701వ శ్లోకం మొట్టమొదటి శ్లోకం వరకూ విలోమక్రమంలో పఠించే విధానమున్నది. పదకొండవ **(11) ఇది అక్షరం అక్షరం విలోమ పాఠమే!!** ఇందులో మొదట మహా విద్యాక్రమం అనగా నేరుగా చరిత్ర పఠనమేకాక, ఇతర క్రమాలు విశేషసాధకులకు నిర్దేశింపబడిఉన్నవి. సాధన యొక్క ఈ విశిష్టస్థితి, 'విధివిధానంగా 24 లక్షల గాయత్రీమంత్రాన్ని కనీసం ఐదుసార్లు పురశ్చరణ గావించినవారందరికీ' ప్రాప్తిస్తుంది' దానితోపాటే సప్తశతిలోని మహావిద్యాక్రమంలో కనీసం వెయ్యిసార్లు చదివి ఉండవలెను. ఐతే ఇక్కడ చెప్పితీరవల్సిన విషయం ఒక్కటున్నది. పైన చెప్పబడిన పాఠ్యవిధానములన్నీ ఒక ప్రత్యేక ముహూర్తంలో, ప్రత్యేక పద్ధతిలో చేసినప్పుడే సఫలీకృతమౌతాయి. ప్రత్యక్షమైన చర్చలో మాత్రమే తెలుసుకొనగలిగిన రహస్యార్థమిది!! కొద్దిమంది విశేష సాధకులు మాత్రమే దీనికి అధికారులు కాగలరు. ఈ విషయంలో సంక్షిప్తమైన సత్యం మరియొకటున్నది. వేదమాత వరప్రదాయిని అయినట్లయితే సాధకునికి సర్వవిధాలైన జ్ఞానములు వాటంతట అవే లభిస్తాయి.

## 4. సఫలతకు మూలాధారం పారాయణ

ఆదిశక్తి యొక్క లీలలనే కథల (గాథలు)ను తన యొక్క ప్రతి అక్షరములోనూ కూర్చబడియున్నటువంటి శ్రీదుర్గాసప్తశతి ప్రయోగము అమోఘమైనది. తమ యొక్క

అస్తిత్వంలో దీనిగురించి అనుభూతిచెందిన వారికి, దీనిని పారాయణ చేయవలసిన విధివిధానమును గురించి సహజంగానే కుతూహలం ఉంటుంది. భగవతి యొక్క లీలాగాథలకు సంబంధించిన పారాయణ క్రమాల గురించి గత సంచికలో వివరణ ఇవ్వబడినది. అయితే దైనందిన జీవన విధానంలో దీనిని ఏ విధంగా స్వీకరించాలి అన్న ప్రశ్న ఇంకా మిగిలిఉన్నది. సామాన్యమైన సాధకుడు దీనిని ఏ విధంగా ప్రయోగించాలి? సర్వసాధారణమైన ప్రజలకు దీనిని పఠించవల్సిన విధివిధానం ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం ఇవ్వకుండా, ఆదిశక్తియొక్క లీలాగాథకు సంబంధించిన విభిన్న అంగములు, పలురకములైన మంత్రములకు చెందిన వేదాంతపరమైన, ఆధ్యాత్మిక రహస్యాలను వెల్లడి చేయడం మంచిది కాదు. ఈ ప్రశ్నలకు సరళమైన, సరసమైన సమాధానం ఇవ్వడంలో మరియొక లాభం కూడా ఉంది. ఏ సాధకుడైనా దీనిని సాధన చేస్తూ ఈ పవిత్రమైన లీలాగాథను పఠించవలెనని కోరుకున్నట్లయితే, అతడి మార్గం సహజంగానే శ్రేష్ఠమౌతుంది.

శ్రీ దుర్గాసప్తశతిని పారాయణ చేయవల్సిన విధివిధానమును తెలుసుకొనుటకు ఉత్సాహపడే సాధకులు ముందుగా శ్రీ దుర్గాసప్తశతి పుస్తకమును సంపాదించాలి. మార్కెట్టులో ప్రస్తుతం పలు ముద్రణాసంస్థలు వెలువరించిన పలు పుస్తకములు ఉన్నవికానీ గమనించి చూస్తే చాలావాటిలో ముద్రణా లోపాలు కొన్ని ఉన్నాయి. గీతాప్రెస్ ద్వారా ముద్రించబడిన పుస్తకం మాత్రం అన్నివిధాలా బాగున్నది. ప్రారంభంలో ఈ పుస్తకం యొక్క రెండు ప్రతులను తీసుకొనడం మంచిది. మొదటిది పారాయణానికి, రెండవ పుస్తకాన్ని లీలాగాథలోని వివిధమంత్రాలను నిత్యమూ స్వాధ్యాయము చేస్తూ, మననం చేసుకొనటానికి వాడవచ్చు. పారాయణానికి ఎన్నుకొనిన పుస్తకమును పూజాస్థలంలో మాత్రమే ఉంచాలి. దానితోపాటు ఈ పుస్తకానికి జగదంబ యొక్క సాకారమూర్తికి ఇచ్చే గౌరవాన్ని ఇవ్వాలి. స్వాధ్యాయము కొరకు ఎన్నుకొనిన పుస్తకమును జాగ్రత్తగా చదివి అందులోని విషయాలను బాగా అర్థం చేసుకొనుటలో ఎటువంటి ఇబ్బందీ రాకుండా ఉంటుంది. ఇప్పుడు పారాయణను ప్రారంభించబోతున్న సాధకులందరికీ ఒక విన్నపం. అది ఏమిటంటే, దీనిని పారాయణ చేయుటకు విధివిధానము ఎంత అవసరమో, సాధకుని యొక్క ఆహారవిహారములు, ఆలోచనాక్రమం ఎంతో సరళంగానూ, సాత్త్వికంగానూ ఉండే విధంగా జాగ్రత్త తీసుకొనుటకూడా అంతకన్నా ఎక్కువ అవసరం. ఇందుకొరకు

సాధకులు గాయత్రీ అనుష్ఠానమునకు అవసరమయ్యే అన్నిరకాలైన నియమాలు–ఉప నియమాలను పాటించవలెను. దీని ప్రయోగంలో నిష్ణాతులైన వారందరూ ముక్తకంఠంతో చెప్పేదేమంటే 'ఇందులో బ్రహ్మచర్యమునకు అత్యంత ప్రాముఖ్యత ఉంది. సాధకుడు బ్రహ్మచర్యాన్ని ఎంత జాగ్రత్తగా పాటించగలడో, సాధన అంతే ఫలితాన్నిస్తూ ముందుకు సాగగలదు. త్రికరణశుద్ధితో బ్రహ్మచర్య వ్రతాన్ని నిష్ఠగా పాటించే సాధకుడు ఇతర నియమాలేవైనా పాటించకపోయినప్పటికీ, ఆహార–పానీయాలు తీసుకునే విషయంలో కొంత వ్యత్యాసం జరిగిననూ, అతని సాధన ఎంతో మంచి ఫలితాలనివ్వగలదు.

ఈ విషయమై **'కఠినమైన కష్టాలలో, శత్రుబాధలో, కుట్రదారుల మధ్య చిక్కుకున్నప్పుడు, గ్రహబాధలు, దారుణంగా ఉన్న విషమ పరిస్థితులు లేదా ఏదో విధంగా భయానకమైన, వికృతమైన, భీషణమైన పరిస్థితులు ఎదురైనప్పుడు, బ్రహ్మచర్యాన్ని నిష్ఠగా పాటించే వ్యక్తి ఎవరైనా ఈ ప్రయోగాన్ని చేసినట్లయితే, సమస్తమైన దారుణ, భీషణ పరిస్థితులన్నీ చెల్లాచెదరైపోతాయి'** అని అనుభవజ్ఞులు తెలియజేస్తున్నారు. సరిగ్గా చెప్పాలంటే ఒకటి రెండు గంటలలోనే ఈ ప్రయోగం ఫలితాన్నిస్తుంది. ఇంద్రునితో సమానమైన పరాక్రమవంతుడైన రాజుకూడా ఈ ప్రయోగాన్ని చేసే సాధకుని ముందు నిలబడలేడు. కుట్రలు పన్నేవారందరూ, వారు చేసే కుట్రలు ఈ ప్రయోగకర్త ముందు విఫలమైపోతాయి. వారి తేజస్సు నాశనమౌతుంది. వారి ఆత్మబలం క్షీణించిపోతుంది. వారు అన్నివిధాల విఫలురై దెబ్బతింటారు.

ఇప్పుడిక పారాయణక్రమమును ప్రారంభించటానికి ప్రథమంగా మంచిరోజులను చూడాలి. కాని ఆపద వచ్చినప్పుడు ఈ ఆలోచనను వదిలివేయాలి. కానీ గాయత్రీ మహామంత్రం అన్ని మంత్రముల ప్రయోగాలకూ ఆధారం కాబట్టి సాధకుడు ఈ **దుర్గాసప్తశతి పారాయణ కాలంలో నిత్యమూ ఒక సహస్ర గాయత్రీని జపించాలి.** ఒక వేళ ప్రయోగం దీర్ఘకాలికమైనది లేదా అతి విశిష్టమైన ప్రయోజనాన్ని ఆశించినది అయినట్లయితే, దానికనుగుణంగా గాయత్రీ మంత్రజపం 24 వేలు, ఒక లక్షా పాతిక వేలు లేదా 24 లక్షల జపం, అనుష్ఠానపూర్వకంగా చేయవలెను. మంచి అనుభవజ్ఞులైన పండితులు, 'గాయత్రీ మహా మంత్ర మహా పురశ్చరణ చేసిన తరువాత ఎవరైన సాధకుడు ఈ విశిష్టమైన ప్రయోగం చేసినట్లయితే

విధివ్రాతను మార్చుకొనుటలోకూడా సమర్థుడు కాగలడు' అని తెలియజేస్తున్నారు. ఈ సత్యం అనేకమంది ద్వారా పలుమార్లు నిరూపించబడినది. ఈనాడు కూడా ఎవరైనాసరే, ఎప్పుడైనాసరే ఈ సత్యాన్ని పరీక్షించి సఫలమని నిరూపించుకొనవచ్చు.

పారాయణా విధానంలో ముందుకువస్తే సాధకుడు స్నానమాచరించి, శుద్ధవస్త్రములు ధరించి, తన పూజాస్థలంలో ఆసీనమై, భగవతి ధ్యానించి, తత్త్వశుద్ధి కొరకు ఆచమనం చేసిన తరువాత చేతిలోనికి పుష్పాలు, అక్షతలు తీసుకొని జలమును తాకి సంకల్పమును పఠించవలెను. సంకల్పం తరువాత శాపోద్ధారణ క్రమాన్ని, పుస్తకంలో చెప్పబడిన విధి ననుసరించి చదువవలెను. ఈ శాపోద్ధారణ మంత్రాలకు ముందు పుస్తకమును పూజించాలి. పుస్తకపూజ, శాపోద్ధారణ మంత్రాల తరువాత సాధకుడు ఉత్కీలనమంత్రాన్ని 21 మార్లు, మృతసంజీవనీ విద్యను ఏడుమారులు పఠించవలయును. దీని తరువాత ఆదిశక్తికి నమస్కరించి కవచం, అర్గళం, కీలకం చదవవలెను. తమ యొక్క అభిరుచిననుసరించి ఈ క్రమంలో రాత్రిసూక్తం, అధర్వశీర్షం కూడా చదువవచ్చును. దీని తరువాత వినియోగం, న్యాస సహిత నవార్ణమంత్రాన్ని జపించవలెను. ఆ తరువాత అవసరమైనంత మేరకు వినియోగం, న్యాసం చేసి శ్రీ దుర్గాసప్తశతి యొక్క మూడు రహస్యాలను, అనగా ప్రాధానిక, వైకృతిక, మూర్తిరహస్యాలను తదుపరి చెయ్యవలెను. ఐతే సాధకుడు కోరుకుంటే, నవార్ణమంత్రం తదుపరి దేవీసూక్తాన్ని పఠించవచ్చును. రహస్యముల పారాయణ తరువాత, శాపోద్ధారణ విధి మరల సంపూర్ణంగా చదవువలెను. ఆఖరుగా క్షమాప్రార్థన, ఆరతి.... మొదలైనవాటితో ఈ పారాయణాక్రమం సంపూర్ణం గావించబడుతుంది.

ఆశక్తత వల్లనో, పని ఒత్తిడి చేతనో సాధకులెవరైనా ప్రతిదినమూ మూడు చరిత్రలను పారాయణ చేయలేక పోయినట్లయితే, వారు తమ పారాయణను వారం రోజులలో పూర్తిచేయవచ్చును. ఇందుకొరకు వారు మొదటిరోజు ప్రథమ అధ్యాయాన్ని, రెండవ రోజు రెండు, మూడు అధ్యాయాలను మూడవరోజు, నాల్గవ అధ్యాయాన్ని నాలుగవరోజు ఐదు, ఆరు, ఏడు, ఎనిమిదవ అధ్యాయాలను చదువవలెను. అయిదవరోజు–తొమ్మిది, పది అధ్యాయాలను, ఆరవరోజు పదకొండవ అధ్యాయాన్ని, ఏడవరోజు పన్నెండు, పదమూడు అధ్యాయాలను చదివి పారాయణను పూర్తిగావించవలెను. ఈ విధంగా ఏడురోజులలో శ్రీ దుర్గాసప్తశతిని సంపూర్ణంగా

పారాయణ చేయగలం. అయితే గుర్తుంచుకొనవల్సిన విషయమేమిటంటే, ఈ విధమైన సర్దుబాటు కేవలం అధ్యాయములకు మాత్రమే వర్తిస్తుంది. శ్రీ దుర్గాసప్తశతి అధ్యాయముల పారాయణకు ముందు చదువవల్సిన కవచం, అర్గళం, కీలకం మొదలైనవాటి పారాయణ, నవార్ణజపం మొదలైనవన్నీ యథాప్రకారం నిర్దేశింపబడిన రీతిలో ప్రతిరోజూ చదువాల్సిందే!

ఈ విధమైన పారాయణ క్రమంలో సంపుటీకరణం కూడా జోడింపబడినది. సంపుటీకరణలో శ్రీ దుర్గాసప్తశతి యొక్క వివిధ మంత్రాలను ప్రయోగించడం జరుగుతుంది. ఐతే సాధకుడు విశిష్టవ్యక్తి గనుక అయితే గాయత్రీమంత్రాన్ని ప్రయోగించవలెను. ఈ విధంగా చేయడం వలన శ్రీ దుర్గాసప్తశతిలోని 700 మంత్రాలతోపాటు, 1400 గాయత్రీమంత్ర పఠనం కూడా పూర్తవుతుంది. దీని యొక్క సత్ఫలితాన్ని గురించి వివరిస్తూ **"ప్రతిశ్లోకం వ్యాహృతిత్రయసంయుక్తాం గాయత్రీం జపేత్ తదా మహాఫలమ్"** అని చెప్పబడినది. అనగా మూడు వ్యాహృతులతో కూడిన గాయత్రీమంత్రాన్ని ఆదిలోనూ, అంతంలోనూ చదువుటవలన, జపించబడిన ఆయా శ్లోకాలు మహాఫలములు ఇస్తాయి అని అర్థం. శ్రీ దుర్గాసప్తశతి పారాయణ చేసిన తరువాత, శ్రీ సిద్ధకుంజికా స్తోత్రాన్ని పఠించుట శుభప్రదం అని చెప్పబడినది. ఈ క్రమంలో రహస్యమైన అంశాలు అనేకం కలవు. గాయత్రీమంత్రం యొక్క అర్థాన్ని, తత్త్వదర్శనాన్ని అవి విస్తృతరూపంలో తెలియజేయగలవు. మున్ముందు వాటినన్నింటి గురించి చర్చించుకొనగలం.

## 5. కవచ సాధనతో సంపూర్ణ ఫలితం

ఆదిశక్తి అద్భుతగాథలో ఎంత భక్తి మాధుర్యమున్నదో అంతే ఆధ్యాత్మిక రహస్యమయత ఉంది. వేదమయి శ్రీదుర్గాసప్తశతి యొక్క ప్రతిఒక్క మంత్రం ఈ రహస్యమైన లోతైన భావాలతో నిండివున్నది. అంతేకాక విస్తృతమైన వేదాంత సంబంధమైన మరియు ఆధ్యాత్మికమైన అర్థాలు కూడా వీటిలో ఉన్నాయి. దుర్గాసప్తశతి పారాయణ క్రమంలో శ్రీదేవీకవచము, అర్గళాస్తోత్రం, కీలకం, ప్రాధానిక రహస్యం, వైకృతిక రహస్యం, మూర్తి రహస్యం అనే ఆరు అంగాలు ఉంటాయి. ఈ ఆరు అంగాలలో అన్నింటికంటే మొదటి అంగం కవచం. పరమపూజ్యగురుదేవులు

గాయత్రీ మహావిజ్ఞానంలో కవచం యొక్క గొప్ప మహిమని తెలియజేస్తూ ఇలా అన్నారు. 'కవచం యొక్క అర్థం మూయుట–లేక మూత. దేనితోనైనా మనలను మనం కప్పుకుంటే, దానిని కవచం అంటారు. యుద్ధసమయంలో యోధులు ఒక ప్రత్యేకమైన కవచమును ధరిస్తారు. అప్పుడు ఇతరుల కొట్టిన దెబ్బల నుండి ఆ కవచం రక్షిస్తుంది. కవచం పని రక్షించుట. రక్షించే ప్రతి వస్తువును కవచం అని చెప్పవచ్చు.

యుగఋషి కవచం యొక్క మంత్రపరమైన ఆధ్యాత్మిక తత్త్వాలను స్పష్టపరుస్తూ ఇంకా ఇలా చెప్పారు. ' అదేవిధంగా ఆధ్యాత్మికశక్తి సంపన్నమైన ఇలాంటి దైవీ కవచాలు కూడా ఉంటాయి. కవచము వలన మనకు రక్షణ కలుగుతుంది. మంత్రశక్తి, కర్మకాండ, శ్రద్ధలతో కలుపబడిన ఆధ్యాత్మిక కవచమును ధరించుట వలన శరీరము –మనస్సులకు కీడును కలిగించే ఏవిధమైన ఆక్రమణ జరుగదు'. వేదమూర్తి గురుదేవుల వాక్కు వేదవాక్కు కనుక గురుదేవుల ద్వారా చెప్పబడిన ఈ విషయాలు చదువదగినవి, ఆలోచింపదగినవి మరియు ఆచరింపదగినవి. శాస్త్ర గ్రంథాలలో ప్రతిఒక్క దేవీదేవతకు వేరువేరు కవచాలు చెప్పబడ్డాయి. వీటికి అసాధారణమైన సాధనా విధానం మరియు సర్వశ్రేష్ఠమైన ఫలశృతి ఉంది. దీనిని ఉపాసకులు, ఆరాధకులు అనాదిగా అనుభూతి చెందుతున్నారు.

తల్లి ఆదిశక్తి విభిన్నమైన పేర్లు మరియు వాటిలో ఇమిడివున్న రహస్యమైన ఆధ్యాత్మికశక్తులను జప్తికి తెచ్చే 'దేవీ కవచం' దైవికమైనదేకాక, తిరుగులేనిది, అత్యంత శ్రేష్ఠమైనది. దీని ప్రభావం సాటిలేనిది. ఈ కవచాన్ని అందరూ సమర్థవంతంగా ఉపయోగించవచ్చు. స్వప్రయోజనానికే కాక, సర్వహితార్థమునకు కూడా ఈ కవచసాధన సాటిలేనిది. మార్కండేయ ఋషి ప్రార్థించినమీదట బ్రహ్మదేవుడు ప్రజల మేలు కొరకు, సర్వహితార్థము దీనిని వెల్లడిచేశాడనీ దుర్గాసప్తశతి కవచపు పూర్వపీఠిక ద్వారా స్పష్టమౌతున్నది. ఈ కవచము 'చండీ కవచం' అనే పేరుతో ఉపయోగించబడుతుంది. అజ్ఞానాంధకారాలను నశింపజేసే దీని ఛందస్సు అనుష్టుప్, దేవత చాముండ. దీని ఋషి స్వయంగా బ్రహ్మ.

భావనామయియైన భగవతిమీద, ఆమె విభిన్న నామ రూపాల మీద భక్తిపూర్వకమైన ధ్యానమే ఈ కవచ సాధనకు ప్రాణం. బ్రహ్మాండ చైతన్యంలో

వ్యాపించిన అద్భుతమైన ఆధ్యాత్మికశక్తులను సాధకుని అస్తిత్వంవైపు ఆకర్షించే భక్తిపూర్ణమైన ధ్యానం మహాశక్తిశాలీ, సూదంటుఱాయి. ఇది సాధకుని వివిధ అవయవాలలో శక్తిని ప్రతిష్ఠిస్తుంది, తద్వారా ఎలాంటి సమయంలోనైనా ఎలాంటి కీడు ఎలాంటి ఆపద ఎప్పుడూకూడా ఛేదించలేని విధంగా ఈ కవచము నిర్మించబడుతుంది. సాధనయొక్క ప్రాణం భావపూరితమైన భక్తి, అపారమైన శ్రద్ధ, దృఢమైన నమ్మకం మరియు చలించని విశ్వాసమే అని అనేకమంది సాధకుల అనుభవం ద్వారా నిరూపించబడినది. ఏ సాధకుల వద్ద ఈ అత్యంత విలువైన ఈ ఆధ్యాత్మిక పెట్టుబడి ఉందో వారు తల్లి ఆదిశక్తి సహజమైన కృపాకవచంతో స్వయంగానే సురక్షితులై జీవిస్తువుంటారు.

దివ్యమైన ఈ దేవీ కవచ పారాయణకు నాలుగు ప్రకరణములున్నాయి. దీని మొదటి ప్రకరణములో ప్రథమ పీఠికా మరియు భగవతి నవదుర్గ తొమ్మిది రూపాల చర్చ ఉంది. తొమ్మిదిరూపాలలో మొదటిది శైలపుత్రీ, రెండవది బ్రహ్మచారిణీ, మూడవది చంద్రఘంటా, నాల్గవది కూష్మాండా, ఐదవది స్కందమాతా, ఆరవది కాత్యాయనీ, ఏడవది కాళరాత్రి, ఎనిమిదవది మహాగౌరి మరియు తొమ్మిదవది సిద్ధిదాత్రి. తంత్రసాధన, యోగసాధన దృష్టితో దేవి తొమ్మిదిరూపాలు ఏడు చక్రాలు మరియు రెండు విశిష్టమైన చక్రాల అధిష్ఠానదేవతా శక్తుల రూపాలు. వీటి సాధన మరియు ధ్యానంతో ఈ చక్రాల ఆధ్యాత్మికశక్తులు, విభూతులు వెల్లడవుతాయి. ఈ చర్చ రహస్యమయమైనది, అత్యంత గోపనీయమైనది కనుక ఇక్కడ దీని సంకేత వివరణమాత్రమే వెల్లడిచేయబడుతోంది. అర్హత పొందినవారికి సాధన ప్రత్యక్ష ప్రమాణాన్ని స్వయంగా ప్రసాదిస్తుంది.

రెండవ ప్రకరణములో తల్లి జగదంబ విభిన్న స్వరూపాల వివేచన ఉంది. ఈ వివేచనను సంక్షిప్తమైన సాంకేతిక ధ్యానవిధానంగా కూడా చెబుతారు. ప్రేతాసనా, చాముండా, మహిషవాహినీ, వారాహీ, ఐరావత ఏనుగుమీద కూర్చున్న ఐంద్రీ, వృషభం మీద కూర్చున్న మాహేశ్వరీ, మయూరం మీద కూర్చున్న కౌమారీ, గరుడాసనా వైష్ణవీ, కమలాసనా లక్ష్మీ , వృషభం మీద ఆసీనురాలైన ఈశ్వరీ, హంసవాహినీ బ్రాహ్మీ, రథంమీద ఆసీనురాలైన భగవతి–ఈ పలు రూపాలు ఎల్లప్పుడూ భక్త రక్షణ చేస్తూవుంటాయి. వీటన్నిటి ధ్యానం సర్వసౌభాగ్యాలనూ ప్రసాదిస్తుంది. ఈ ధ్యానంతో అన్ని ఆపదలు క్షీణిస్తాయి. సాధకునికి రక్షణ

కలుగుతుంది. తన కవచ సాధన క్రమంలో సాధకుడు మాత ఆదిశక్తి మూల రూపాన్ని(గాయత్రి స్వరూపాన్ని) స్మరించుకుంటూనే వాటి వివిధ శక్తులను ధారణచేసే దేవియొక్క దైవీస్వరూపాలను వివేచన చేస్తూవుండాలి.

మూడవ ప్రకరణంలో కవచ ధారణ ప్రక్రియ ఉంది. ఈ ప్రక్రియ సులువుగా ఉంటూనే సాధకుని నుండి భక్తిపారవశ్యం, మానసిక ఏకాగ్రతను కోరుతుంది. అంతేకాక దీనిలో తెలియజేయబడినవున్న వివిధ అంశాలు ఆ అసాధారణ శక్తులను ధారణ చేసే ఉపదేశాన్నీ ఇస్తూవుంటాయి. ఈ సందర్భంలో గుర్తుంచుకొనవలసిన విషయం ఏమిటంటే కవచసాధన కేవలం శబ్దోచ్చారణ వరకు మాత్రమే పరిమితం కాదు. దీనిలో ధ్యానసాధన యొక్క శ్రేష్ఠమైన విధానం కూడా ఉంది.

కవచసాధన ఇచ్చే సత్ఫలితం నాల్గవ ప్రకరణములో తెలియజేయబడినది. ఎవరు తన హృదయంలో కవచాన్ని స్థిరపరచుకున్నాడో అతను కవచ సాధనను తన ధ్యానసాధనగా రూపొందించుకున్నాడు అని తెలుసుకోవాలి. ఈ ధ్యానమును చేసినవారు అన్ని రకాల రోగాలు, వ్యాధులు, జీవితంలో కీడును కలిగించే అన్ని లోకాల ప్రాణుల నుండి, గ్రహాలు, భూత, పిశాచ, బ్రహ్మారాక్షసుల బాధల నుండి విముక్తి పొందుతారు. అంతేకాక భైరవుడు లాంటి ఉపదేవతలు మరియు ఆపదలను కలిగించే అన్ని శక్తులూ నశించిపోయి చివరకు సత్ఫలితమును పొందుతారు. ఏ సాధకుని హృదయంలో ఈ కవచం ఉంటుందో **– నశ్యన్తి దర్శనాత్తస్య కవచే హృది సంస్థితే** – పైన చెప్పిన రకరకాల బాధలు, ఆపదలు అలాంటి సాధకుడిని దర్శించినంత మాత్రముననే నశించిపోతాయి.

ఈ కవచ సాధనతో కేవలం దురదృష్టాలు నశించిపోవటమే కాక, పలు అదృష్టాలు, మంచి ఫలితములు కూడా ప్రాప్తిస్తాయి అని ఋషులు తెలియజేశారు. **యశసా వర్థతె సో–పి కీర్తిమణ్డితభూతలే** – అనగా కవచ సాధనను చేసే మానవుడు భూమిమీద తన కీర్తితో శోభించుటయేకాక సమృద్ధిని కూడా పొందుతాడు. అంతేకాదు. ఈ కవచసాధన సాధకుడిని ఆధ్యాత్మిక శిఖరాగ్రమునకు చేర్చి అతనిని అన్ని బంధనాలనుండి విముక్తుడిని చేసి శివుని సాహచర్యాన్ని ప్రసాదిస్తుంది. కవచసాధన వలన లాభాలు అనేకం. వీటిని ఏ సాధకుడైనా కూడా తన సహజమైన సాధనాక్రమంలో అనుభూతిచెందగలడు.

కవచ సాధన వలన పైన చెప్పిన సత్ఫలితాలే కాక మనోరోగాల నిర్మూలన అనే మరో దివ్యసాధనానుభూతి కూడా సాధకులకు కలుగుతుంది. కవచసాధన అన్నిరకాల మనోరోగాల నిర్మూలనలో అసాధారణమైన ప్రభావం చూపిస్తుంది అనేది అనేకమంది సాధకుల అనుభవం. స్వచ్ఛమైన నేతి దీపాన్ని వెలిగించి, భగవతి యొక్క చిత్రపటం లేక గాయత్రిమాత చిత్రపటం ఎదురుగా కూర్చుని పవిత్రోచ్చారణ సహితంగా కవచ పఠనం చేయుట వలన అన్నిరకాల దురాలోచనలు, మనోరోగాలు నశించిపోతాయి. రోగి స్వయంగా దీనిని పఠించుటలో అసమర్థుడైతే అతని బంధువులు రోగి పేరుతో సంకల్పాన్ని చేసి భగవతి కృప మరియు కరుణాదృష్టిని తలచుకుంటూ ఈ క్రమాన్ని పూర్తిచేసి సత్ఫలితాలను పొందవచ్చు.

# 6. సాధనాలో వచ్చే ఆటంకాలను తొలగించివేస్తుంది అర్గలా స్తోత్రము

ఆదిశక్తి యొక్క లీలాగాథలను వర్ణించుటకు శ్రీదుర్గాసప్తశతి యొక్క రెండవది అయిన అభిన్న అంగం అర్గలాస్తోత్రం. ఆదిశక్తి అయిన తల్లిని గూర్చి సాధన చేయుటకు సాధకుడు శక్తివంతుడు కావాలి. అందుచేత ముందుగా అతడు కవచం ధరించుట ఆవశ్యకం. సాధనకూడా గొప్ప యుద్ధం వంటిది. ఈ మహాసంగ్రామంలో సాధకుడు ప్రతిక్షణమూ ఆసురీశక్తుల యొక్క లెక్కలేనన్ని దృశ్యాదృశ్యములైన దెబ్బలను సహించవలసివస్తుంది. ఒకొక్కప్పుడు ఈ దెబ్బలు సాధకుని ప్రాణాలమీదకు వచ్చేటంత భయవహంగా, దారుణంగా ఉంటాయి. సాధకుని లోపలా, వెలపలా రెండు అయామాలలోనూ ఈ రాక్షసుల యొక్క మాయావిసేన ఒకదానిని మించి మరొక ప్రమాదాలను సృష్టిస్తూ ఉంటుంది. అమ్మయ్యా! ప్రమాదం తప్పిపోయింది కదా! అని ఏ కొంచెం అజాగ్రత్తగా ఉన్న మరొక పరీక్ష ఎదురౌతుంది. ఈ అప్రమత్తత ఎంతవరకూ? ఎప్పటివరకూ? అందుచేత సాధకుడు కవచమును ధరించిఉండటం ఎంతో అనివార్యం. ఈ కవచం బాహ్యజగత్తులో సాధకుని దృశ్యాదృశ్య రూపంలో రక్షిస్తూ ఉంటుంది.

కానీ బాహ్యజగత్తులోని శత్రువులకన్నా అంతరంగంలోని శత్రుసమూహాలు ఇంకా భయంకరమైనవి. ఇవి కుండలినీ ఆరోహణమును జరగనీయవు. అందుచేత శ్రీదుర్గాసప్తశతిని దర్శించిన ఋషులు అర్గలాసాధనా విధానమును సృజించారు. అర్గలా అనే శబ్దమునకు అర్థం 'గొలుసు' ఈ రోజులలో తలుపులు మూయడానికి క్రొత్త పద్ధతులు వచ్చాయి. కానీ కొద్దికాలం క్రితం వరకూ తలుపులను మూసి దానిపైన గడియ (గొలుసుతో కూడినది)ను వేస్తూవుండేవారు. పల్లెప్రాంతాలలో ఈ సాంప్రదాయం బహుశా ఇప్పటికీ కొనసాగుతూ ఉండిఉండవచ్చు. రాత్రిపూట నిద్రించాలన్నా లేదా పగలు ఏదైనా పని చేసుకోవలన్నా తెలివిగలవారు తలుపులు మూయడం మంచిది అని ఆలోచిస్తారు. ఐతే ఇందుకు కేవలం తలుపులు మూసినంతమాత్రానే సరిపోదు. ఆ తలుపులను మూసి గడియ వెయ్యటమో లేదా తాళం వెయ్యటయో చేస్తే మంచిది.

అర్గలా విధిని సరియైన రీతిలో ప్రయోగించడం వలన సాధకుడు బాహ్యజగత్తులోని శత్రువులనుండీ రక్షింపబడతాడు. అలాగే కవచం అతనికి పరిస్థితులవల్ల ఏర్పడే ప్రమాదాలనుండీ, వ్యాధులు ఇంకా మరిన్ని ఇతరములైన ఆటంకములనుండీ కాపాడుతుంది. కవచసాధన సరియైన పద్ధతిలో చేయబడినట్లయితే, భౌతికమైన ప్రమాదముల సంఖ్య తగ్గుతుంది. ప్రారబ్ధవశాన ఏమైనా ఇబ్బందులు వచ్చినా కవచధారణ చేసిన సాధకుడు వీనివల్ల కలిగే బాధలను చిరునవ్వుతో సహించగల్గుతాడు. కవచం తరువాత అర్గలా సాధనకూడా చక్కగా చేసినట్లయితే సాధకుడు ఇక నిశ్చింతతతో సాధనాత్మక ప్రయోగాన్ని చేయగల్గుతాడు.

శ్రీదుర్గాసప్తశతి యొక్క అర్గలాసాధనలో ముఖ్యంగా 25 మంత్రాలు ఉన్నవి. ఇంకా వేరే పారాయణ విధానాలలో ఫలశృతిని చూపించే మరి రెండు ఇతర మంత్రాలు కూడా జోడింపబడినవి. ఈ మంత్రసాధనా వినియోగక్రమంలో దీనియొక్క ఋషి స్వయంగా 'విష్ణుభగవానుడే!' అని తెలియవస్తున్నది. ఈ మంత్రం అనుష్టుప్ ఛందస్సులో ఉన్నది. ఈ సాధన యొక్క అధిష్ఠానదేవత స్వయంగా మహాలక్ష్మియే! కొన్ని కొన్ని విధానాలలో ఈ సాధనయొక్క పూర్వక్రమంలో జగన్మాత యొక్క ధ్యానం ఇవ్వబడింది. ఈ ధ్యానంలో దేవి యొక్క మనోహరమైన స్వరూపాన్ని వర్ణిస్తూ ఈ క్రింది విధంగా చెప్పబడినది.

**ప్రకాశమధ్యస్థిత చిత్స్వరూపాం పరాయమే సదంధతీం త్రినేత్రామ్।**
**సిన్ధూరవర్ణామితి కోమలాంగీమ్ మాయామయీ తత్త్వమయీ నమామి॥**

అనగా చైతన్య స్వరూపిణియైన మాత ప్రకాశమండలం యొక్క మధ్యలో యున్నది. త్రినేత్రధారియైన తల్లి సాధకులకు అభయముద్రతో వరదానమిచ్చుచున్నది. సింధూరవర్ణంతో అత్యంత కోమలమైన అంగాలను కలిగియున్నదామె. ఆమెయే మాయామయి, ఆమెయే తత్త్వమయీ కూడా! ఆమెకు నమస్కరించి సాధకుడు తన సాధనను ప్రారంభించలెను' అని అర్థం.

సృష్టిలో ఈ సంపూర్ణ జగత్తులో ఆ తల్లి మినహా మరియెవ్వరూ లేరు. శక్తి సంపన్నుడైన సాధకునకు ఈ రహస్యం గనుక తెలిసినట్లయితే అతడు తాను స్వయంగా అన్ని రకాలైన భయాలు, విఘ్నాలనుండి బయటపడగలడు. ఎందుకంటే సాధనా సమయంలో ఎదురయ్యే సమస్తమైన ఆటంకాలు తల్లియొక్క మాయారూపాలేగాక మరేమిటి? ఈ విధమైన మాయారూపాలలో కూడా తల్లిని దర్శించగల్గిన సాధకునకు లేదా అటువంటి తన బిడ్డలకు తల్లి స్వయంగా తత్త్వమయియే అవుతుంది. ప్రస్తుతం ఈ పంక్తులను చదువుతున్న సాధకులకు తమ బాల్యం ఇంకా జ్ఞాపకం ఉంటే, వారు తమకు జన్మనిచ్చిన తల్లితో ఆడుకున్న పలువిధాలైన ఆటలు కూడా జ్ఞప్తికి రాగలవు. తల్లి తన చిన్న బిడ్డలతో పలురకాల ఆటలు ఆడటానికి లెక్కలేనన్ని రూపాలు ధరిస్తుంది. ఒకప్పుడు ఆమె దొంగ అవుతుంది. మరొకసారి సిపాయి అవుతుంది. ఒక్కొక్కసారి పోటీదారుడుగా నిలబడి తగాదాపడుతుంది ఆ తల్లి. అప్పుడప్పుడు తన బిడ్డను ఓడించటానికి ఆమె తన శక్తినంతా వెచ్చిస్తున్నదా అనిపిస్తుంది.

ఐతే తల్లి ఆడే ఈ ఆట బిడ్డ ఆడుతూవున్నంత వరకూ సాగుతుంది. ఒకవేళ బిడ్డలు అలిగినా, ఏడ్చినా లేదా ఆటనంతటితో ఆపేసి అమ్మ ఒడిలోకి చేరాలని పట్టుపట్టినా, ఆటలలో ఆమె దాల్చిన రకరకాల వేషాలన్నీ ఒక్కక్షణంలో సమాప్తమౌతాయి. తన సంతానాన్ని ప్రాణాధికంగా ప్రేమించే, పిల్లలపట్ల వాత్సల్యాన్ని కురిపించే మమతామయి అమ్మ ఒకటే అప్పుడు మిగిలిఉంటుంది. బిడ్డ మారాం చేసి అమ్మా! అని ఏడ్చినప్పుడు మాయ ఎక్కడ? మాయారూపమేమిటి? తన బిడ్డను ప్రేమించకుండా ఉండలేని బిడ్డపైన సంపూర్ణమైన ప్రేమాభిమానాలను వర్షించే అమ్మ ఒక్కతే ఇక మిగిలి ఉంటుంది, అంతే!

అర్గలాస్తోత్రం యొక్క సాధనలోని రహస్యం కూడా దాదాపు ఇందులోని ప్రతిఒక్క మంత్రం యొక్క ప్రథమపాదంలో తల్లి యొక్క లీలామయ రూపాల స్మరణ ఉంటుంది. రెండవపాదంలో సాధకుడు తన తల్లిని కోరే కోర్కె (పిల్లవాడు మారాం చేసి ఇవ్వమని అడిగే కోర్కె) ఉంటుంది. ఉదాహరణకు

**రక్త బీజవధేదేవి చణ్డముణ్డ వినాశినీ ।**
**రూపం దేహి జయం దేహి యశోదేహి ద్విషోజహి ॥**

దేవీ! నీవు రక్తబీజుడిని వధించేదానవు, నీవే చండముండులను నాశనం చేయగలదానవు. కానీ నాకు మాత్రం నీ యొక్క సత్యరూపం, తత్త్వరూపం కావాలి. నా సాధనలో విజయం కావాలి. నన్ను యశస్విని గావించు. అప్పుడు సాధనకు ఇబ్బందిని కలిగించే కామం, క్రోధం మొదలైన సమస్త శత్రువులను నేను నాశనం చేయగలుగుతాను.

మంత్ర ప్రభావం కల్గిన ఈ అర్గలాస్తోత్రం యొక్క స్వరం చాలా రహస్యంగా ఉంటుంది. ఇందులో మాతయొక్క మాయామయి, తత్త్వమయి రూపాలు రెండింటినీ స్తుతించడమూ, రెండింటిని యాచించడమూ అనేది ఈ సాధనలోని రహస్యం. ఇందులో సాధకుని యొక్క పట్టుదల, నమ్మకం, తల్లిపట్ల తనకున్న సంపూర్ణమైన అధికారానికి నమూనా. ఈ క్రింది మంత్రం ద్వారా ఈ సత్యాన్ని దర్శించవచ్చు.

**విద్యావన్తం యశస్వన్తం లక్ష్మీవన్తం జనం కురు ।**
**రూపం దేహి జయందేహి యశోదేహి ద్విషోజహి ॥**

అమ్మా! నీ యొక్క ఈ భక్తుడిని, ఈ మాయా ప్రపంచంలో విద్యావంతుడిని చేయి, యశస్విని చేయి ధనవంతుడినిగా చేయి. తల్లీ! ఐతే దానితోపాటే నాకు రూపం, సాధనా సమరంలో జయం, సాధనకు అడ్డువచ్చే శత్రువుల నాశనం, యశస్సు కూడా ప్రసాదించవలసినది.

విశ్వజనని అయిన మాత సంపదనూ, మోక్షమునూ ఏకకాలంలో ప్రసాదించగల సమర్థురాలు. సాధనలో లెక్కలేనన్ని మార్గాలు, సంప్రదాయాలు ఉన్నవి. అన్నింటికీ వాటివాటి విశేష పద్ధతులు, ప్రాశస్త్యములు, వరములు (కానుకలు) ఉన్నాయి. ఐతే ఆ తల్లి యొక్క తనయకానీ, తనయుడుకానీ అయినటువంటి సాధకుల మార్గం

ప్రత్యేకంగా ఉంటుంది. అది తల్లిని పిలవడం. 'అమ్మా! అమ్మా! అమ్మా!' అని పిలుపు ఆపకుండా పిలుస్తూనే ఉండటం. మా అమ్మ సర్వసమర్ధురాలు అనే సంపూర్ణమైన విశ్వాసం కలిగిఉండటం వారి ప్రత్యేకత. ఆమె ఎంత సమర్ధురాలంటే, ఆమె సామర్థ్యం నుండి ఒక చిన్న అంశమాత్రపు శక్తిని పొంది బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సమర్ధులైనారు. ఇక ఆమె అమాయకులైన తన బిడ్డలకోసం ఎంత దయామయిగా ఉంటుందంటే వారు అమ్మా అని పిలిచి ఏదైనా అడిగితే ఏనాడూ ఎటువంటి స్థితిలోనూ ఆమె నిరాకరించదు. ఆమెను భౌతికమైన సిరిసంపదలనడిగినా లేదా ఆధ్యాత్మిక ఉన్నతిని కోరినా లేదా రెండూ ప్రసాదించమని కోరుకున్న ఆమె దేనినీ కాదనదు. ఒక్కక్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా ఆమె తన బిడ్డలు కోరినవన్నీ సమకూర్చుతుంది. ఈ సత్యమును తెలుసుకున్నవారు, వారికి శక్తిసాధన యొక్క తత్వభోధ జరిగినట్లే అని తెలుసుకొనవలయును. కాబట్టి ఇక అర్గలాస్తోత్రమును ముగించి కీలకమైన సాధనదిశగా వారు పయనించగలరు.

## 7. పవిత్ర అంతరంగం కలిగినవారే శక్తికి పాత్రులు అవుతారు

ఆదిశక్తి లీలాగాథలోని మంత్రాల యందలి రహస్యములన్నింటినీ తనలో ఇముడ్చుకొనియున్న శ్రీదుర్గాసప్తశతి యొక్క మూడవ అంగం కీలకం. ఎవరైతే ఈ కీలకం యొక్క రహస్యమును తెలుసుకుంటారో వారే శ్రీదుర్గాసప్తశతి యొక్క మంత్ర రహస్యాలను అర్థం చేసుకొనగలరు. వారి అంతరంగంలో దీనియొక్క మంత్ర శక్తులు, సిద్ధులు ప్రకటీకృతమౌతాయి. కీలకం యొక్క నిగూఢతను తెలుసుకొనగలిగిన సాధకుడే, దీనిని ప్రయోగించుటలో సామర్థ్యం కలిగివుంటాడు. దీనియొక్క రహస్యమును ఛేదించలేని వ్యక్తికి, సప్తశతి కేవలం ఒక కావ్యగ్రంథమే అవుతుంది. అతడు ఇందలి శబ్ద సౌందర్య రసాస్వాదన అయితే చేయగలడు కానీ, దీని యొక్క మంత్రశక్తి అతడి చేతనత్వంలోకి ప్రవేశించలేదు. ఇది విచిత్రమే అయినప్పటికీ సాధనాపరమైన సత్యం అని శక్తి సాధకుల పరంపర యుగయుగాల నుండి క్రమబద్ధీకరించారు. (చెప్తూవస్తున్నారు)

కీలక స్తోత్రమంత్రం యొక్క వినియోగమంత్రంలో **'ఓం అస్య శ్రీకీలకమన్త్రస్య శివ ఋషిః, అనుష్టుప్ ఛన్దః, శ్రీమహాసరస్వతీ దేవతా, శ్రీజగదమ్బాప్రీత్యర్థం, సప్తశతీపాఠాఙ్గత్వేన జపే వినియోగః'** అని చెప్పబడియున్నది. అనగా ఈ కీలక స్తోత్ర మంత్రం యొక్క ఋషి భగవంతుడైన సదాశివుడు, దీని ఛందస్సు అనుష్టుప్, దేవత మహాసరస్వతి. తల్లియైన జగదంబ యొక్క ప్రీతి కొరకు సప్తశతీ పారాయణలోని అభిన్న అంగంగా దీనిని పఠించటం జరుగుతుంది. పారాయణ వినియోగం ద్వారా సాక్షాత్తు భగవంతుడైన సదాశివుడే ఈ కీలకం యొక్క ద్రష్టయైన ఋషి, మేధస్సును ప్రసాదించే మహాసరస్వతి దీనియొక్క అధిష్ఠాన దేవత అని స్పష్టమౌతుంది. ఎవరైతే బుద్ధితో కూడిన తెలివితేటలు, కుటిలత్వములను నశింపజేసుకుని, వివేకవంతులు కాగలరో, ఎవరిపైన మహాసరస్వతియొక్క కృప అక్షరాలా ఉంటుందో, కేవలము వారుమాత్రమే భగవంతుడైన సదాశివుని ద్వారా రచించబడిన కీలకమును అర్థం చేసుకొనగలరు.

మార్కండేయ మహర్షి చేత చెప్పబడిన ఈ కీలకస్తోత్ర మంత్రాలలో 14 శ్లోకాలున్నవి. సదాశివునికి నమస్కరిస్తూ వీటిని ప్రారంభించడం జరిగింది. ఆఖరు శ్లోకంలో ఫలశృతిని వివరిస్తూ

**ఐశ్వర్యం యత్ప్రసాదేన సౌభాగ్యారోగ్యసమ్పదః ।**
**శత్రుహానిః పరోమోక్షః స్తూయతే సా న కిం జనైః ఓం ॥ 14**

అని చెప్పబడినది.

అనగా 'ఎవరి దయవలన ఐశ్వర్యం, సౌభాగ్యం, ఆరోగ్యం, సంపదలు, శత్రునాశనం మరియు కైవల్యమూ కూడా లభిస్తాయో, కళ్యాణకారిణి అయిన ఆ జగదంబను మానవులు ఎందుకు స్తుతించరు?' అని అర్థం.

ఇటువంటి మహిమాన్వితమైన స్తోత్రము వలన కలిగే లాభమును అనధికారులు, అపాత్రులు పొందరాదు. ఎందుకంటే అపాత్రులు ఏ శక్తినైనా, సాధననైనా చెడు ప్రయోజనాలకే వినియోగించుకుంటారు. అందువలన పరమశివుడు దీనిని కీలితం చేసివేసినాడు. వారి ప్రవృత్తి వారిని శ్రేష్ఠత్వము దిశగా ముందుకు సాగనివ్వదు. అటువంటప్పుడు వారికి ఏదైనా శ్రేష్ఠమైన శక్తి లభించినట్లయితే దానినికూడా వారు ఏదో ఒక హేయమైన ప్రయోజనానికే ఉపయోగించుకుంటారు. ఇటువంటి నికృష్ట

ప్రవృత్తి గల్గిన నీచమైన జనులకు లభ్యం కాకుండా మహాదేవుడు శ్రీసప్తశతిని కీలితం చేశాడు. వారు ఈ పదాలను పఠనమైతే చేయగలరు కానీ ఎక్కడా, ఎటువంటి పరిస్థితులలోనూ ఇందులోని మంత్రశక్తులను పొందలేరు, వాటిని ప్రయోగించలేరు.

ఈ విషయాన్ని వ్యక్తం చేస్తూ కీలకమంత్రాలలో

**సమగ్రాణ్యపి సిద్ధ్యన్తి లోకశఙ్కామిమాం హరః ।**
**కృత్వా నిమన్త్రయామాస సర్వమేవమిదం శుభమ్ ॥**
**స్తోత్రం వై చణ్డికాయాస్తు తచ్చ గుప్తం చకార సః ॥**

**(5-6)** అని చెప్పబడినది.

అనగా జిజ్ఞాసువులయొక్క సందేహమును తెలుసుకొని భగవంతుడైన సదాశివుడు తనవద్దకు వచ్చే జిజ్ఞాసువులకు సప్తశతి అనే పేరుగల సంపూర్ణ స్తోత్రమే సర్వవిధాల శ్రేష్ఠమైనది, మేలును చేకూర్చగలిగినది' అని తెలియజేశాడు. తరువాత భగవతి చండిక యొక్క సప్తశతి అనే పేరుగల స్తోత్రాన్ని మహాదేవుడు గుప్తంగా ఉంచాడు.

సప్తశతియొక్క మంత్రశక్తిని దురుపయోగం చెయ్యటానికి వీలుకాని పరిస్థితి భగవంతుడైన భోలేనాథుని ప్రభావం వల్లనే జరిగింది. ఎవరైనా సాధకుడు ఏదో ఒక విధంగా పొరపాటునో, ప్రమాదవశాత్తునో లేదా అహంకారం వల్లనో దీనిని దురుపయోగ పరచినట్లయితే అతడు దండనకు గురికావడ మనేది నిశ్చయం. యుగయుగాలనుండీ ప్రజలు అనుభూతి చెందుతూ వస్తున్న సత్యమిది.

సప్తశతిని హీనమైన ప్రయోజనములకొరకో లేదా ఎవరికైనా అపకారం చెయ్యటానికో ఉపయోగించి, చివరకు తామే స్వయంగా పెద్ద హానికి గురియైనవారు కోకొల్లలు అన్న సత్యాన్ని పలు సంఘటనలు చెబుతున్నాయి. వారు విధిచేత, ప్రకృతి చేత సహించరాని దెబ్బలు తినవలసివస్తుంది. సప్తశతియొక్క దివ్యశక్తిని ఎల్లవేళలా ఆత్మకళ్యాణం కొరకు, లోకహితం కొరకుమాత్రమే ఉపయోగించాలి. ఇటువంటి మంచి ప్రయోజనములకు అడ్డంకులను తెచ్చిపెట్టే ఆసురీశక్తులేవైనా ఉంటే, తల్లియైన ఆదిశక్తియొక్క కోపంవల్ల సహజంగానే వాటి వినాశనం జరుగుతుంది.

మానవుని యొక్క సమస్త దోషాలకు అతని యొక్క స్వార్థం, అహంకారమే

మూలకారణములని జగన్మాతయొక్క ఉపాసకులందరికీ తెలుసు. ఈ పాశం చేత బంధింపబడిన వ్యక్తి పశువుగా మారి, అజ్ఞానమనే అంధకారంలోపడి కొట్టుకుంటూ చెడుమార్గముల దారిలో పయనిస్తాడు. ఏదోవొకవిధంగా ఈ పాశమును తెగగొట్టగలిగితే తిరిగి ఆ వ్యక్తి మంగళప్రదమైన వ్యక్తిగా మారగలడు. సాధకుడు స్వార్థం, అహంకారం అనే బంధనములనుండి విముక్తుడైనప్పుడే ఎటువంటి ఆధ్యాత్మిక సాధనయైనా సార్థకమౌతుంది. అందులోనే అతని సాధన యొక్క సఫలతకూడా ఉంటుంది. స్వార్థం, అహంకారాలనుండి వ్యక్తి ముక్తుడు కానంతవరకూ అతడికి ఎప్పటికీ ఔన్నత్యం అనేది అర్థం కాదు, తత్ఫలితంగా అతడు తన జీవితాన్ని ఎటువంటి మంచి ప్రయోజనంలోనూ వినియోగించలేడు.

సప్తశతి సాధకులకు ఈ సాధనద్వారా సూక్ష్మశక్తులతో సంపర్కం శీఘ్రంగా ఏర్పడటమేకాక ఆ శక్తులు చాలా వేగంగా అభివృద్ధిచెందుతాయి. ఇటువంటి స్థితిలో అంతరంగం మలినమైనట్లయితే వినాశకరమైన పరిస్థితులే ఎదురౌతాయి, ఇది ఎవ్వరికీ ఎప్పుడూ మంచిదికాదు. పవిత్రమైన అంతరంగం, స్వార్థంలేని అహంకారరహితమైన జీవనం ఈ సాధనకు ఎంతో అనివార్యమైన షరతు. ఈ సత్యాన్ని వెల్లడిచేస్తూ సప్తశతి (7/8) శ్లోకాలలో **'కృష్ణపక్ష చతుర్దశినాడుగానీ లేదా అష్టమిరోజుగానీ ఏకాగ్రమైన మనస్సుతో భగవతి యొక్క సేవలో తన సర్వస్వమునూ అర్పించి తిరిగి ప్రసాదరూపంలో స్వీకరించే వ్యక్తిపట్ల దేవి ప్రసన్నురాలవుతుంది,** అంతేకానీ మరియొకవిధంగా ఆమె కృప మనకు లభ్యంకాదు' అని చెప్పబడినది.

ఈవిధంగా సిద్ధికి ప్రతిబంధక రూపమైన కీలకం ద్వారా మహాదేవుడు ఈ స్తోత్రాన్ని కీలితం చేసివుంచాడు. పైన చెప్పబడినవిధంగా నిష్కీలనం గావించి ఈ సప్తశతి స్తోత్రాన్ని ప్రతినిత్యమూ స్పష్టమైన ఉచ్చారణతో పఠించిన మానవుడు సిద్ధిని పొందగలడు.

పైన చెప్పిన తిథులలో శక్తిని ఉపాసించుటలో చాలా విశేషమైన ప్రత్యేకత ఉంది. ఈ తిథులలో ప్రతిమాసం సాధకుని చేతనత్వం సహజంగానే ఊర్ధ్వగామి అయ్యేవిధంగా అంతరిక్షస్థితి ఉంటుందని విశిష్ట సాధకుల యొక్క అనుభవం. అందుచేత ఈ తిథులలో కొంచెం శ్రమపడగలిగితే జీవుడు సమస్త బంధనాల నుండి విముక్తుడు కాగలడు.

ఈ క్రమంలో చేయడమనేది, భగవతి యొక్క విగ్రహం లేదా చిత్రపటం చెంత కూర్చుని సాధకుడు తనను తాను, తన సంపూర్ణమైన అస్తిత్వమును తల్లియొక్క చరణారవిందాలమీద అర్పించడం మాత్రమే అవుతుంది. ఇప్పుడు అతడు లేదా ఆమె 'నేను అమ్మ యొక్క పుత్రుడను లేదా పుత్రికను' అనే భావాన్ని లోతుగా (దృఢంగా) స్వీకరించాలి. ఈ విశ్వమంతటిలో నాకున్న నిజమైన సంబంధం ఇది ఒక్కటే! నేను అమ్మ యొక్క పుత్రుడను లేదా పుత్రికను. నా సర్వస్వమూ అమ్మదే ! అంతే, ఇక ఇప్పటినుండీ నేను అమ్మయొక్క నిర్దేశముతో ఆమె యొక్క పద్ధతికి అనుగుణంగా జీవితాన్ని గడుపుతాను' ఈవిధమైన భావన దృఢంగా ఉండి, సాధన ఘనిష్ఠంగా ఉంటే, సిద్ధి లభించుటలో ఏమాత్రం సందేహం లేదు. 'స్వార్థపూరితుడూ, అహంకారీ అయిన వ్యక్తికి సిద్ధి లభించదు' అనే సత్యాన్ని సాధకుడు చాలా స్పష్టంగా అర్థం చేసుకొనవలెను. అందుచేత వీటినుండి త్వరగా విముక్తులు కావడం మంచిది. ఈవిధంగా చేయడం వల్ల మాత్రమే శక్తియొక్క రహస్యాన్ని తెలుసుకొనగలం.

# 8. పవిత్ర అంతరంగం కలిగినవారే శక్తికి పాత్రులు అవుతారు

ఆదిశక్తియొక్క లీలాగాథలను గురించిన వివిధ తత్త్వాలను తన కథాసూత్రంలో ఇముడ్చుకున్న శ్రీదుర్గాసప్తశతి యొక్క మొదటి మూడు అంగాలను గురించి చర్చించడం జరిగింది. ఈ మూడు అంగములు శక్తి సాధకుని యొక్క దేహమును దివ్యంగా తయారుచేయగలవు. భౌతికశరీరాన్ని యోగశరీరంగా రూపాంతరం గావించగల మాంత్రిక ప్రక్రియగాకూడా వీనిని పేర్కొనవచ్చు. ఈ మూడు అంగాలను ప్రయోగించే విధి విధానాలను నిర్వహించిన తరువాతనే శ్రీదుర్గాసప్తశతి పారాయణనను ప్రారంభించడం ఒక పద్ధతిగా పేర్కొనబడినది. ఈ పారాయణనను పూర్తిగావించిన పిదప, శ్రీదుర్గాసప్తశతి యొక్క మరియొక మూడు అంగాలను పారాయణ, ప్రయోగించే విధానమున్నది. ఈ మూడు అంగాల యొక్క చర్చ జరిగిన తరువాతనే శ్రీదుర్గాసప్తశతి యొక్క మంత్రాలలోని వివేచనా ప్రక్రియ ప్రారంభం చేయబడుతుందని గమనించవలసిందిగా శక్తిసాధకులతో తాత్త్వికమైన ప్రార్థన చేయుచున్నాము. ఇందువలన ఈ లీలాకథ యొక్క శృంఖలా సూత్రములు

స్వాభావికంగా పారాయణ తరువాత వచ్చే ఇతర మూడు అంగములతోనూ జోడింపబడివుంటాయి.

ఈ మూడు అంగాలను మూడువిధములైన రహస్యాలుగా చెప్పవచ్చు. అవి వరుసగా ప్రాధానిక రహస్యం, వైకృతిక రహస్యం, మూర్తిరహస్యం. మామూలుగా చదివే వారికి వీనిలో రహస్యాత్మికమైన ప్రత్యేకత ఏమీ కనబడదు. అయినప్పటికీ వీటి రహస్యములు ఎంతో లోతైనవి, బ్రహ్మాండమునకు సంబంధించినవి. శ్రీదుర్గా సప్తశతి యొక్క మొదటి మూడు అంగాలు భౌతికశరీరమునకు (పిండమునకు) సంబంధించినట్లుగానే, తరువాత వచ్చే మూడు అంగాలు బ్రహ్మాండమునకు సంబంధించినవి. తన శరీరమును సంరక్షించి, సురక్షితం గావించుకుంటూ, దానిని దివ్యం గావించుకునే ప్రయోగ ప్రక్రియలను నిర్వహించుకొని పారాయణ ద్వారా మంత్ర సాధనను పూర్తిగావించుకున్న తరువాతనే సాధకుడు బ్రహ్మాండీయ చేతనత్వంతో జోడింపబడుటకు అర్హుడు కాగలడు. బహుశ: అందువల్లనే మహర్షులు ఈ క్రమం యొక్క విశిష్టతను ఈవిధంగా నిర్ణయించి వుంటారు. బ్రహ్మాండంలోని శక్తికి చెందిన రహస్యాలను తెలుసుకొనగలిగే యోగ్యత అప్పుడే అతనికి లభిస్తుంది.

ఈ మూడు రహస్యములలో ముఖ్యమైనదీ, సర్వప్రథమమైనదీ ప్రాధానికరహస్యం. ఇందులో 31 మంత్రములున్నవి. రాజుయొక్క ప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చే ఋషి వాక్కుల రూపంలో ఇవి ప్రకటీకృతం గావించబడినవి. ఈ వివరణలో ముఖ్యంగా రెండు భాగాలు కలవు. మొదటిది ఆదిశక్తియొక్క మూల ప్రకృతి అయిన మహాలక్ష్మీమాత యొక్క తాత్త్విక రూపమునకు సంబంధించినది. రెండవ భాగంలో ప్రకృతియొక్క వివిధ శక్తులు అభివృద్ధి చెందిన క్రమమున్నది. ఈ వివరణావిధానం ఎంతో ప్రత్యేకమైనది, విలక్షణమైనది, రహస్యమయమైనదీ కూడా! దీనిగురించి మంత్ర ద్రష్టలైన మహర్షులే స్వయంగా –

**చక్షుష్మన్తో ను పశ్యన్తి నేతరెౕఽతద్విదో జనాః ।** అని చెప్పారు. అనగా – ఈ విషయమును జ్ఞాననేత్రమును కలిగినవారు మాత్రమే అర్థం చేసుకొనగలరు. అజ్ఞానులైన ఇతర జనులు ఈ రహస్యమును తెలుసుకొనలేరు'. ఇక్కడ సాధనారతులైన శక్తి సాధకులకు 'జ్ఞాననేత్రమును కలిగినవారు మాత్రము అర్థం చేసుకొనగలిగిన ఆ రహస్యం, ఇంతకీ ఏమిటి? అన్న సందేహం వస్తుంది. స్వయంగా ఆదిశక్తియే

ఈ సృష్టి అంతటికీ పరమతత్త్వం, చరమతత్త్వం అన్నదే ఆ మహాప్రశ్నకు సమాధానం. ఆమెకన్న వేరైనది మరొకటి ఏదీ లేదు. ఆమెయే శక్తి, ఆమెయే సనాతని. ఆమె నుండియే వివిధ నామరూపాలు గల ఈ సృష్టి అంతా వికసిస్తున్నది. ఆమెయే ఆది, మధ్య, అంతమూ కూడా! ఆమెకన్నా భిన్నమైనది మరియేదియునూ లేదు. ఆమె స్వరూపమును వర్ణిస్తూ ఋషులు -

**మాతులుఙ్గం గదాం ఖేటం పానపాత్రం చ బిభ్రతీ ।**
**నాగం లిఙ్గం చ యోనిం చ బిభ్రతీ నృప మూర్ధని ॥**
**తప్తకాఞ్చనవర్ణాభా తప్తకాఞ్చనభూషణా**
**శూన్యం తదఖిలం స్వేన పూరయామాస తేజసా ॥(5,6)** అని వర్ణించారు.

అనగా - ఆ సచ్చిదానందమూర్తియైన పరమేశ్వరి యొక్క శ్రీమూర్తి యొక్క కాంతి కాల్చబడిన బంగారం వలె యున్నది. ఆమె తనయొక్క నాలుగు చేతులలో గొడ్డలి, గద, డాలు, పానపాత్ర మరియు తలపైన సర్పం, లింగం, యోని ధరించి ఉంటుంది. కాల్చిన బంగారం వంటి శరీరకాంతిని కలిగిన ఆమె అదే వర్ణంలో ఉన్న ఆభరణాలను ధరించియుంటుంది' అని అర్థం.

సంకేతాత్మకమైన ఈ వివరణలోని రహస్యాన్ని భేదిస్తూ 'భువనేశ్వరీసంహిత'లో గొడ్డలి కర్మరాశికి, గద క్రియాశక్తికి, డాలు జ్ఞానశక్తికి, పానపాత్ర తురీయావస్థకి సంకేతాలుగా చెప్పబడినవి. ఇదేవిధంగా సర్పం కాలమునకూ, యోని ప్రకృతికి, లింగం పురుషులకూ రూపములుగా అర్థం చేసుకొనవలెను. ప్రకృతి - పురుషుడు - కాలం- ఈ మూడింటికీ అధిష్ఠానదేవత ఆదిశక్తియైన పరమేశ్వరియే అని అర్థం. వివిధమైన దేవతాశక్తులుకూడా వీనినుండియే ఉద్భవించినవి. ఈ మూడింటివల్లనే యావత్ సృష్టి, వివిధ లోకాలు, లోకాంతరములు ఉత్పన్నమైనవి.

ఈవిధమైన ప్రకటీకరణములో కొంత రహస్యం ఇమిడి యున్నది. చతుర్భుజయైన మహాలక్ష్మి క్రమక్రమంగా తమోగుణ, సత్త్వగుణాలను ఉపాధిగా చేసుకొని మహాకాళి, మహాసరస్వతి అనే తనయొక్క మరి రెండు రూపాలలో కూడా అభివ్యక్తమైనది. ఈ దేవీమూర్తులనుండి 'స్త్రీ-పురుషుడు'తో కూడిన ఒక్కొక్క జంట ఉత్పన్నమయ్యెను. మహాకాళినుండి శంకరుడు- సరస్వతి; మహాలక్ష్మి నుండి బ్రహ్మా- లక్ష్మి; మహా సరస్వతి నుండి విష్ణువు-గౌరి ఉద్భవించిరి. వీనిలో లక్ష్మిని-విష్ణువు;

గౌరిని– శంకరుడు; సరస్వతిని–బ్రహ్మ పొందినారు. తరువాత ఈ ముగ్గురు దేవతలు తమతమ శక్తులతో సృష్టి, స్థితి, లయములకు చెందిన కార్యభారమును నిర్వహించారు.

ఈవిధమైన వికాసక్రమం మూలప్రకృతియొక్క త్రిగుణాత్మక తత్త్వములు, వానినుండి కలిగే అభివృద్ధిగా చెప్పబడినది. భగవతియైన ఆదిశక్తి పరమేశ్వరినుండి ఈ సృష్టి క్రమంగా అభివృద్ధిచెందింది. ఈ తత్త్వమును తెలుసుకున్నవారు ఆమెకన్నా భిన్నమైనదేదీ లేదు' అని అనుభవపూర్వకంగా గ్రహించగలరు. ఈ సమస్తమైన సృష్టీ, దానిలోని అంగములన్నీ కూడా ఆమెయొక్క లీల, క్రీడ మాత్రమే!

సృష్టియొక్క ఈ వికాసక్రమంలో శక్తియొక్క వివిధ తత్త్వముల క్రమం చెప్పబడినదన్న విషయాన్ని మనం గ్రహించాలి. దీనిని సాధారణమైన స్త్రీ–పురుషుల లౌకికరూపంలో దర్శించరాదు. బ్రహ్మాండములను సృజించగలిగినటువంటి, దానియొక్క వివిధ స్థాయిలలో వ్యక్తమయ్యే రూపంలో తెలుసుకొనగల్గటమే తెలివైన పని. అందుచేత ఈ అధ్యాయం యొక్క ప్రారంభంలోనే 'కన్నులు కలిగినవారే ఆమెను చూడగలరు, ఇతర జనులు వారు ఎంత విద్వాంసులైనప్పటికీ చూడలేరు' అని చెప్పబడినది.

దేవి ప్రకటీకృతం అయినట్టి క్రమమును, కొంతవరకూ ఈ క్రిందివిధంగా రేఖాంకితము గావించవచ్చు.

**చతుర్భుజములు కలిగిన మహాలక్ష్మి (మూలప్రకృతి)**

చతుర్భుజయైన మహాకాళి
శంకరుడు–సరస్వతి

చతుర్భుజయైన మహాసరస్వతి
విష్ణు – గౌరి

బ్రహ్మ – లక్ష్మి

మూలప్రకృతినుండి ప్రకటీకృతమైన ఈ సృష్టిక్రమం గురించి సంకేతపరంగా చెప్పాలంటే దీనియొక్క త్రిగుణాత్మక ప్రవాహం బ్రహ్మాండీయశక్తియొక్క మూడు ధారలుగా చెప్పబడుతుంది. దీనినుండి ఉత్పత్తియైన పురుషుడు – ప్రకృతి క్రమంగా శక్తియొక్క స్థితిగతుల రూపములే. శరీరం(పిండం) – బ్రహ్మాండం ల ఏకత్వమును

గురించిన జ్ఞానమును పొందిన శక్తి సాధకుడు మాత్రమే దీనియొక్క సరియైన అనుభూతిని పొందగలడు.

## 9. భావనలనే అర్ఘ్యాన్ని భవానీకి సమర్పించుదాం

ఆదిశక్తి యొక్క లీలాగాథలలో ప్రకృతి లేక సృష్టియొక్క సంఘటనాక్రమాలన్నీ ఇమిడివున్నాయి. ప్రకృతియొక్క మూడుగుణాలు, వాటికి సంబంధించిన సృజన-లయం ఆయామముల (dimensions) యొక్క క్రమంతోనే విశ్వ బ్రహ్మాండం యొక్క నిర్మాణం జరుగుతున్నది. వీటినుండే సృష్టి యొక్క ఆరోహ, అవరోహములన్నీ జనిస్తున్నవి. ఈ యావత్ సృష్టి యొక్క సమస్తమైన సంఘటనాక్రమాలనూ పర్యవేక్షించే శక్తి నిజంగా ప్రకృతికి మాత్రమే ఉంది. ఈ మూలశక్తిలో ఏర్పడే పలువిధాలైన మార్పుల వల్లనే ఈ సృష్టి నిర్మాణంలో ఎన్నో కోణాలు అభివృద్ధి చెందుతున్నవి. దేవతాశక్తి మొదలుకొని, పదార్థకణాలలో ఉండే శక్తి యొక్క వివిధరూపాల రహస్యమే మూల ప్రకృతియొక్క వైకృతిక రహస్యం. తమ భావనాజగత్తులో భవానియొక్క స్నేహస్పర్శను పొందగలిగినవారు 'తల్లియైన ఆదిశక్తియే మూలశక్తి' అన్న విషయం తెలుసుకొనగలరు. ఆమెయే ఈ సృష్టి నిర్మాణానికి మూలశక్తి. ఈ జగన్మాతయొక్క వివిధరూపాలే యావత్ సృష్టిలోని అన్ని సంఘటనలకూ ఆధారభూతమగుచున్నవి.

ఆదిశక్తి యొక్క ఈ రహస్యపూర్ణమైన లీలాగాథలయొక్క అన్ని సూత్రాలనూ తనలో ఇముడ్చుకొనియున్న శ్రీదుర్గాసప్తశతి యొక్క చివరి మూడు భాగాలలో రెండవ భాగమైన వైకృతిక రహస్యంలో ఈ సత్యమే వెల్లడిచేయబడినది. లభ్యమైన వివరణలలో ఈ సత్యము పూర్తిగా గోచరిస్తూనే ఉంటుంది. ఎందుకంటే ఈ మూడు అంగాలలోనే విశాలమైన, వ్యాపకమైన ఈ సృష్టి యొక్క నిర్మాణం-స్థితి-లయములకు సంబంధించిన అన్ని రహస్యాలు ఇమిడియున్నవి. ఐనప్పటికీ ఈ సత్యాన్ని సంపూర్ణరూపంలో చెప్పుట, వ్రాయుట, తెలియజేయుట అత్యంత కష్టమైనదేకాదు, దాదాపుగా అసంభవం. ఐతే ఈ సత్యాన్ని సంకేతాలద్వారా కొంతవరకు చెప్పగలం, వినగలం, మాట్లాడగలం, వ్రాయగలం. తెలివికలిగినవారు ఈ సంకేతాలను సహజంగా అర్థం చేసుకొనగలరనే నమ్మకం మాకు కలుగుతున్నది.

నిజానికి ఈ విశ్వబ్రహ్మాండం యొక్క చేతనత్వంలోని అన్ని ఆయామాలలో జరుగుతూ ఉండే శక్తి యొక్క క్రీడను, శక్తి సాధకుడు తన చేతనత్వంలోనే అనుభూతి చెందగలడు. తనలో ఇమిడియున్న మూలశక్తిని స్వయంగా సాక్షాత్కరింప జేసుకున్న వ్యక్తి ఆ శక్తి యొక్క వివిధరూపాలనూ తనలోని వివిధ అంగాల రూపంలోనే అనుభూతి చెందుతాడు. తన శక్తి యొక్క వివిధ అంగాలే విస్తృతంగా వ్యాపించి, సృష్టియొక్క లోక లోకాంతరములుగా రూపుదాల్చినవి అన్న సత్యాన్ని కూడా అతడు అర్థం చేసుకొనగలడు. ప్రతి ఒక్క జీవాత్మ యొక్క మూలప్రకృతి వర్తులాకారపు మూడున్నర చుట్టలలో చుట్టుకుని ఉన్న కుండలినీ శక్తియే. ఈ మూల ప్రకృతియే వ్యక్తిగతమైన ఉనికిలోనూ, సమిష్టిగతమైన వ్యాపకత్వంలోనూ, వివిధ దేవీదేవతాశక్తుల రూపంలోనూ ప్రకటీకృతమైయున్నది.

ఈ సత్యానికి సాంకేతిక, మాంత్రిక, తాంత్రిక మరియు తాత్త్వికపరమైన వ్యాఖ్యానమును తెలియజేసేదే వైకృతిక రహస్యం. యోగసాధకులైనవారు ఈ సంకేతాన్ని అర్థం చేసుకొని భగవతి యొక్క లీలలను సాక్షాత్కరింపజేసుకుంటారు. మంత్రవిదులైనవారు దీనిలోని మాంత్రికశక్తులను జాగృతం చేసి, తద్వారా ఎన్నో అద్భుతాలను సాకారం చేసుకొనగలరు. ఇందులో దాగియున్న తాంత్రిక ప్రక్రియలు కూడా ఎంతో సమర్థవంతమైనవి. ఏ వ్యక్తియైనా వీనిని సరియైన రీతిలో ప్రయోగించగలిగితే కనుక అసంభవాలన్నీ సంభవం కాగలవు. దీనియొక్క తత్త్వచర్చ వేదాంతపరమైన అన్ని సిద్ధాంతాలకూ సారం.

ఈ తత్త్వాలనూ, సత్యములనూ, రహస్యాలనన్నింటినీ తనలో ఇముడ్చుకున్నటువంటి ఈ వైకృతిక రహస్యంలో 39 మంత్రములున్నవి. ఋషివాక్కుతో ఈ అధ్యాయం ప్రారంభమౌతుంది. ఋషి ఈవిధంగా చెప్తున్నాడు. 'ఓరాజా! దీనికి ముందు చెప్పబడిన ప్రాథమిక రహస్యంలో మూల ప్రకృతి రూపమైన మహాలక్ష్మి యొక్క స్వరూపాన్ని గురించి వివరించడం జరిగింది. ఆమెయే మూడు గుణాలకు ఆధారం.' దీని తరువాత ఋషిసత్తముడు ఆమెయొక్క త్రిగుణధారల యొక్క మూడు రూపాలను గురించి వివరించారు. మహాకాళీ రూపంలో ఆమె తమోగుణమునకు అధిష్ఠాత్రియై మధుకైటభులను నశింపజేసినది. మహాలక్ష్మీస్వరూపంలో ఆమె రజోగుణమునకు అధిష్ఠానశక్తి. ఈ రూపంలో జగన్మాత మహిషాసురుని వధించినది. మహాసరస్వతి రూపంలో ఆమె సత్త్వగుణమునకు అధిష్ఠాత్రియై శుంభ నిశుంభులను సంహరించినది.

ఈ మూడు రూపాలను గురించి ఎంతో సమ్మోహనంగా వివరించబడిన ఈ కావ్యంలో మనోహరత్వంతోపాటు స్వరూపచిత్రణ కూడా చెయ్యబడినది.

దీని తదుపరి మంత్రాలలో ఈమెను పూజించవల్సిన తాంత్రిక విధానం చెప్పబడినది. ఈ విధానం సాంకేతికపద్ధతిలో తెలియజెయ్యబడినది. ఏమయినా ఈ ప్రయోగం చాలా కఠినమైనది, ఉన్నతస్థాయీ సాధకులకు మాత్రమే సాధ్య మయ్యేది. జగన్మాతను సాత్త్వికరూపంలో పూజించేవారికి దేవీసూక్తంలోని 'నమోదైవ్యై' మొదలైన మంత్రాలద్వారా అమ్మను స్తుతించవల్సినదిగా ఋషి ఉపదేశిస్తున్నాడు. ఈ అధ్యాయంలో శ్రీదుర్గాసప్తశతి యొక్క మంత్రాలలోని గొప్పతనం ఎంతో లోతుగా వెల్లడిచేయబడినది. భగవతిని సాత్త్వికరూపంలో నిష్కామభావంతో సేవించే సాధకులు బలి ఇవ్వడం, మాంసం నివేదించడం వంటివి చేయరాదనికూడా సూచించబడినది.

ఈ అధ్యాయం తదుపరి శక్తి సాధకులందరికీ ఉపయుక్తమైన వైకృతిక రహస్యం యొక్క పారాయణా విధానం చర్చించబడినది. సంపూర్ణమైన భక్తితో, భావపూరితమైన హృదయంతో దేవియొక్క ప్రతిమ లేదా పటం ముందు కూర్చుని శ్రీదుర్గాసప్తశతియొక్క మూడు చరిత్రలను పారాయణ చెయ్యాలి అని ఇందులో చెప్పబడినది. పారాయణ క్రమంలో గుర్తుంచుకొనవల్సిన ముఖ్య విషయం– ఏదైనా ఒక చరిత్రను మాత్రమే పారాయణ చెయ్యదలచుకున్నవారు కేవలం మధ్యమ చరిత్రను మాత్రమే చదువవలెను, కానీ ప్రథమచరిత్ర, ఉత్తరచరిత్రలలో ఏదో ఒకదానిని మాత్రమే పారాయణ చేయుట సుముచితం కాదు. ఏ చరిత్ర అయినా సగం పారాయణ చెయ్యటంకూడా ఉచితం కాదు. ఇలా చెయ్యటం వలన సాధకుని సాధన సఫలీకృతం కావటంలో కొంచెం సంశయం ఏర్పడుతుంది. పారాయణమునకు వలెనే హోమమునకు కూడా ప్రాముఖ్యత ఉంది. ఈ విషయమై ఋషి ఈ క్రిందివిధంగా చెప్తున్నాడు.

**ప్రతి శ్లోకంచ జుహుయాత్పాయసం తిల సర్పిషా ।**
**జుహుయాత్స్తోత్ర మన్త్రైర్వా చణ్డికాయై శుభంహవిః ॥ (34–35)**

ఈ శ్లోకానికి అర్థం – శ్రీదుర్గాసప్తశతి యొక్క ప్రతిఒక్క శ్లోకమూ మంత్రమే! ఆ మంత్రంతోపాటు నువ్వులు, నెయ్యి కలిపి చేసిన పాయసంతో ఆహుతి నివ్వండి. లేకపోతే సప్తశతిలో ఏదైనా స్తోత్రం వచ్చినప్పుడు ఆ స్తోత్రమంత్రంతోపాటు చండికకు

పవిత్రమైన హవనసామగ్రితో హోమాన్ని చెయ్యండి. హోమం తరువాత భగవతిని భక్తిపూర్వకంగా ప్రార్థించండి. తదనంతరం మనస్సునూ, ఇంద్రియాలనూ వశంలో ఉంచుకుంటూ చేతులు జోడించి వినమ్రభావంతో దేవికి నమస్కరించి, మీ అంతరంగంలో ఆమెను స్థాపించుకొని, ఆ సర్వేశ్వరియైన చండికను ఎంతోసేపు ధ్యానించండి. అది ఎంతసేపంటే– ధ్యానిస్తూ ధ్యానిస్తూ ఆమెలో లీనమయ్యేంత తన్మయత్వం మీలో కలగాలి.

'భగవతి భావమయి' అనేదే శక్తిసాధకులందరి యొక్క అనుభవం. ఆమెకు తన భక్తులంటే ఎంతో ప్రీతి. సాధనలో విధివిధానాలకీ, కర్మకాండకీ ఎంతో ప్రాముఖ్యత ఉన్నదనేది నిజం. సాధన ఏదైనా కోర్కెతో కూడుకున్నట్లయితే, ఈ ప్రాముఖ్యత ఇంకా అధికంగా ఉంటుంది. కానీ సాధకుని మనస్సు భక్తితో నిండి, ఆ భక్తిభావం హృదయం లోతులలోపలివరకూ వ్యాపించివున్నట్లయితే విధివిధానాలు, కర్మకాండంలో ఎటువంటి లోటుపాట్లు ఉన్నా వాటంతట అవే సమసిపోతాయి. ఏ బిడ్డ అయినా ఆ జగన్మాతను 'అమ్మా!' అని పిలిచి, దేనినైనా అడిగితే ఆ తల్లి తప్పకుండా ఇచ్చి తీరుతుంది. అందుచేత ఆదిశక్తి యొక్క ఉపాసకులందరికీ తమ భావనలనుకూడా ఎల్లప్పుడూ అంతరంగపు లోతులలోపలి వరకూ స్వచ్ఛంగా, పవిత్రంగా ఉంచుకొనటం ముఖ్య కర్తవ్యం. భవానికి తమ భావనలతో అర్ఘ్యాన్ని సమర్పించే సాధకులకు, వారి కోర్కెలన్నీ నెరవేరుతాయి.

# 10. మూర్తి రహస్యములను తెలుసుకొని ఉన్నతస్థాయి సాధకులు కండి!!

ఆదిశక్తి యొక్క లీలాగాథ సృష్టిలోని కణకణమును గురించి తెలియజేస్తూ ఉంది. జీవితంలోనూ, జగత్తులోనూ దృశ్యా దృశ్యరూపములో ఏవైతే ఉన్నవో అవన్నీ కూడా ఆ 'చిత్‌శక్తి' యొక్క చైతన్యక్రీడయే తప్ప మరేమీ కాదు. నిరంతర సాధనతో శుద్ధమై, సిద్ధిని పొందిన చేతనత్వము కలిగిన వ్యక్తులు ఈ సత్యమును ప్రతిక్షణమూ అనుభూతి చెందగలరు. శక్తి సాధకులకు మాత ఆదిశక్తి విశ్వమంతటా నిండి ఉంది. ఈ విశ్వమంతా ఆమె యొక్క చిన్మయరూపమే. అసలు పదార్థమునకు అస్తిత్వమే

లేదు అనే సత్యముతో ఆధునిక వైజ్ఞానిక పరిశోధనలు కూడా ఏకీభవిస్తున్నాయి. పదార్థము క్షణక్షణమూ క్షయమౌతూవుంటుంది. పదార్థము అనేది ఏ క్షణములో సృష్టించబడిందో, ఆ క్షణమునుండే దాని వినాశనము కూడా ప్రారంభమౌతుంది. అస్తిత్వము అనేది, దానిని నిర్మించే శక్తికి ఉంటుంది. ఆ శక్తి యొక్క ఒడిలోనే సమస్తమైన నామరూపాలు వివిధ ఆకృతులను ధరిస్తూ, విసర్జిస్తూ ఉంటాయి. అన్ని రకాలైన అస్తిత్వములకూ మూల ప్రవాహము ఆమెయే!

శక్తి యొక్క సమస్తమైన రూపాలు, రంగులూ మాతయైన ఆదిశక్తి యొక్క గర్భమునుండే ఉద్భవించినవని తత్త్వవేత్తలు ఎల్లప్పుడూ తమ తాత్త్వికచింతనలో అనుభూతి చెందుతూ ఉంటారు. ఆమెయే ఆది, మధ్యము, అంతమూ కూడా! ఆమె యొక్క ఉనికి లేనప్పుడు, ఈ ప్రపంచమంతా శవమూ, శ్మశానమే తప్ప మరింకేమీ కాదు. అందుచేతనే మహర్షులూ, సిద్ధపురుషులూ ఈ యావత్ప్రపంచమూ మాత విశ్వమయి యొక్క చిన్మయ రూపముగా వర్ణించారు. ఈ సత్యాన్ని గురించిన వేదాంతపరమైన, పారమార్థికపరమైన వివరణ త్రివిధ రహస్యములు యొక్క తృతీయ ఆయామములో నొక్కివక్కాణించబడినవి.

ఈ త్రివిధ రహస్యములే 'శ్రీదుర్గాసప్తశతి' యొక్క ఆఖరు మూడు అంగములనీ, ఈ చివరి మూడు అంగములలోనే అంతిమమూర్తి రహస్యములు ఇమిడివున్నవనీ ఆదిశక్తి యొక్క లీలాగాథను వివరించే గత సంచికలో చెప్పబడినవి.

ఋషివాక్కులలో ఈ మూర్తి రహస్యమును గురించిన వివరణ 50 మంత్రములలో ఇవ్వబడినది. ఈ ప్రకరణములో భగవతి ఆదిశక్తి యొక్క అంగములలో కొలువైన ఆరుగురు దేవతామూర్తుల స్వరూపమును గురించి చిత్రించబడినది. వారు 'నంద, రక్తదంతిక, శాకంభరి, దుర్గ, భీమ, భ్రామరి' అనే దేవతామూర్తులు. వీరి స్వరూపముల గురించిన ప్రతిపాదన ఉండటంచేతనే ఈ ప్రకరణమునకు 'మూర్తిరహస్యము' అనే పేరు ఇవ్వబడినది. దీనియొక్క రహస్యార్థమును గురించి ఆలోచిస్తే, భగవతి యొక్క ఆరు రూపములు మూలశక్తి యొక్క ఆరు రహస్యపూర్ణమైన ఆయామములుగా అర్థమౌతుంది. వీనిని గురించి తెలుసుకుంటే, ఈ యావత్సృష్టిని గురించి తెలుసుకున్నట్లే! నంద– అదిశక్తి యొక్క ప్రథమరూపమని ఋషి వర్ణిస్తున్నాడు. ఆమె యొక్క శ్రీఅంగముల కాంతి బంగారు వర్ణము వలె అత్యుత్తమమైనది. ఆమె బంగారురంగు వస్త్రములను ధరిస్తుంది. ఆమెనే

'ఇందిర, కమల, లక్ష్మి, రుక్మాం బుజాసన' అనే నామధేయములతో కూడ పిలుస్తారు. ఈ మహాదేవతలు సాధకుని ఉపాసనతో ప్రసన్నులై ముల్లోకములనూ ఉపాసకుని యొక్క అధీనం చేస్తారు. తల్లియైన ఆదిశక్తియొక్క రెండవరూపము రక్తదంతిక. ఆమె అన్నిరకాలైన భయములనూ హరించివేస్తుంది. ఈమెను ఉపాసించేవారికి ఎటువంటి భయమూ దరిచేరదు. ఈమెకు అరుణరంగు ఎంతో ప్రియమైనది. ఈమె శరీరవర్ణము అరుణవర్ణము. అరుణ వస్త్రములను ధరించే ఈ మహాదేవి యొక్క అస్త్రశస్త్రములూ, నేత్రములూ, కేశములూ, గోళ్ళూ, దంతములూ అన్నీకూడా అరుణవర్ణములోనే ఉంటాయి. అందుచేతనే ఆమె 'రక్తదంతిక' అని పిలువబడుతున్నది. ఆమెయే 'రక్తచాముండ, యోగీశ్వరి' అనికూడా చెప్పబడినది. తనను ఉపాసించే భక్తులను ఆమె అన్నివిధాలుగా సంరక్షిస్తుంది.

తల్లియైన ఆదిశక్తి యొక్క మూడవరూపము 'శాకంభరీదేవి'. కమలంలో నివాసముందే ఈ పరమేశ్వరి నీలవర్ణ శరీరమును కలిగియుంటుంది. ఆ దేవి మానవులు కోరుకునే అనంతమైన రుచులతో కూడిన శాకములను, ఫలపుష్పములను సమృద్ధిగా కలిగియుండి, మానవుల ఆకలిదప్పులను తొలగింపజేసి, మృత్యు భయమును నశింపజేస్తుంది. ఈమెనే 'శాకంబరి, శతాక్షి, దుర్గ' అనే నామములతో కూడా పిలుస్తారు. తల్లియైన దుర్గాదేవి రూపము శోకరహితమై, దుష్టులను అణచివేయటమేగాక, మానవుల పాపములను ఆపదలను శాంతింపజేయగలదు. 'ఉమ, గౌరి, సతి, చండి, కాళిక, పార్వతి' అనే నామధేయములు కూడా దుర్గాదేవియే! శాకంభరి, దుర్గామూర్తులను ఉపాసించేవారికి అన్నపానాదులు, అమృతరూపమైన అక్షయఫలములు శీఘ్రంగా లభించగలవు.

ఆదిశక్తియొక్క ఐదవరూపమైన భీమాదేవిది కూడా నీలవర్ణమే. ఆమె రూపము భయంకరముగా ఉంటుంది. ఆమె తన హస్తములలో చంద్రహాసమనే ఖడ్గమును, డమరు, తల, పానపాత్ర మొదలైనవానిని ధరించియుంటుంది. భగవతియొక్క ఆరవమూర్తి 'భ్రామరీదేవి' ఆమె తనయొక్క తేజోమండలం కారణంగా చూడశక్యము గాని విధంగా ఉంటుంది. ఈమె అంగాంగములు కూడా వివిధవర్ణములలో ఉంటాయి. ఈమె చిత్రవిచిత్రములైన ఆభరణములను ధరించియుంటుంది. చిత్తభ్రమరపాణీ! మహామారీ!' అనే పేర్లతోకూడా ఈమెను స్తుతిస్తారు. ఈమెను కీర్తించేవారికి వారి మనోభీష్టములు వాటంతటవే నెరవేరుతాయి.

'ఈ మూర్తి రహస్యములను గురించిన అత్యంత గోపనీయమైన రహస్యము వారిని ధ్యానించుట' అని ఋషి వివరిస్తున్నారు. ధ్యానం ద్వారానే వీరిని గురించిన సమస్తమైన రహస్యములూ సాధకుని చేతనత్వములో ప్రకటీకృతమౌతాయి. 'ఒక సమయంలో ఒక్క దేవీరూపమును మాత్రమే ధ్యానించాలి' అనేది ధ్యాన ప్రక్రియలో నిమగ్నం కాగోరే సాధకుల కర్తవ్యం. ఈ సాధన ద్వారా దేవియొక్క దైవీరూపం ప్రకటీకృతమౌతుంది. ధ్యానమనే ఈ ప్రక్రియ సాధకుని అస్తిత్వంలో సర్వదా ఒక క్రొత్త శక్తి ప్రవాహాన్ని నింపుతూ వుంటుంది. ఇంతేకాక రూపాంతరణ మరియు ఆధ్యాత్మిక పరివర్తనలకు చెందిన ఒక లోతైన ప్రక్రియ సాధకునిలో జరుగుతూ వుంటుంది. ఈ ప్రక్రియ యొక్క ప్రభావంతో ఉపాసకుడు ఆదిశక్తితో మమేకమై అనేక ఆధ్యాత్మిక శక్తుల విభూతుల భాండాగారము కాగలడు.

ఈ మూర్తి రహస్యము యొక్క ఆఖరు అధ్యాయములో సప్తశతి యొక్క పారాయణా మాహాత్మ్యము చెప్పబడినది.

**సప్తజన్మార్జితౌర్ఘోరైర్బ్రహ్మహత్యాసమైరపి ।**
**పాఠమాత్రేణ మన్త్రాణాం ముచ్యతే సర్వకిల్బిషై: ॥**

అనగా 'శ్రీదుర్గాసప్తశతిలోని మంత్రములను పారాయణ చేసినంతమాత్రముననే ఏడు జన్మలలో చేసిన బ్రహ్మహత్యా సమానమైన ఘోరపాతకములు, సమస్త కల్మషములనుండి విముక్తి చెందగలరు' అని అర్థము.

'శ్రీదుర్గాసప్తశతిలోని ప్రతి ఒక్క శ్లోకమూ ఒకమంత్రమే అన్న విషయము అనుభవజ్ఞులైన సాధకులకు తెలిసేవుంటుంది. ప్రతి మంత్రమూ, అందులోని భావము, అర్థమునకు తగినట్లుగా సాధకునకు మంచి ఫలితములను ఇవ్వగలదు.

ఈ ప్రక్రియలో దృశ్యాదృశ్యములైన అనేక ఆయామములు ఉన్నవి. ఇవి వ్యావహారికమైనవి, ప్రయోగించదగినవి. ప్రయోగించేవారి సంకల్పానుసారము ఫలితములను ఇచ్చి తీరగలవు. ఇందుకు కావల్సినదల్లా పారాయణ చేసే సాధకుడు తన సాధనను నియమంగా చెయ్యగలగటమే. సాధకుని ఆచరణ, వ్యవహారము, ఆహారపానీయములలో 'సదాచరణ–తపస్సు' అనేవి అనివార్యంగా ఉండాలి. ఇలా చేయగలిగినట్లయితే ఫలితాలు ఆశ్చర్యజనకంగానూ, ప్రభావశాలిగానూ ఉంటాయి. ఎవరైనా దీని గురించిన సత్యాన్ని తెలుసుకొనగోరితే, వారు 108 రోజులు అనుష్ఠాన

పూర్వకంగా 'శ్రీదుర్గాసప్తశతి'ని పారాయణ చేసి ఆశ్చర్యకరమైన అనుభూతులను స్వయంగా పొందగలరు.

ఇందులో మరియొక రహస్యం కూడా ఇమిడివుంది. శ్రీదుర్గాసప్తశతి యొక్క మంత్రములుకూడా స్వయంగా ఆదిశక్తి యొక్క ప్రభావవంతమైన మంత్రమూర్తి రూపములే. పారాయణ, సాధనలే ఆమెను ధ్యానించటం, అర్చించటంతో సమానం. ఈ పద్ధతిననుసరించినవారికి తప్పకుండా మనోభీష్టములు నెరవేరగలవు. ఈ రహస్యమునకు ముగింపు వాక్యములు పలుకుతూ ఋషి ఈవిధంగా చెప్తున్నారు.

**సర్వరూపమయీ దేవీ సర్వం దేవీమయం జగత్ ।**
**అతోఽహం విశ్వరూపాం తాం నమామి పరమేశ్వరీమ్ ॥**

అనగా 'దేవి సర్వమయి. ఈ యావత్ ప్రపంచమూ దేవీమయమే. అందుచేత విశ్వరూపమైన ఆ దేవికి నమస్కరిస్తున్నాను' అని అర్థము.

మాతయొక్క ఈ విశ్వరూపాన్ని ఉపాసించేవారు స్వయంగా వేదాంత జ్ఞానము నకు సంబంధించిన అన్ని లోతులనూ తెలుసు కొనగలరు.

# 11. నవార్ణమంత్రం యొక్క రహస్యార్థము-సాధనా మర్మము

ఆదిశక్తి యొక్క లీలాకథ బీజరూపములో నవార్ణమంత్రంలో ఇమిడివున్నది. నవార్ణమంత్రం యొక్క విస్తారం-వికాసమే శ్రీదుర్గాసప్తశతి యొక్క మూడు రకాలైన చరిత్రలు మరియు 700 మంత్రాల రూపములో జరిగింది అని కూడా చెప్పవచ్చును. బహుశా అనేకమంది పలురీతులలో **"ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే"** అను 9 అక్షరాలు గల ఈ నవార్ణమంత్రంతో పరిచయమును కలిగి వుంటారు. కానీ దీని రహస్యానుభూతిని కొద్దిమందే సాధించి ఉంటారు. మంత్రవేత్తలు ఇందులో 33 కోట్లమంది దేవీ-దేవతల వివిధ మంత్ర-మహామంత్రాల సారమును అనుభూతి చెందుతారు. ఈ సాధనతో ప్రకృతి మరియు సృష్టియొక్క దుర్లభమైన రహస్యాలు పరిశోధింపబడి, తద్వారా వాటి జ్ఞానమును పొందటం జరుగుతుంది. ఈ మహా

మంత్రంలో **"ఐం హ్రీం క్లీం"** మంత్రబీజాలే కాక మంత్రాక్షరాలలోని మిగిలిన ప్రతి అక్షరము బీజమంత్రములతో సమానంగానే సాధకుని అస్తిత్వంలో ఆధ్యాత్మిక విస్ఫోటనం కలిగించి, అలౌకిక శక్తిధారలను వికసింపజేసే సామర్థ్యమును కలిగి వున్నాయి.

జగన్మాత లీలాకథలను వివరిస్తూ ఇప్పటివరకు గడచిన భాగాలలో దీనిలో ఉన్న మొత్తం ఆరు అంగాల వివేచన చేయబడింది. కవచం, అర్గలా, కీలకము, ప్రాధానికరహస్యము, వైకృతికరహస్యము, మూర్తిరహస్యము అను ఈ మొత్తం ఆరు అంగాలు శ్రీదుర్గాసప్తశతితో అనివార్యమైన మరియు అభిన్నమైన రూపంలో జోడింపబడివున్నాయి. వీటి పారాయణ చెయ్యకుండా సాధనావిధానము పూర్తి అవ్వదు. ఇదేక్రమంలో నవార్ణ మంత్రమునకు విశేష స్థానమున్నది. సప్తశతి పారాయణకు ముందు, పారాయణ తరువాత నవార్ణమంత్ర జపమును చేయుట తప్పనిసరి అని శక్తి సాధకులు భావిస్తారు. **ఆద్యన్తౌ నవార్ణమంత్ర జపేత్** – అనగా పారాయణ ఆది, అంతములలో నవార్ణమంత్రమును జపించాలి, ఎందుకంటే నవార్ణమంత్రముతో సంపుటీకరణ చేయుట వలన పారాయణ అతి ప్రభావశాలిగా ఉంటుంది అని శాస్త్రములు కూడా చెప్తున్నాయి. సాధకులు తమ సాధనా క్రమంలో దీని అనుభూతి చెందగలరు.

నవార్ణమంత్ర బీజాక్షరములు మరియు మంత్రాక్షరముల రహస్యాత్మకత విషయానికి వస్తే వీటి కథా వివరణ బహు విస్తారమైనది. ఐం హ్రీం క్లీం రూపంలో ఈ మూడు వాగ్బీజం, మాయాబీజం మరియు కామబీజం ప్రకృతి యొక్క త్రిగుణాత్మక ధారలకి ప్రతీకలు. అవే మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి రూపములో చిత్రీకరించబడినాయి. చాముండాయై విచ్చె– మంత్రాక్షరాలలో త్రిగుణాత్మిక మహాశక్తి భగవతి పట్ల నిండైన శరణాగతి భావం ఉంది. అందువల్ల పారాయణ క్రమంలో భగవతి మహాకాళీ స్వరూపము ముందుగా ఇవ్వబడింది. అందులో క్లీం బీజమంత్ర సామర్థ్యము విపులంగా వివరించబడినది. దీని తరువాత మధ్యమచరిత్రలో మాత మహాలక్ష్మి యొక్క మంత్ర మహిమయే బీజాక్షరముల విస్తారక్రమంలో ప్రకటీకరించబడినది. చివరలో ఐం బీజ సామర్థ్యం మాత సరస్వతి యొక్క మంత్ర మహిమరూపంలో ఇవ్వబడింది.

**చాముండాయై విచ్చే:** ఈ మంత్రాక్షరాలలో కూడా అనేక ప్రత్యక్ష మరియు రహస్యమైన శక్తులు ఇమిడివున్నాయి. చాముండాయై అనే పదానికి ఒక అర్థము 'అజ్ఞానమనే సేనను నశింపజేసే మహాశక్తి' అని కూడా ఉంది. సప్తశతి పారాయణ క్రమాన్ని అనుసరించి 7 వ అధ్యాయంలో భగవతి పరాంబ యొక్క లలాటం నుండి ఉద్భవించిన మహాశక్తి శుంభ, నిశుంభుల సేనానాయకులైన చండ-ముండులను వధించినది అని వర్ణించబడివుంది. వధానంతరము వారు ఈ బలి-పశువులను భగవతికి అర్పించినప్పుడు ఆమె నవ్వుతూ లేక మందహాసం చేస్తూ ఇలా అంది

**యస్మాచ్చణ్డం చ ముణ్డంచ చ గృహీత్వా త్వముపాగతా ।**
**చాముణ్డేతి తతో లోకే ఖ్యాతా దేవి భవిష్యసి ॥ (7/17)**

'నువ్వు చండ, ముండులను తీసుకొని మా వద్దకు వచ్చినావు, అందువల్ల ఈ లోకంలో నువ్వు చాముండాదేవీ అను నామధేయంతో విఖ్యాతి చెందెదవుగాక!'

విజ్ఞుల అభిప్రాయాన్ని అనుసరించి ఈ చాముండాయై పదం ఆ మహాశక్తినే తలపిస్తుంది. అదేవిధంగా పదంలో 4 అక్షరాలే లెక్కించబడతాయి. కానీ ఇందులో - చ్, మ్, ణ్, డ్, య్ అను 5 వ్యంజనములు; అ, ఉ, ఆ, ఎ - అను 4 స్వరాలు ఉన్నవి. ఈవిధంగా దీని వర్ణసంఖ్య 9 అయివున్నది. ఈ 9 అక్షరాలకు లేక వర్ణాలకు చాలా అద్భుతమైన ప్రభావం ఉంది. అందువల్ల ఇవి మంత్రానికి మధ్యన ఉంచబడినవి. ఈ పదం తరువాత వచ్చే 'విచ్చే' అను పదం భగవతికి శరణాగతి చేసుకోమని సూచిస్తుంది. మంత్రదృష్టిని అనుసరించి దీని గొప్పతనం కూడా సాటిలేనిది.

సిద్ధిని సాధించిన కొంతమంది పరాతంత్రయోగుల అభిప్రాయం ప్రకారం శ్రీదుర్గాసప్తశతి యొక్క 4 వ అధ్యాయంలోని 14వ శ్లోకంలో దేవీ ప్రార్థన చేసే మంత్రం కూడా నవార్ణ మంత్రంగా అంగీకరించబడుతుంది. ఇందులో 9 సార్లు 'స' వర్ణ లేక అక్షర ప్రయోగం చేయబడింది. నిస్సందేహంగా ఈ మంత్ర మహత్యము, అర్థము సాటిలేనివి. శక్తి సాధకుల కొరకు వీటి గోపనీయమైన అర్థమును ఇక్కడ వివరించబడుతున్నది. తద్వారా వీటి అద్భుత ప్రభావమును సరైన రీతిలో అర్థము చేసుకోవచ్చును.

**శూలేనౌ పాహి నౌ పాహి ఖడ్గేన చాంబికె ।**
**ఘణ్టాస్వనేన నః పాహి చాపజ్యానిః స్వనేన చ ॥ (4/14)**

ఈ మంత్రంలో 'న' అను అక్షరం 9 మార్లు ప్రయోగించబడినది. దీని అర్థము కూడా అద్భుతమైనది. 'హే దేవీ! నీ ఖడ్గంతో నా దైహిక, దైవిక మరియు భౌతిక కష్టాలను ఖండించి వేయుము. జాగృత, స్వప్న, సుషుప్తుల వ్యాధులను దూరం చేయుము. నేను మూడు దేహములు అనగా స్థూల-సూక్ష్మ-కారణశరీరాల కాలావధులను నాద, స్పంద మరియు ప్రణవం ద్వారా అతిక్రమించుదునుగాక! కారణ-మహాకారణ శరీరాలలో మహిషాసుర రూపంలో ఉన్న అహంకారమును షట్చక్రభేదన ద్వారా శమింపజేసి, సహస్రారం లేక బ్రహ్మ రంధ్రంలో ప్రవేశించి క్రమక్రమంగా ఊర్ధ్వగతిని పొంది జ్ఞాన సామ్రాజ్యంలో ప్రవేశించుదునుగాక!" అనే ప్రార్థన ఇక్కడ చెయ్యబడింది. ఈ కొద్ది శబ్దాలలో దీని దివ్యమైన అర్థమును సంకేతముగా పొందగలము.

సాధకుల సముదాయము నవార్ణమంత్రమును నవార్ణవ మంత్రం అని కూడా పిలుస్తారు. నవ అర్ణవ అనగా 9 సముద్రాలు. ఈ మంత్రంలో 9 అక్షరాలు ఉన్నాయి. అవి సాధకుడికి 9 సముద్రాలను దాటివేసే సామర్థ్యము నిస్తాయి. ప్రతి సాధకుడు 1. కామ, 2. క్రోధ, 3. మోహ, 4. లోభ, 5. మద, 6. మాత్సర్య, 7. ఈర్ష్య, 8. ద్వేషము లనే సముద్రములను దాటాలి. ఈ ఎనిమిదీ కాక ఈ అష్ట సముద్రాల శృంఖల యొక్క రెండు ఒడ్డులను కలిపే సంగమమే 9వ సముద్రం. ఈ 9 సముద్రాలను దాటిన మానవుడు తన జీవన లక్ష్యమును సాధిస్తాడు. ఈ 9 సముద్రాల శృంఖలలో 'కామం' మొదటి సముద్రము. ఏ కామకళ మనిషిని నాశనము చేస్తుందో, దానినే సదుపయోగం చేసినప్పుడు అతనిని జగదంబ యొక్క శ్రీచరణాల సన్నిధికి చేరుస్తుంది. నవార్ణ మంత్రములోని మూడవ అక్షరము కామబీజమైవుంది. దీని సమ్యక్ లేక సరియైన సాధన వలన సాధకుడు కామమనే సముద్రమును దాటుతాడు.

ఐం బీజం విజ్ఞానముతో కలిసిన వాక్కునకు సంబంధించినది. దీనితో మనిషి క్రోధమనే సాగరమును దాటగల సామర్థ్యమును పొందుతాడు. వాక్కు కఠినముగా ఉంటే సాధకుడు మునిగిపోతాడు. వాక్కుతో క్రోధావేశం చెందకుండా సాధకుడు,

దేవిగుణ కీర్తన చేస్తూ ఆ భావంలో మునిగితేలినప్పుడు త్రికాలజ్ఞుడు అవుతాడు. హ్రీం–మాయాబీజం. అది సాధకుని మోహబంధనాల నన్నింటిని త్రెంచివేస్తుంది. చివరకు మానవుడిని అన్ని మోహజాలములనుండి మహామాయే బయటపడవేసేది. 'చా' అనే అక్షర సాధన సాధకులను లోభమనే సముద్రమును దాటించివేస్తుంది. ఈ సాధనా రహస్యాలను తెలుసుకుని అర్థం చేసుకున్నప్పుడు మానవుని అసంతృప్తి నశించిపోతుంది.

'ము' మదరూపంగల సముద్రమును దాటించగల సామర్థ్యమును ఇస్తుంది. 'మ' అమృతబీజం. దీని సాధనా రహస్యము లోతైనది. దీని సాధనతో సాధకుడు మదం నుండి బయటపడే సామర్థ్యమును పొందుతాడు. 'డ' జడత్వమును సూచించే అక్షరము. జడత్వము వలన మనిషిలో మత్సరం (అసూయ) వస్తుంది. శ్రద్ధాపూర్వకంగా 'డా' మంత్రాక్షర రహస్యమును హృదయంలో భావనాత్మకంగా జపించినప్పుడు మనిషి తన ధ్యేయం వరకు చేరుకుంటాడు. 'యై' వాయువు మరియు వాక్‌బీజం సంయోగంతో ఉద్భవించినది. ఇది ద్వేషమనే సముద్రమును దాటించివేస్తుంది. 'వి' ఈర్ష్య రూప సముద్రమును అధిగమింపజేసే బీజమంత్రం. 'చ్చే' ఇది 9వ సముద్రానికి చెందినది. ఇది అష్ట సముద్రములను కలిపే కూడలి. దివ్యతత్త్వంతో కూడిన 'చ్చే' అక్షర సాధన సాధకుడిని ఈ సంగమం నుండి పైకి లేపి ఉద్ధరిస్తుంది.

నవార్ణమంత్ర రహస్యార్థ్యము మరియు సాధనా రహస్యము ఇంకా చాలా ఉంది. ఇందులో మొదటగా తత్త్వ నవార్ణ భేదములు మరియు వివిధ సాధనా ప్రక్రియలు ఉన్నాయి. నవార్ణమునకు చాలా విస్తృతమైన రూపముంది. దాన్ని మహానవార్ణం అని అంటారు. ఇంతేకాకుండా గాయత్రీమహామంత్రమునకు కూడా నవార్ణమంత్రంతో రహస్య సంబంధము ఉంది. నవార్ణమంత్రము యొక్క ఇతర రహస్యాలను రాబోయే సంచికలో చెప్పబడతాయి.

# 12. నవార్ణ మంత్రము, గాయత్రీ మహామంత్రముల సారూప్యత

ఆదిశక్తి లీలాకథ యొక్క అన్ని అర్థములు మరియు మర్మములు నవార్ణ మంత్రములో ఉన్నాయి. **ఐం-హ్రీం-క్లీం చాముండాయై విచ్చే -** ఈ పరమమంత్రం అన్నిరకాలుగా అద్భుతమైనది, విలక్షణమైనది. లీలాకథ యొక్క గత భాగంలో దీని అర్థము యొక్క లోతును కొద్దిగా చర్చించటం జరిగింది. దానితోపాటే రాబోయే భాగంలో నవార్ణమంత్రము మరియు గాయత్రీమహామంత్రముల సారూప్యత గురించి వివేచన చేయుట జరుగుతుంది అన్న సూచన కూడా చెయ్యబడింది. నవార్ణమంత్రము మరియు గాయత్రీమహామంత్రములు రెండూ భగవతి ఆదిశక్తి స్వరూపమును మరియు మహిమను గురించి గానం చేస్తూ భగవతిపట్ల భక్తిని మరియు శరణాగతిని యాచించమని చెప్తాయి. భగవతి దుర్గాదేవి జీవితంలోని పాపాలను, మాలిన్యాలను నశింపజేసి, జీవనగమనంలో వచ్చే దుర్గమమైన మార్గాలను సుగమం చేస్తుంది. ఈ దుర్గాదేవి సాధకుని అంతరంగంలోని మాలిన్యాలను ప్రక్షాళన చేసి రక్షణ ఇస్తుంది. కనుక ఆమె గాయత్రి అని పిలువబడుతుంది.

'గాయత్రి మన అస్తిత్వమును పరిశుభ్రం చేసి, దానిలో ఆధ్యాత్మిక ప్రకాశం మరియు పరమేశ్వరి పరాచేతన యొక్క అవతరణను సంభవం చేస్తుంది' అని అనుభవజ్ఞులైన సాధకులు చెప్తారు. ఇదేవిధంగా నవార్ణమంత్ర సాధన సాధకునకు త్రిగుణాత్మిక ప్రకృతి తత్వమును-సత్యమును బోధించి, శక్తిని ప్రసాదించి సాధకుడిని త్రిగుణాతీత స్థితికి చేరుస్తుంది. సాధకుడు నవార్ణమంత్రము లేక గాయత్రీమంత్రము వీటిలో ఏది చేయాలనుకున్నా అతను తాపసిక జీవన రీతిని-నీతిని అలవరచుకోవాల్సి ఉంటుంది. ఈవిధమైన భావనాత్మకమైన సమర్పణ లేకుండా ఏ సాధనా ఆశించిన ఫలితాలనివ్వదు. అంతేకాకుండా ఈ రెండు సాధనలకు సంబంధించిన మరో సత్యమేమిటంటే నవార్ణమంత్రము లేక గాయత్రీమంత్రములలో ఏది సాధన చేస్తున్నప్పటికి దాని అర్థమును, మర్మమును నిరంతరము మనన చేస్తూవుండాలి.

మంత్రాక్షరముల గురించిన చర్చ చేసినట్లయితే -ఓం భూర్భువః స్వః తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్-గాయత్రీమహా మంత్రము 'ఓంకార ధ్యానబీజం మరియు మూడు వ్యాహృతులతోపాటు తొమ్మిది

శబ్దములను మూడు చరణాలలో 24 అక్షరాలుగా భగవతి యొక్క భావచేతనను తనలో మాలగా చేసుకున్నది. నవార్ణమంత్రము విషయానికి వస్తే ఈ మహామంత్రము త్రిగుణాత్మిక ప్రకృతి యొక్క మూడు మంత్రబీజాలను మేళవింపజేసి చాముండాయై విచ్చె పదంతోపాటు 9 అక్షరాలలో భావమయి భవాని యొక్క చిత్‌శక్తిని ప్రకటీకరించే సామర్థ్యమును కలిగి ఉన్నది. తమ భావనలలో, మంత్ర సంరచనలో మరియు అర్థగాంభీర్యంలో రెండు మంత్రాలు ఏకరూపతను, సమత్వమును కలిగివున్నాయి.

నవార్ణమంత్రములో వ్యాపించివున్న త్రిగుణాత్మిక ప్రకృతి యొక్క మంత్రశక్తే గాయత్రీమహామంత్రములోని మూడు చరణాలలో తెలియజేయబడినది. నవార్ణమంత్రములోని 9 అక్షరాలలో రహస్యమయమైన రీతిలో కూర్చబడివున్న తత్త్వము మరియు సత్యమే గాయత్రీమహామంత్రము యొక్క 9 శబ్దాలలో చెప్పబడినది. ఈ రెండు మహామంత్రాల సాధన, వాటి ఫలశృతులు కూడా సమానమైనవే. వీటి విపులీకరణ చేసినట్లయితే నవార్ణమంత్రములో ఆదిశక్తి యొక్క మూడు రూపాలు అయిన మహాకాళి, మహాలక్ష్మి మరియు మహాసరస్వతుల శక్తి, ఆ శక్తుల చరిత్ర బీజరూపంలో ఇవ్వబడివుంది. ఈ మంత్రం అర్థము యొక్క సంపూర్ణ వివరణే శ్రీదుర్గాసప్తశతి యొక్క మూడు చరిత్రలు మరియు 700 శ్లోకాలలో ఉన్నది. నవార్ణమంత్రము యొక్క ఈ సారూప్యత గాయత్రీమహామంత్రము యొక్క మూడు చరణాలలో ఉన్నది. గాయత్రీమహామంత్రములోని మూడు చరణాలలో కూడా మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతుల శక్తి, ఆ దేవతల చరిత్రయే విస్తారంగా వర్ణించబడివుంది.

నవార్ణమంత్ర క్లీం బీజం భగవతి మహాకాళి యొక్క శక్తిని స్వయముగా తనలో ఇముడ్చుకొనివుంది. గాయత్రీమహామంత్రము యొక్క 'తత్సవితుర్వరేణ్యం'లో కూడా ఈ భావమే వ్యక్తీకరించబడినది. గాయత్రీమహామంత్రము యొక్క ఈ ప్రథమ పదమునకు అర్థము ఏమిటంటే ' ఆ సవితాదేవతను వరించుము' అని. సాధకునకు తన ఆరాధ్యుని వరించుట అనునది అతని సాధనలోని ప్రథమ కర్తవ్యము. అయితే ఈ కర్తవ్యమును నిర్వర్తించడం తేలికైన పని కాదు. లోభ, మోహ, వాసన, తృష్ణల యొక్క జటిలమైన బంధనాలు సాధకుడిని తన కర్తవ్యమును పూర్తిచెయ్యనివ్వవు. మనస్సు పదేపదే సంసారికతలో చిక్కుకుని, దానిలో బంధించబడి, ఇరుక్కుంటూ ఉంటుంది. ఈ సమస్యలన్నింటికి సమాధానం ఉత్కృష్టమైన వైరాగ్యంలో ఉంది.

మాతయైన మహాలక్ష్మి కృప లేకుండా ఎన్నడూ ఏదీ ఎవ్వరికీ లభించదు.

సాధన యొక్క సత్యమిలా ఉంది, 'సాధకుడెప్పుడైతే ఆ పరమదేవతయైన సవితను వరిస్తాడో అప్పుడు సాధనకు అవరోధమును కలిగించే తత్త్వములన్నీ మటు మాయమైపోతాయి. వాసనలన్నీ క్షయమైపోతాయి. కామనలన్నీ అణగిపోతాయి, వాసనలు ధగ్ధమైపోతాయి.

సాధకుని హృదయంలో కామనలు, వాసనలు మరియు తృష్ణలు పూర్తిగా నశించిపోయినప్పుడు అతని హృదయం మహాశాంతిని పొంది అతనిలో యోగ ఐశ్వర్య నవీన సృష్టి జరుగుతుంది.

గాయత్రీమహామంత్ర ద్వితీయ చరణము –'భర్గో దేవస్య ధీమహి'– లో ఈ భావాల అనుభూతే నిండివుంది. ఈ సత్యము నవార్ణమంత్ర హ్రీం బీజ మహాలక్ష్మి శక్తికి ఆధారము. మహాలక్ష్మి ఐశ్వర్యమునకు అధిష్ఠాత్రి. ఈ విషయం సర్వులకు తెలుసు. కానీ భగవతి ఉపాసకులు, యోగసాధకులు మాత్రమే మహాలక్ష్మి యోగ ఐశ్వర్య ప్రదాత అను సత్యమును అనుభూతి చెందుతారు. గాయత్రీ మహామంత్ర సాధకులు ఎవరైతే తమ హృదయంలో సవితాదేవత తేజస్సును ధారణ చేయుటలో సమర్థులో వారే యోగ ఐశ్వర్య వరదానమును పొందుతారు.

యోగ ఐశ్వర్యమునకు చివరి పరిణామము జ్ఞాన ప్రాప్తి. ఇది మాత సరస్వతి అనుగ్రహిస్తుంది. గాయత్రీమహామంత్ర తృతీయ చరణము – 'ధియో యోనః ప్రచోదయాత్'–లో ఈ సత్యమే అందంగా ఇమిడివుంది. నవార్ణమంత్ర ఐం బీజంలో ఈ భావమే వ్యక్తీకరించబడినది. యోగ సాధన చరమతత్త్వము జ్ఞానప్రాప్తి. సాధనను అష్టసిద్ధులు, నవనిధుల ప్రదాతగా భావించినవారు, వారు ఎంత మహాతపస్వులు, యోగులు అయినప్పటికి వారు అజ్ఞానులే. ఎవరికైతే ఆదిశక్తి ధియో యోనః ప్రచోద యాత్ అనే వరదానము నిస్తుందో వారే జ్ఞానమును పొందగలరు. జ్ఞానవంతుల చేతనాగర్భంలో ఐం బీజమంత్రము ఆకారము ధరిస్తుంది, అది సాకార మౌతుంది.

ఐం హ్రీం క్లీం అను మూడు బీజమంత్రాల శక్తి, సత్తా గాయత్రీమహామంత్ర మూడు చరణాలలో ఉందని గ్రహించినవారి స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలలో గాయత్రీ మహామంత్ర ఓంకార, భూర్, భువః, స్వః ప్రకాశము వ్యాపిస్తుంది. నవార్ణమంత్రము చాముండాయై విచ్చె అను పదం యొక్క అనుభూతి కూడా ఇదే.

చాముండాయై విచ్చె అను శబ్దమునకు అర్థము 'అజ్ఞానమనే సేనను నశింపజేసే ఆదిశక్తికి శరణాగతి చేస్తున్నాను'. ఆమె సంపూర్ణత్వంలో తన అస్తిత్వమును విలీనం చేసి ఆమెలో కలిసిపోవుట. సాధకుడు తన స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలలో ఆ అనుభూతినే పొందాలి. ఏ సాధకుల అంతఃకరణము నవార్ణ మంత్రము మరియు గాయత్రీమహామంత్రముల ఏకత్వమును అర్థము చేసుకునే సామర్థ్యమును కలిగి ఉన్నారో, అటువంటివారు సాధనా పథంలో అగ్రగాములగుటకు స్వామి వివేకానందులు స్ఫూర్తిదాయకంగా ఇలా అన్నారు.

**జాగో వీర్! సదా హీ సిర్ పర్**
**కాట్ రహా హై చక్కర్ కాల్।**
**ఛోడో అపనే సపనే, భయ క్యోం?**
**కాటో-కాటో యహ్ భ్రమ జాల్॥**

# 13. వేదోక్త రాత్రిసూక్తం మరియు తంత్రోక్త రాత్రిసూక్తం

ఆదిశక్తి లీలాకథ అని చెప్పబడే శ్రీదుర్గాసప్తశతి యొక్క ఆరు అంగములైన కవచము, అర్గళా, కీలకము, ప్రాధానికరహస్యము, వైకృతికరహస్యము, మూర్తిరహస్యముల మర్మములను వెల్లడించడము జరిగినది. ఇదేక్రమములో నవార్ణమంత్ర రహస్యము కూడా చెప్పబడినది. అయితే వీటితోపాటు శ్రీదుర్గాసప్తశతి పారాయణవిధానంలో పారాయణకు ముందు రాత్రిసూక్తము, శ్రీదేవ్యథర్వశీర్షం మరియు పారాయణం తదుపరి శ్రీదేవీసూక్తముల పారాయణకు కూడా గొప్ప మహిమ ఉన్నదని తెలియజేయబడినది. ఈ సూక్తాలలో శ్రీసిద్ధకుంజికాస్తోత్రమునకు కూడా ఎంతో మహత్వం వెల్లడిచేయబడినది. ఇందువలన భగవతి యొక్క భావమయ భక్తుడు ఈ మంత్రమయములైన సిద్ధస్తోత్రాల, స్తుతుల అర్థమును మరియు వాటి రహస్యములను తెలుసుకొనుట అవసరము. నియమిత సాధనలో పారాయణపట్ల శ్రద్ధ ఉన్న భక్తులు పారాయణ క్రమంలో వీటినికూడా కలుపుకుని చేసుకొనవలెను. వీటితో పారాయణం వలన లభించే ఆధ్యాత్మికశక్తి మరింత ఎక్కువ శీఘ్రంగా సాకారమై తీరుతుంది.

జగన్మాత సాధనలో పగటికంటే కూడా రాత్రికి అధికమైన ప్రాధాన్యత ఉన్నది. రాత్రి కాళికామాత గర్భము వంటిది. అందులో సాధకుని చేతన వికసించి పరిపక్వమౌతుంది. ఏ సాధకునికైతే రాత్రి యొక్క అర్థము, రహస్యము తెలియదో అతను సాధనారహస్య జ్ఞానమునకు దూరంగా ఉన్నాడని అర్థము చేసుకోవాలి. రాత్రి సమయంలో నిద్రించుట లేక రాత్రికాలంలో మేలుకొని ఉండుట అను ఈ రెండింటికి తమదైన ప్రత్యేక అర్థమున్నది. రాత్రివేళ అందరూ నిద్రిస్తారు, కాని నిద్రను సమాధిగా రూపాంతరము చేసుకునే నేర్పు కొద్దిమందికే తెలుస్తుంది. ఇదే విధంగా కలలను ఆధ్యాత్మికానుభూతులుగా వికసింపజేసుకునే విధానము తక్కువ మందికే తెలుసు. ఈ రాత్రిశయనంతోపాటు, రాత్రి జాగరణకు కూడా తనదైన విశేష మహత్వమున్నది. ఈ జాగరణ (మేల్కొని ఉండుట) లో కూడా నిశీథివేళ, మహానిశీథి (మహాంధకార) కాలములో చేయబడే సాధన అయితే తక్కువ సమయంలోనే సిద్ధిని చేకూరుస్తుంది.

గ్రామీణులు ఒక సామెతను చెప్తారు. 'రాత్రివేళ ముగ్గురు మేల్కొని ఉంటారు – యోగి, భోగి, రోగి, అనగా రాత్రివేళ కేవలము భోగి, రోగి, యోగులుమాత్రమే నిద్రించరు. భోగి రాత్రి సమయంలో విలాసాలలో తేలియాడుతూ, ఆనందంలో మునకలేస్తూ తన ప్రాణశక్తిని క్షయం చేసుకుంటాడు. రాత్రి అనగా అతనికి చేతన యొక్క పతనము మరియు శారీరక అనారోగ్యమునకు ఆహ్వానము పలుకుటే. ఎవరైతే తమ రాత్రులను భోగాలలో గడుపుతారో, వారు రోగులుగా మారుట అనునది అనివార్యము. భర్తృహరిమహారాజు కూడా 'భోగే రోగే భయం' అనగా భోగములో ఎల్లప్పుడూ రోగ భయం ఉంటుంది, రోగి అయిన వ్యక్తికి రాత్రివేళ శాంతి ఉండదు' అన్నాడు. రోగి యొక్క బాధ అతనిని ఎల్లప్పుడూ రాత్రి సమయంలో అశాంతికి గురిచేస్తుంది. చాలాసార్లు రోగాల ఆక్రమణ రాత్రికాలంలో ఎక్కువగా జరుగుతుంది. భోగి, రోగి ఈ ఇద్దరికి వ్యతిరేకంగా ఉంటాడు యోగి. యోగిని గురించి యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడు ఇలా అన్నారు. **'యా నిశా సర్వభూతాని తస్యాం జాగర్తి సంయమి' (2/69)** అనగా ప్రాణులందరూ రాత్రివేళ నిద్రిస్తారు. ఆ సమయంలో సంయమి అనగా యోగి జాగృతమై ఉంటాడు.

ఈ అద్భుత జాగృతికి అర్థమే రాత్రిసూక్తంలో చెప్పబడినది. దేవీసప్తశతిలో రాత్రిసూక్తాలు రెండు ఉన్నాయి. 1. వేదోక్తరాత్రి సూక్తము, 2. తంత్రోక్తరాత్రిసూక్తము.

వేదోక్తరాత్రిసూక్తంలో ఎనిమిది ఋచములు ఉన్నాయి. దీని మంత్రద్రష్ట ఋషులు కుశికుడు, సౌరభుడు మరియు భరద్వాజుడు. ఈ సూక్తానికి అధిష్ఠాత్రి దేవి స్వయముగా భగవతి రాత్రియే. ఇది గాయత్రి ఛందస్సులో చెప్పబడింది. ఇది ఋగ్వేదమందలి దశమ మండలానికి చెందిన దశమ అధ్యాయము 127వ వేదమంత్రములో ప్రథమ మంత్రం నుండి అష్టమమంత్రం వరకు ఉచ్ఛరించబడింది. ఈ సూక్తంలోని మొదటి ఐదు మంత్రాలలో రాత్రి దేవి స్వరూపాన్ని గూర్చి వివరించబడినది. తరువాతి మూడు మంత్రాలలో భగవతి రాత్రిని సాధనలో సిద్ధిని ప్రసాదించమని ప్రార్థన చెయ్యబడివుంది.

ఈ మంత్రాత్మక సూత్రార్థము చాలా గొప్పగా హృదయాన్ని స్పృశిస్తుంది. రాత్రిరూప దేవత జగత్తులోని జీవుల శుభా శుభకర్మలను బహుచక్కగా వీక్షిస్తుంది మరియు ఆ కర్మలను అనుసరించి ఫలితాన్నిచ్చే వ్యవస్థను ఏర్పరచుటకు సమస్త విభూతులను ధారణ చేస్తుంది అని చెప్పబడింది. ఈ కథనం యొక్క రహస్యార్థము ఏమిటంటే రాత్రివేళ నిద్రించే ప్రాణులు చేతనా జగత్తు నుండి అచేతనత్వ అంధకారంలో ప్రవేశిస్తారు. ప్రాణుల చేతనలో ఇమిడివున్న కోరికలు, వాసనలు కూడా అచేతనా గర్భంలోకి ప్రవేశిస్తాయి. ఈ ప్రవేశం సముచితరీతిలో జరిగినట్లయితే వారు అంతరిక్షశక్తిని గ్రహించి తిరిగివస్తారు. వారికి ఈ అంతరిక్షశక్తి మనోకామనలకు అనుగుణంగా వరదానములు ప్రసాదిస్తుంది. అయితే సాధకులు, తాపసులు రాత్రికాలంలో తమని తాము అచేతన యొక్క చీకటిలో విలీనం కాకుండా తమ సాధనాత్మక పురుషార్థముతో ఆ అంధకారమును పారద్రోలుతారు. వారి అంతరాళములో బ్రహ్మవిద్యామయి అయిన ఉషస్సు ప్రకటితమౌతుంది.

రాత్రిసూక్తంలో భగవతిని ఈవిధంగా కూడా ప్రార్థన చెయ్యటం జరిగింది. 'హే భవానీ! వాసనామయ తోడేళ్ళను మరియు పాపమయ తోడేళ్ళను మానుండి తరిమివేయుము. కామము మొదలైన దొంగల సముదాయమును కూడా వెళ్ళగొట్టుము. ఆతరువాత మాకొరకు మోక్షదాయినివిగా మరియు కళ్యాణకారకముగా మారుము'. నిజంగానే రాత్రి యొక్క నిశీథికాలంలో మరియు మహానిశీథికాలంలో లేక మహాంధకార కాలంలో సాధన చేసేవారు అతి సులభంగా అచేతన యొక్క అంధకారమును పటాపంచలు చేసుకొని ఆత్మజాగృతి అనే ఉషోదయంలోకి తొంగిచూస్తారు. ఈ భావననే ఆధారంగా చేసుకొని ఈ సూక్తం అంతిమ మంత్రంలో

'హే పరమ వ్యోమరూప పరమాత్మ పుత్రీ! నీ కృపతో నేను కామాది శత్రువులను జయించాను. నీవు యజ్ఞాగ్నివలె నా ఈ హవిష్యమును స్వీకరించు' అని ప్రార్థన చెయ్యబడినది.

దేవీసప్తశతి కథలో ఇలా ఉన్నది. విష్ణువు చెవి గుబిలినుండి ఉద్భవించిన మధు-కైటభులు బ్రహ్మదేవుడిని యుద్ధంలో ఎదిరించారు. అప్పుడు బ్రహ్మదేవుడు విష్ణుభగవానుని వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో పరమదేవుడైన విష్ణువు క్షీర సాగరంలో శేషశయ్యపై శయనించి యోగనిద్రలో నిమ్నగ్నమై ఉన్నాడు. విష్ణువును ఏవిధంగానూ నిద్ర మేల్కొల్పుట సంభవంగా కనిపించక బ్రహ్మదేవుడు నిద్రకు అధిష్ఠాన దేవత యైన దేవి భగవతి రాత్రిని స్తుతించడము ప్రారంభించాడు. బ్రహ్మదేవుని ముఖమునుండి ఉచ్చరించబడిన ఆ సూక్తమే ఈ రాత్రిసూక్తము.

ఇందులో భగవతి రాత్రి యొక్క లెక్కకుమించిన రూపాల మహిమ గానం చెయ్యబడినది. దానితోపాటుగా ఆమెయే సమస్త సృష్టిని తన గర్భంలో ధారణ చేస్తుంది అని కూడా చెప్పబడింది. స్వధా, స్వాహా మరియు వషట్కారము ఆమెయే! ఓంకారాది నాదములు కూడా ఈమెయే. ఆ జగదంబయే మహావిద్య, మహామేధ, మహాస్మృతి, మహామోహరూపి, మహాదేవి మరియు మహాసురి! త్రిగుణాలను ఉత్పన్నం చేసే మూలప్రకృతి కూడా భగవతియే! ఆమెయే కాళరాత్రి, మహారాత్రి మరియు మోహరాత్రి! పర-అపరాలన్నిటికి అతీతంగా భాసించే పరమేశ్వరి ఆమెయే అన్నది యథార్థము. బ్రహ్మదేవుడు ఈ సూక్తంలో ఆమెను స్తుతిస్తూ ఇలా అన్నాడు. 'హే సర్వస్వరూప దేవీ! సత్-అసత్ రూపములలో జగత్తులో ఎక్కడ ఏ వస్తువులున్నప్పటికి అవి, వాటి శక్తి సమస్తమూ నీవే తల్లీ!'

ఈ సూక్తంలోని చివరి మంత్రంలో 'ఈ మధుకైటభులను అసురులను మోహగ్రస్తులను చేయుము. ఈ అసురులను సంహరించేందుకు విష్ణుభగవానునికి బోధ చేయవలసినది తల్లీ!' అని భగవతి రాత్రిని బ్రహ్మదేవుడు ప్రార్థించాడు.

వేదోక్త-తంత్రోక్త రాత్రిసూక్తములు సుమనోహరమైన వేదాంత ప్రతిపాదన చేసే కావ్యములేకాక, మంత్రపూరితములు కూడా. వీటి మంత్ర సామర్థ్యము అపూర్వ మైనది. నిద్రకుపక్రమించే ముందు పాద, హస్త ప్రక్షాళన చేసుకొని తన్మయభావంతో భగవతి జగన్మాతను స్మరిస్తూ ముమ్మారు వీటిని పఠించుట పరమ లాభదాయకము.

ఇలా చేయటం వలన రాత్రికాలంలో భయమును రేకెత్తించే దుస్వప్నములు వచ్చుట, నిద్రలేమి, పసిపిల్లలు అకస్మాత్తుగా ఉలిక్కిపడి ఏడ్చుట మరియు ప్రేతాది బాధలు, సమస్తవిధములైన భయములు తొలగిపోతాయి. దీనికిమించి రాత్రిసూక్తము అవగాహనయై–రాత్రికాలపు సాధనా మర్మము చక్కగా వెల్లడికావాలని కోరుకునే సాధకులకు అందుకుగాను ప్రతి మాసము కృష్ణపక్షపు అష్టమి, నవమి, చతుర్దశి రోజులు విశేషమైన ప్రాముఖ్యతను కలిగివున్నాయి. ఈ త్రిరాత్రులలో కూడా నిశీథి మరియు మహానిశీథికాలములు విశిష్టమైన సాధనలకు మహోపకరమైనవి. ఆ కొద్ది గంటలలో చేయబడే సాధన ప్రకరణములు చాలా గూఢమైనవి – రహస్యమైనవి కూడా. వీటిని గూర్చిన సంపూర్ణమైన వివరణనిచ్చుట, వ్రాయుట అనునది సాధకుడు, సాధన మరియు సిద్ధుల మర్యాదలను ఉల్లంఘించటమే! సిద్ధజనులు ఇలా వెల్లడి చేయుటను నిషేధించినారు. ప్రతిమాసం లోని కృష్ణపక్షంలోని పైన చెప్పిన మూడు తిథులేకాక, దీపావళి, హోళి, జన్మాష్టమి, మహాశివరాత్రి పర్వదినపు రాత్రులు కూడా విశేషమైనవే అన్నది కూడా వాస్తవమే. పైన చెప్పబడిన రాత్రులన్నీ కూడా విశేష సాధనలు చేసే సాధకులకు ప్రత్యేకాను భూతులను ప్రసాదిస్తాయి.

## 14. తాత్త్వికమైన అర్థము మరియు మంత్రపరమైన రహస్యములతో కూడిన పారాయణ

ఆదిశక్తి లీలాకథ పారాయణ–శ్రవణం–మననములు చేసే భగవతి యొక్క భావుకులైన భక్తులు చిత్‌శక్తి చేతన యొక్క చైతన్య స్పర్శను పొందుతారు. వారు ఈ దివ్యకథ యొక్క మంత్ర రహస్యమును అనుభూతి చెందటంతోపాటు తత్త్వబోధ యొక్క సత్యమును, అర్థమును కూడా అనుభూతి చెందుతారు. భగవతి యొక్క ఈ భావమయ కథలో వివిధ అంగములతోపాటు 'దేవ్యథర్వ శీర్షం' యొక్క గొప్ప మహిమ చెప్పబడినది. అథర్వ వేదంలో దీని మహత్త్వమును గురించి చాలా విపులంగా చెప్పబడి ఉంది. దేవ్యథర్వశీర్ష పారాయణతో మాత త్వరగా ప్రసన్నురాలు అవుతుంది అని ఋషుల వాక్కులు చెప్తున్నాయి. అయితే పారాయణ క్రమంలో రకరకాలైన భేదములు ఉండుట వలన ఇది పారాయణ అంగముగా చెప్పబడలేదు. అయినప్పటికి

దీని మాంత్రిక మరియు తాత్త్విక మహత్వము వలన శ్రీదుర్గాసప్తశతిని పారాయణ చేయువారు దీనిని తప్పక పఠిస్తారు. శక్తి ఉపాసకులలో దీనిని ఒక్కదాన్నే విడిగా పారాయణ చేసే సాధన చేసే విధానము ఉన్నది. పారాయణ సత్ఫలితం-సత్పరిణామము ఎంత స్పష్టంగా, వేగంగా ఉన్నతమైనదిగా మరియు గొప్పదిగా లభిస్తుందంటే మనస్సు బలవంతంగానైనా శ్రద్ధాపూరితం కాకుండా ఉండదు.

ఈ దేవ్యథర్వశీర్షం 26 చమత్కారవంతమైన మంత్రముల నిధి. దీని 27వ మంత్రంలో పారాయణ ఫలశృతి చెప్పబడినది. దేవతలు భవానీమాతతో ఆమె తాత్త్విక స్వరూపమును తెలుసుకోవాలనే జిజ్ఞాసను వెల్లడిచేశారు. దేవతల జిజ్ఞాసతో కూడిన ప్రశ్నతోనే ఈ దేవ్యథర్వశీర్షం ప్రారంభమౌతుంది. ఈ అపూర్వ అద్భుత సంఘటన ప్రతి సాధకుని అంతఃకరణలో కూడా జరుగుతుంది. కామేంద్రియములు, జననేంద్రియములు, మనస్సు, ప్రాణం, పంచమహాభూతములతో తయారైన ఈ శరీరము క్రియాశీలమైనదే, అయితే దీని క్రియాశక్తికి ఆధారమేది? ఈ ప్రశ్న సాధకుని మనస్సులో ఉదయించినప్పుడు తత్త్వపరమైన అనుసంధానం వలన 'సమస్త క్రియాశక్తికి ఆధారము ఆ మహాశక్తే' అన్న సమాధానము కూడా స్ఫురిస్తుంది. ఆమె చేతన వల్లనే సమస్తం చైతన్యవంతంగా ఉంటుంది. అయితే ఆమె స్వయముగా ఎవరు? ఆమె స్వరూపమేమిటి? ప్రాణములను తొలచివేస్తూ మనస్సు లోతులలో గాఢంగా ఈ ప్రశ్నలు ఉదయించినప్పుడు జగదంబ స్వరం అతని అస్తిత్వంలో ప్రతిధ్వనిస్తుంది.

ఈ స్వరములను వినటానికి సాధకుడు తన మనస్సులోని దైవీప్రవృత్తులను ఏకీకృతం చేసి, స్థిరపరచుకొని మరియు ఏకాగ్రతతో పిలువవల్సి ఉంటుంది. ఈ పిలుపు గాఢంగాను, లోతుగాను ఉన్నప్పుడే చిత్‌శక్తి చైతన్యధారలు సాధకుని అంతర్భూమిలో వర్షిస్తాయి. దేవతలందరు కలిసి దుర్గాదేవి వద్దకు వెళ్ళి నమ్రతతో ఇలా ప్రశ్నించారు. 'హే మహాదేవి! నీవెవ్వరవు?' దానికి అమ్మవారు ఇచ్చిన సమాధానముల సారమునే దేవ్యథర్వ శీర్ష తత్త్వకథ వివరిస్తుంది. 'నేను బ్రహ్మరూపాన్ని, నానుండే ప్రకృతి-పురుషాత్మకమైన సద్రూప అనగా రూపం గల మరియు అసద్రూప అనగా రూపంలేని జగత్తు ఉద్భవించినది. నేను ఆనందం మరియు అనానంద రూపాన్ని. నేను విజ్ఞానం మరియు అవిజ్ఞాన రూపమును. తప్పనిసరిగా తెలుసుకోవల్సిన బ్రహ్మము మరియు అబ్రహ్మము కూడా నేనే! పంచీకృత

మరియు అపంచీకృత మహాభూతములు కూడా నేనే! ఈ సమస్త దృశ్యజగత్తు కూడా నేనే అయి ఉన్నాను. (శ్లో 2, 3)

భవానీదేవి నుండి ఈ భవసాగరం ఉత్పన్నమైనది. ఆమెయే జగత్తు మరియు జీవితములకు ఆదికారణము. ఇంతేకాదు, ఈ ప్రపంచంలో, ఈ జీవితంలో సంభవించే సంఘటనలన్నీ, అవి ఋణాత్మకం (నెగెటివ్) లేక ధనాత్మకం(పాజిటివ్) సమస్తం ఆమె ద్వారానే జరుగుతున్నవి. ఈ జీవితం మరియు ప్రపంచంలో ఉన్న దృశ్యములన్నీ మాత కోపం లేక కృపతోనే ప్రకటిత మవుతున్నాయి. ఆమె తప్ప ఇక్కడ మరేదీ లేదు. ప్రతి సంఘటనకు ఆధారము మరియు కారణము ఆమెయే! విద్యుచ్ఛక్తి కూలర్‌లో చల్లదనంగా, హీటర్‌లో వేడిగా తన ఉనికిని కలిగి ఉంటుంది. దేవి ఉనికి అటువంటి విద్యుద్ధార వంటిది. విద్యుచ్ఛక్తి లేకపోతే కూలర్ మరియు హీటర్ రెండు పనిచెయ్యవు. అయితే విద్యుచ్ఛక్తి ప్రభావం ఏ యంత్రంలో ఎలా ఉంటుంది అన్నది ఆ యంత్ర నిర్మాణముపైన ఆధారపడి ఉంటుంది.

ఆదిశక్తి చేతన వలన వృక్ష-వనస్పతులు, ప్రాణ సముదాయములలో చైతన్యం ఉంటుంది కానీ ఈ చేతన రంగు, రూపం వేరువేరుగా ఉంటుంది. ఆమె చేతనయే జీవులలో ఉంటుంది. అదే చేతన దేవతలలోను ఉంటుంది. మహాదేవి దేవతలకు తనను తాను పరిచయము చేసుకుంటూ ఇలా అన్నది- 'నేను రుద్రులు మరియు వసువుల రూపంలో సంచరిస్తూ ఉంటాను. నేను ఆదిత్యులు మరియు విశ్వదేవతల రూపంలో తిరుగుతూ ఉంటాను. నేను మిత్రావరుణులిద్దరి, అగ్ని మరియు అశ్వనీకుమార ద్వయం యొక్క పాలన-పోషణ చేస్తూ ఉంటాను. నేను సోముడు-త్వష్ట, పూషా మరియు భగలను ధారణ చేస్తాను. త్రిలోకములను ఆవరించుటకు విశాలమైన పాదములను కలిగి ఉన్న విష్ణువును, బ్రహ్మదేవుడిని మరియు ప్రజాపతిని నేనే ధారణ చేస్తాను. (శ్లో 5, 6)

భవాని యొక్క ఈ భవ్యమైన రూపమును తెలుసుకున్న దేవతలు ఆమెను స్తుతించారు. భక్తితో నిండిన ఆ స్తుతి ఈ దేవ్యథర్వ శీర్షం యొక్క రెండవ మహత్వపూర్ణ అంశం. దేవతలిలా అన్నారు. 'గొప్ప గొప్పవారిని తమ తమ కర్తవ్యములలో నిమగ్నం కళ్యాణమూర్తికి ఎల్లప్పుడు నమస్కారం! గుణసామ్యవస్థా రూపిణికి, మంగళమయి దేవికి నమస్కారము! నియమపూర్వకంగా మేము ఆమెకు ప్రణామం చేస్తున్నాము!

ఆ అగ్ని వర్ణముతో అలరారే, జ్ఞానంతో వెలుగులీనే తల్లిని, దీప్తిమతిని, కర్మఫలప్రాప్తి నిమిత్తము సేవించబడే, ఉపాసించబడే దుర్గాదేవిని మేము శరణుజొచ్చాము! అసురులను నశింపజేయు దేవి! నీకు ప్రణామము'. దేవతల ఈ దివ్యస్తుతి క్రమంలో 'శక్తిసాధన' యొక్క రెండు మహామంత్రములు కూడా ప్రకటీకరించబడినవి. వీనిలో ప్రథమమంత్రం శ్రీవిద్యకు సంబంధించినది. రెండవది నవార్ణ మంత్రం. 'వరిస్యా రహస్యమ్' అనే పుస్తక రచయిత మహాసిద్ధిని పొందిన భాస్కరరాయ మఖినులు శ్రీవిద్యను గాయత్రీ మహా మంత్రం యొక్క ఉన్నతమైన, విస్తార రూపంగానే చెప్పారు.

కామ(క), యోని(ఏ), కమలా(ఈ), వజ్రపాణి–ఇంద్రుడు (ల) గుహా(హ్రీం), హ, స –వర్ణములు, మాతర్విశ్వా–వాయువు(క), ఆకాశం(హ), ఇంద్రుడు(ల) తిరిగి గుహా (హ్రీం), స,క,ల – వర్ణములు మరియు మాయ (హ్రీం)

**క ఏ ఈ ల హ్రీం హ స క హల హ్రీం సకల హ్రీం** ఇది సర్వాత్మిక జగన్మాత మూల విద్య. ఆమె బ్రహ్మస్వరూపిణి.(శ్లో 14)

'శివశక్త్యభేదరూపా! బ్రహ్మ విష్ణు శివాత్మికా! సరస్వతి లక్ష్మి గౌరి రూపా! శుద్ధోపాసనాత్మికా! సమరసీభూత! శివశక్త్యాత్మకా! బ్రహ్మ స్వరూపము యొక్క నిర్వికల్ప జ్ఞానము నిచ్చే తల్లీ! సర్వతత్త్వాత్మికా! మహాత్రిపురసుందరి!' అన్నది పై మంత్ర భావార్థం. మంత్ర శాస్త్రంలో దీన్ని పంచదశి మరియు ఆది శ్రీవిద్య అనే పేర్లతో తెలియజెప్పారు. అర్థం, భావార్థం, వాచ్యార్థం, సంప్రదాయార్థం, లౌకికార్థం, రహస్యార్థం మరియు తత్త్వార్థం అన్న ఆరు రకాలైన అర్థములు దీనికి చెప్పబడినవి. ఇది అత్యంత గోపనీయమైనది అయిన కారణంగా కాబోలు దీనిగురించి సంకేతార్థములే చర్చించబడినవి. విశిష్ట జ్ఞానం సాధకులకు తమ సాధనలోనే లభిస్తుంది.

**'ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే'** – ఈ నవార్ణ మంత్రం ఉపాసకులకు ఆనందం, బ్రహ్మసాయుజ్యమును ప్రసాదిస్తుంది. (శ్లో 20) ఈ మంత్ర భావార్థం 'హే చిత్స్వరూపిణి మహా సరస్వతి! హే సద్రూపిణి మహాలక్ష్మి! హే ఆనందరూపిణి మహాకాళి! బ్రహ్మవిద్యను పొందటానికి మేమందరం ఎల్లవేళలా నీ ధ్యానమే చేస్తున్నాము. హే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి స్వరూపిణి చండికా! నీకు నమస్కారము. అవిద్య అనే త్రాడు ముడిని విప్పి నన్ను విముక్తుడను చేయుము.'

ఈ దేవ్యథర్వశీర్షం యొక్క తాత్త్విక మరియు మాంత్రిక రహస్యం బహు లోతైనది మరియు విస్తారమైనది. మీ సాధనా క్రమంలో దీని పారాయణ వలన అంతా శుభమే జరుగుతుంది. ప్రాతఃకాలంలో దీన్ని పఠించేవారి సమస్త దుః స్వప్నముల చెడు ఫలితము నశించిపోతుంది. ఆవునేతి దీపమును ప్రజ్వలింపజేసి తర్వాత శ్రీదేవికి పంచోపచారపూజ చేసి ఈ మంత్రమును 108 సార్లు జపించే వారందరు అన్ని కష్టముల నుండి తేలికగా బయటపడతారు. చాలాకాలంపాటు అర్ధరాత్రికాలంలో పైన చెప్పిన రీతిలో ప్రతిరాత్రి పదిమార్లు పఠించే సాధకుని వాక్కు ఫలిస్తుంది తప్ప వృథా అవ్వదు. దీని సాధనతోపాటు, మధ్యలో గాయత్రీ మంత్రమును అనుసంధానం చేసినట్లయితే ఒక్క 'దేవ్యథర్వశీర్షం' పారాయణ సాధనతోనే మంత్రసాధన చమత్కారమును అనుభూతి చెందవచ్చును.

# 15. చమత్కారవంతమైన మంత్రమాల - దేవీసూక్తం

ఆదిశక్తి లీలాకథ సాధకుల అంతఃకరణములో శక్తిని వ్యాపింప జేస్తుంది. వారిలో సామర్థ్యము మరి ప్రసన్నతల నవ స్రోతమును వెల్లడిచేస్తుంది. సామర్థ్యవంతులు బహు తరచుగా తమ ప్రసన్నతను పోగొట్టుకుంటుంటారు, భవిష్యత్తును చేజార్చుకునే అంచున ఉంటారు. కానీ శక్తిసాధకుల రీతి విచిత్రమైనది. వారి శక్తి సాధన ఎల్లప్పుడు వారికి సంతోషము, సామర్థ్యము అను వరదానములను ఇస్తూ ఉంటుంది. ఈ అద్భుత సాధనతో వారి అంతరంగ జీవనము పవిత్రమౌతుంది. బాహ్య జీవితము ఉజ్జ్వలంగా ఉంటుంది. ఆదిశక్తి లీలాకథలు ప్రవచించేవారు, శ్రవణము చేసేవారు ఇద్దరు కూడా ఈ సత్యమును తమ నిత్య జీవితంలో అనుభూతి చెందుతూ ఉంటారు. ఆదిమాత భవాని భావభరితమైన ఈ కథ అటువంటి సాధకులకు లౌకికసుఖము మరియు ఆధ్యాత్మిక మోక్షము వంటి వరదానములను ప్రసాదించే కల్పతరువు.

ఈ మహిమాన్వితమైన కథలో మేధాఋషి ఆదేశానుసారం జ్ఞానవంతులైన రాజా సురథుడు మరియు సమాధి వైశ్యుడు నదీతీరమున కఠిన సాధనామగ్నులై

తమ మనో వాంఛితములను ప్రాప్తింపజేసుకుంటారు. ఈ అతి ప్రభావవంతమైన సాధన దేవీస్తూకంలోని మహామంత్రాలది. ఈ దేవీసూక్తము శ్రీదేవ్యథర్వశీర్షము వలెనే శ్రీదుర్గాసప్తశతి పారాయణ రీతిలో అనివార్య అంగము. ఈ సాధనాక్రమంలో అంగమైనప్పటికి కూడా దీనికి గల తనదైన విశేష మహత్వము సాటిలేనిది. కారణాంతరాల వలన శ్రీదుర్గాసప్తశతి సంపూర్ణ పారాయణ సాధన చేయుటకు సమర్థత లేనివారు, ఈ రహస్యమయ సాధనను అనుష్ఠించి తమ సమస్త మనోకామనలను సఫలము కావించుకొనగలరు.

ఈ రహస్యమయ మరియు చమత్కారవంతమైన సాధనా చర్చ శ్రీదుర్గాసప్తశతి లోని 13 వ అధ్యాయములో 9 నుండి 13 శ్లోకాలలో వర్ణన చెయ్యబడినది. అందులో ఇలా ఉంది.

**జగామ సద్యస్తపసే స చ వైశ్యో మహామునే ।**
**సందర్శనార్థమమ్బాయా నదీపులినసంస్థితః ॥**

**స చ వైశ్యస్తపస్తేపే దేవీసూక్తం పరం జపన్ ।**
**తౌ తస్మిన్ పులినే దేవ్యాః కృత్వా మూర్తిం మహీమయీమ్ ॥**

**అర్హణాం చక్రతుస్తస్యాః పుష్పధూపాగ్నితర్పణైః ।**
**నిరాహారౌ యతాహారౌ తన్మనస్కౌ సమాహితౌ ॥**

**దదతుస్తౌ బలిం చైవ నిజగాత్రాసృగుక్షితమ్ ।**
**ఏవం సమారాధయతోస్త్రిభిర్వర్షైర్యతాత్మనోః ॥**

**పరితుష్టా జగద్ధాత్రీ ప్రత్యక్షం ప్రాహ చణ్డికా ॥**

హే మహాముని! ఇందువల్లనే రాజు సురథుడు మరియు వైశ్యుడు విరక్తులై తక్షణమే తపస్సుకు ఉపక్రమించారు. జగదంబ దర్శనమును ఆకాంక్షిస్తూ నది ఒడ్డున నివసిస్తూ తపస్సులో లీనమైనారు. ఆ వైశ్యుడు ఉత్తమమైన దేవీస్తూకమును పఠిస్తూ తపస్సులో లీనమైపోయాడు. వారిద్దరూ నదీతీరమున స్వచ్ఛమైన మట్టితో దేవీ ప్రతిమను నిర్మించి పుష్పములు, ధూపము హవనాదులను భగవతి ఆరాధన చేస్తూ ఉన్నారు. వారు మొదటగా ఆహారమును నెమ్మదినెమ్మదిగా తగ్గించారు. అటుపిదప పూర్తి నిరాహారులుగా ఉంటూ దేవిమీద మనస్సును లగ్నం చేసి ఏకాగ్రతా

పూర్వకంగా ఆమెను ధ్యానించుట ఆరంభించారు. వారిద్దరు తమ శరీరంలోని రక్తముతో ప్రోక్షితమైన బలినే సమర్పిస్తూ మూడు సంవత్సరముల పాటు నిరంతరము సంయమ పూర్వకంగా దేవీ ఆరాధనలో గడిపారు. జగత్తును ధారణ చేసే చండికాదేవి ఈ సాధనతో ప్రసన్నురాలై వారికి ప్రత్యక్ష దర్శనమిచ్చి వరమును ప్రసాదించినది.

స్వయంగా రాజా సురథుడు మరియు సమాధి వైశ్యుడు మూడు సంవత్సరములపాటు కఠిన తపస్సుతో ఏ దేవీసూక్తమును అనుష్ఠించారో అదే అద్భుతమైన మంత్రమాల అన్న సత్యమును ఈ కథా ద్వారా శక్తిసాధకులందరు అనుభూతిచెందగలరు. ఈ 3 సంవత్సరములలో వారి తపస్సు నిరంతరము కఠినము మరియు ఉగ్రమౌతూ వచ్చింది. దానితోపాటుగా దేవీసూక్తానికి చెందిన మంత్రమాల సైతము వారి మనస్సు లోతుల్లో ప్రతిష్ఠితమైనది. తత్ఫలితంగా 3 సంవత్సరములలోనే భవానీదేవి వారి మనోకామనను తీర్చుటకు తత్పరత చూపించింది.

శ్రీదుర్గాసప్తశతి పారాయణ సాధనాక్రమంలో రెండురకాల దేవీసూక్తాలు లభిస్తాయి. 1. వేదోక్త దేవీసూక్తం, 2. తంత్రోక్త దేవీసూక్తం. ఈ వేదోక్త దేవీసూక్తం నిజానికి ఋగ్వేద దశమ మండలములోని దశమ అధ్యాయము యొక్క 125వ వేదసూక్తం లోని 8 ఋక్కులు. వినియోగమును అనుసరించి ఈ 8 ఋక్కులున్న దేవీసూక్తమునకు ఋషి వాగామ్భృణి. దీని దేవత స్వయంగా పరమాత్ముడు. ఈ సూక్తము జగతి, శిష్ఠ మరియు త్రిష్టుప్ ఛందస్సులలో గానం చెయ్యబడినది. ఈ సూక్తానికి ఋషిక–మహర్షి అమ్భృణుడి కుమార్తె. ఈమె పేరు–వాక్. వీరు తమ కఠిన సాధనతో ఆదిశక్తితో సంపూర్ణమైన తాదాప్యం చెందారు. ఈ స్తూకంలోని 8 మహామంత్రములలో వారు జగన్మాత విస్తారమైన స్వరూపమును అనుభూతిని పొంది వర్ణించారు.

ఈ క్రమంలో రెండవది తంత్రోక్త దేవీసూక్తం. ఇది శ్రీదుర్గాసప్తశతిలోని ఐదవ అధ్యాయమునకు చెందిన విశిష్ట మంత్రాల సంకలనము. ఇవి ఇంద్రాది దేవతాగణముల శ్రీముఖము నుండి దేవిని స్తుతిస్తూ ఉచ్చరించబడిన మంత్రములు. 5 వ అధ్యాయంలో ఈ మంత్రములు వరుసగా 9 నుండి 87 వరకు ఉన్నాయి. ఈ స్తూకమును తంత్రోక్తదేవీసూక్తం అని ఎందుకు అంటారంటే – ఈ ప్రత్యేకమైన సూక్తంలోని మంత్రాలతో పాటు అనేక అద్భుతమైన తాంత్రిక ప్రక్రియలు కూడా

జోడింపబడి ఉన్నాయి. ఈ సూక్తమంత్రాలకు సమర్పించు హవన ద్రవ్యము, క్రియాకృత్యముల పద్ధతి కూడా విశేషమైనదే. ఈ విశేష సాధన లోతుల్లోకి తొంగిచూసిన ఉచ్చస్తరీయ సాధకులకు వదిలి పెట్టినప్పటికిని ఈ మంత్రమాల దార్శనిక మరియు మాంత్రిక మహిమ సాటిలేనిది.

వేదోక్త దేవీసూక్తంలో భగవతి వ్యాపకమైన విరాట్ మరియు బ్రహ్మాండీయ స్వరూప వర్ణన ఉంది. ఇందులో అవి స్వయంగా వాగ్దేవి శ్రీముఖమునుండి తన మహిమను గానం చేస్తూ 'నేనే మిత్రుడను మరియు వరుణుడను, ఇంద్రాగ్నులను మరియు అశ్వనీ కుమార ద్వయమును ధారణ చేసియున్నాను' అని వెలువరించినది. దేవి ఇంకా ఇలా అన్నది. 'నేను దృశ్యమాన ప్రపంచ రూపంలో పలు భావాలలో ఉన్నాను. సమస్త ప్రాణులలో నేను ఆవరించి ఉన్నాను. అనేక స్థానములలో వసించే దేవీ-దేవతలు ఎక్కడున్నప్పటికి, ఏమి చేస్తున్నప్పటికి వారందరు నా ఆజ్ఞలనే పాటిస్తున్నారు. దేవి ఇంకా ఇలా సెలవిచ్చినది. 'నేను ఏయే మనుష్యులను రక్షించాలని వాంఛిస్తానో వారందరకు మిగిలిన అందరికంటే మిన్నగా అధిక శక్తిని అనుగ్రహిస్తాను. నేను భూమ్యాకాశముల రెంటికి ఆవల, వాటికి అతీతంగా ఉన్నాను. ఇదంతా నా మహిమవల్లనే సంభవయ్యింది'.

తంత్రోక్త దేవీసూక్తంలో జగదంబ యొక్క సూక్ష్మ శక్తిధారల వర్ణన లభిస్తుంది. ఇవి పిండంలో స్థితమై ఉన్నవి. బ్రహ్మాండంలో వ్యాపించినదే, శరీరము, ప్రాణము, మనస్సు మరియు ఆత్మల విభిన్న శక్తుల రూపంలో పిండంలోను స్థితమై ఉన్నది. ఆ జగదంబే విష్ణుమాయ. ఆమెయే చేతన, బుద్ధి, నిద్ర, క్షుధ, ఛాయ, శక్తి, తృష్ణ, క్షాంతి, జాతి, లజ్జ, శాంతి, శ్రద్ధ, కాంతి, లక్ష్మి, వృత్తి, స్మృతి, దయ, తుష్టి, మాతృత్వము, భ్రాంతి, ఇంద్రియములకు అధిష్ఠాత్రీశక్తి మరియు సమస్త జీవులలో నెలవై ఉన్నది మరియు వాటిని ఆవరించి ఉన్న చేతన కూడా ఆ దేవియే. పిండంలోని కణకణంలో, దేహంలో, ప్రాణంలో, మనస్సులో ఆ దేవియే వివిధ రూపాలలో సంచరిస్తున్నది. తన అస్తిత్వంలో ఆ దేవి యొక్క ఈ వివిధ రూపాలను తెలుసుకున్న సాధకుడు ఆ తల్లిని బ్రహ్మాండమంతటా వ్యాపించి ఉన్న, బ్రహ్మాండ అధిష్ఠాత్రి, అధీశ్వరి రూపంలో కూడా దర్శిస్తాడు.

ఈ దేవీసూక్త ద్వయం కేవలం స్వరూపము మరియు మంత్ర-సంరచనలలో పరస్పర సంబంధాన్ని కలిగివుండటమేకాక వాటి సాధనా క్రమం కూడా అన్యోన్యంగా

జోడింపబడి ఉన్నవి. ఈ రెంటి సమన్విత సాధన అధిక ఫలదాయిని మరియు ప్రభావవంతమైనది. హవనద్రవ్యముల, హోమప్రక్రియల సరియైన జ్ఞానం లేనట్లయితే భగవతి చిత్రపటము లేదా మూర్తి వద్ద దీపమును వెలిగించి పారాయణ చేసినా అదే ఫలితమును పొందవచ్చు. ఈ పారాయణతోపాటుగా భగవతి బ్రహ్మాండ వ్యాప్త మరియు పిండంలోని సూక్ష్మశక్తుల సరైన ధ్యానము చేసిన సాధకుడు విశేష ఆధ్యాత్మిక లాభాలను మరియు విభూతులను పొందుతాడు. దీని ప్రభావము అతి సూక్ష్మము, వ్యాపకము, విస్తారము, విశదము. ఆ ప్రభావము ఎంత అధికము అంటే దానిని అక్షరాలలో వర్ణించలేము. ఈ అనుభూతిని చెందటానికి తీక్షణమైన సాధనాత్మక పురుషార్థమును చెయ్యవలసి ఉంటుంది.

## 16. దుర్లభమైన శక్తులకు ద్వారం ఈ స్తోత్ర పఠనం

ఆదిశక్తి లీలాకథలలోని మంత్రములయందు నిగూఢముగా ఇమిడి యున్న రహస్యములకు తాళంచెవి వంటిది 'శ్రీసిద్ధకుంజికా స్తోత్రము'. తాళంచెవిని ఉపయోగించితే తాళమును తేలికగా తీయగలము. అదేవిధంగా శ్రీదుర్గాసప్తశతి యొక్క అనుష్ఠాన, పారాయణతోపాటు ఈ సిద్ధస్తోత్రమును కూడా పఠించినట్లయితే సప్తశతిలోని మంత్రముల శక్తికి వేయబడిన తాళమును చాలా సులభంగా తీయగలము. దేవీసప్తశతిలోని మంత్రముల యొక్క శక్తులు అనంతమైనవి, సాటిలేనివి అన్న మహాసత్యము, శక్తి సాధకులందరికి విదితమే. వీటిని ప్రయోగించడంద్వారా జీవితంలోనే కాదు, యావత్ సృష్టిలో కూడా ఎటువంటి మార్పులు చేర్పులనైనా తేవటం సంభవమే. సప్తశతీ సాధకునకు అసంభవమైనది ఎక్కడా, ఏదీ ఉండదు. ఐతే వీని ప్రయోగించే విధివిధానాలు చాలా జటిలమైనవి, ఊహకందనివి. వీటిని సరియైన రీతిలో అర్థం చేసుకొనటం ఎవరికైనా అంత తేలిక కాదు.

శ్రీదుర్గాసప్తశతిలోని వివిధ మంత్రముల యొక్క ప్రయోగములను సమర్థులైన ఋషులు, మునులు, దేవతలు కీలితం చేశారు అనగా తాళం వేశారు. ఎంతో ప్రత్యేకమైన విధి విధానంతో, మంత్రములతో, మంత్రపూతమైన స్తోత్రములతో తప్ప ఆయా తాళములను తీయలేము. ఋషులు, దేవతలు ఏర్పరచిన ఈరకమైన విధివిధానము ఎల్లప్పుడూ అవసరమే. అలాకాక పోయినట్లయితే శ్రీదుర్గాసప్తశతి

యొక్క అద్భుతమైన శక్తిని పొంది అహంకారపూరితులైన జనులు తమకు తాము హాని చేసుకొనటమే కాక, ఇతరులకు కూడా అరిష్టములను తెచ్చిపెట్టగలరు. అయితే తాళం వేయబడుటవలన కుటిల మాంత్రికులకు దీనిని అనుష్ఠించుట సంభవం కాదు. సాధారణ ప్రజలు శ్రీదుర్గాసప్తశతి యొక్క పారాయణ గ్రంథమును తీసుకొని ఏవిధంగానైనాసరే ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికి దుర్లభమైన ఈ శక్తుల, సిద్ధుల హద్దును కూడా స్పృశించలేరు. సాధనలో అతి విశిష్టమైన కక్ష్యలోనికి ప్రవేశించనంత వరకూ వారికి ఇది రహస్యంగానే ఉండిపోతుంది. అంతేకాదు 'సాత్త్వికత, ప్రామాణికత అనే రెండు పరీక్షలలో వారు ఉత్తీర్ణులు కానంతవరకూ కూడా ఈ రహస్యం వారికి అనుభవం లోకి రాదు.

సాధకుడు తన 'సాత్త్వికత, ప్రామాణికత' అనే పరీక్షలో ఉత్తీర్ణుడౌతూ ఉన్నప్పుడు, అతడి అంతరంగ చేతనత్వములో ఈ రహస్యములు వెల్లడి అవుతూ ఉంటాయి కనీసం ఈ రహస్యములు అతడి పాత్రతకు తగినట్లుగా అతడి జీవితంలో కొన్ని ప్రత్యేకమైన సంఘటనల రూపంలో ప్రకటీకృతమవుతాయి. ఈవిధంగా రహస్యములు ప్రకటీకృతమవుతున్నప్పుడు, సాధకుడు ఇంకా ఉన్నతస్థాయి ప్రయోగములను చేసేందుకు ఉద్యమిస్తాడు. ఇక అతని ఉనికిలో సూక్ష్మశక్తులు వాటంతట అవే ప్రవహిస్తాయి. ఈ వాక్యాలు కేవలం ఊహతోనో, కల్పనతోనో వ్రాస్తున్న విషయములు కావనీ, నూటికి నూరుపాళ్ళు అనుభవం ద్వారా నిగ్గుదేల్చబడి వ్రాయబడుతున్నవని పాఠకులు గమనించాలి.

సాధన–సాధకుడు–సిద్ధి – ఈమూడింటికి సంబంధించిన సత్యం ఒకటున్నది. ఆదిశక్తి అయిన జగన్మాత యొక్క మూల ప్రకృతి అపాత్రునికి ఏమీ అందించదు, అదేవిధంగా సత్పాత్రులైన వారు మమతామూర్తియైన ఆ తల్లి దయకు ఎన్నడూ దూరం కారు అన్నదే ఆ సత్యం. మహాశక్తి ఎప్పుడైనా ఒక అపాత్రునికి ఏదైనా సమకూర్చింది అంటే అది అతనిని దండించటానికి మాత్రమే. అలాగే అపాత్రునికి ఏదైనా లభించిందంటే అది అతడిని శిక్షించటానికి మహాకాలుడు తన యమదండాన్ని ఎత్తిపట్టు కున్నాడని అర్థం చేసుకోవాలి. కానీ భవానీమాత తన భక్తులపట్ల ఎల్లప్పుడూ భావపూరిత హృదయురాలై ఉంటుంది కాబట్టి, అలాంటి అమాయకులైన భావుకులైన భక్తుల కొరకు 'సిద్ధకుంజికా స్తోత్రము' నిర్దేశించబడినది. సప్తశతి పారాయణతోపాటు దీనిని కూడా పఠించడం వల్ల సాధకగణం తమ చేతనత్వంలో సాధారణమైన

మంత్రశక్తిని అనుభూతి చెందగలరు. దీనియొక్క అతి విశిష్టమైన శక్తి కేవలం ఎంతో విశిష్టమైన వ్యక్తులు, విశిష్టమైన లక్ష్యములకు సంబంధించినది.

ఇచ్చట చర్చించబడుతున్న సిద్ధకుంజికా స్తోత్రము రుద్రయామల తంత్రమునకు సంబంధించినది. రుద్రయామల తంత్రములో ఈ విశిష్ట స్తోత్రము ఎంతో మహిమాన్వితమైనదిగా చెప్పబడింది. 'శ్రీదుర్గాసప్తశతి' యొక్క అన్ని పారాయణ గ్రంథములలోనూ ఈ స్తోత్రము పఠించే విధానముతో సహా ముద్రించబడినది. గీతాప్రెస్, గోరఖ్‌పూర్‌వారు తమ ముద్రణలో దీనిని చివరి పుటలలో (230) ముద్రించారు. ఈ స్తోత్రము తల్లియైన పార్వతీదేవికి భగవంతుడైన సదాశివునికి మధ్య జరిగిన సంభాషణారూపంలో ప్రకటించబడినది. ఇందులోని మొదటి నాలుగు శ్లోకములలో ఈ స్తోత్రముయొక్క పూర్వపీఠిక ఇవ్వబడినది. ఆ తరువాత ఒక ప్రత్యేకమైన మంత్రము వర్ణించబడినది. ఇది నవార్ణ మంత్రము యొక్క విశిష్టరూపమే. దీని తరువాత మూల స్తోత్రము యొక్క 8వ మంత్రము ఉన్నది. ఆ తరువాతి రెండు మంత్రములలోనూ ఈ స్తోత్రము యొక్క ఫలశృతి ఈ క్రింది విధంగా చెప్పబడినది.

**ఇదం తు కుంజికాస్తోత్రం మంత్రజాగర్తిహేతవే ।**
**అభక్తే నైన దాతవ్యం గోపితం రక్ష పార్వతి ॥**
**యస్తు కుంజికయా దేవి హీనాం సప్తశతీం పఠేత్ ।**
**న తస్య జాయతే సిద్ధిరరణ్యే రోదనం యథా ॥**

అనగా ఈ కుంజికాస్తోత్రము మంత్రమును జాగృతం చేయుటకై ఉద్దేశింపబడినది. భక్తిహీనులైన పురుషులకు దీనిని చెప్పరాదు. ఓ పార్వతీ! దీనిని గోప్యముగా ఉంచుము. హే దేవి! కుంజికా స్తోత్రమును పఠించకుండా కేవలం శ్రీదుర్గాసప్తశతిని పారాయణ చేయటం వల్ల ఎటువంటి సిద్ధి లభించదు, అది అరణ్య రోదనవలె నిరర్థకంగా మిగిలిపోతుంది అని అర్థము.

చూడటానికి అతి చిన్నదిగా ఉండే ఈ స్తోత్రము ఇచ్చే ఫలితాలు విస్మయాన్ని గొల్పుతాయి. శ్రీదుర్గాసప్తశతిని ప్రచురించిన అనేక సంస్థలు దీనిని చివరిపుటలలో ఇచ్చినప్పటికి, సమర్థులైన సాధకులు దీనిని నవార్ణమంత్రజపమునకు ముందు చెయ్యటం మంచిదని భావిస్తారు. ఈవిధంగా దీనిని దేవ్యథర్వశీర్షము తర్వాత

పఠించవలెను. ఇలా చెయ్యటం వలన నవార్ణసహిత సప్తశతి యొక్క వివిధ మంత్రముల జాగరణ కూడా జరుగుతూ ఉంటుంది. సప్తశతి పారాయణతోపాటు జోడించబడిన కుంజికాస్తోత్రమును పఠించే అన్య విధానములు మరికొన్ని ఉన్నవి. కాని వానిని సర్వసాధారణమైన జనుల ముందు వెల్లడించటం మంచిదికాదు. అలా చేయటమనేది నియమములకు విరుద్ధము.

ఈరకమైన ఉన్నతస్థాయి ప్రయోగములను వదలివేస్తే దీనికి సంబంధించి సామాన్య ప్రయోగములు కూడా ఉన్నాయి. శ్రీసిద్ధకుంజికా స్తోత్రమును పఠించే విధానము వానిలో చెప్పబడినది. అందులో సాధకుడు భగవతి యొక్క విగ్రహాన్ని కానీ, పటమును కానీ ఉంచి, పంచోపచార పూజను జరిపి, ఆవునేతితో దీపాన్ని వెలిగించి ఈ స్తోత్రమును పఠించవలెనని చెప్పబడినది. ఈ పఠానాక్రమంలో పూర్వపీఠిక తరువాత, స్తోత్రమునకు ముందు ఇవ్వబడిన మంత్రజపము అత్యంత లాభకారిగా ఉంటుంది. వచ్చిన ఇబ్బంది లేక కష్టము ఏదైనా, విశేషమైనదయినా లేదా లక్ష్యం ప్రత్యేకమైనదైనా ఈ మంత్రమును ఒక మాల జపించే ముందుగానైనా లేదా తర్వాతనైనా గాయత్రీ మహామంత్ర జపంతోపాటు చేయబడ్డ ఈ సాధన శక్తివంతమైనది, తక్షణమే ఫలితాలనిచ్చేదిగా ఉంటుంది. ఇంతేకాకుండా మరి కొన్ని కారణములు కూడా ఉన్నాయి. వాటిని ఈ స్తోత్రమును పఠించే, పారాయణ చేసే క్రమంలో ఎవరికి వారు అనుభూతి చెందగలరు.

ఈ సిద్ధకుంజికాస్తోత్రమును ఒకటికన్నా ఎక్కువ అంటే 3, 5, 7, 9, 11 ఇంకా 21 సార్లు కనుక పఠించినట్లయితే మంత్ర జపం ఒక్కసారి మాత్రమే చేస్తే సరిపోతుంది. పదే పదే జపం చేయవలసిన అవసరం లేదు. ఈ పారాయణ శివుని వాక్కుతో ప్రారంభించి, 'ఇతి శ్రీరుద్రయామలే గౌరీతంత్రే, శివపార్వతి సంవాదే కుంజికాస్తోత్రం సంపూర్ణమ్' అనునంతవరకూ చేయవలెను. దీనిని నియమిత పారాయణ, విశిష్ట అనుష్ఠానంతో పాటు ప్రతిదినము ప్రాతఃకాలంలో పఠించటం విశేషమైన లాభాన్ని చేకూరుస్తుంది. చిన్నపిల్లలకు దీనిని పఠించడం నేర్పితే కనుక వారి బాలారిష్ఠ దోషములు సులభంగా తొలగిపోతాయి. అంతేకాక దీనిని పఠించడం, సాధన చెయ్యటం వల్ల నిత్యము మానవులు ఎదుర్కొనే సమస్తమైన బాధలూ, విఘ్నములూ, ప్రమాదములు మొదలైన చెడు సంఘటనలు వాటంతట అవే దూరమౌతాయి. **చిన్న చిన్న బాలబాలికలు ఒక మాల గాయత్రీ మంత్రజపంతోపాటు**

**కుంజికాస్తోత్రమును నియమంగా పారాయణ** చేసినట్లయితే వారిని ఎటువంటి దౌర్భాగ్యము స్పృశించటానికి సాహసించలేదు.

# 17. ప్రజ్ఞ యొక్క సప్త భూమికల వంటివి దుర్గాసప్తశతిలోని సప్త అధ్యాయములు

ఆదిశక్తి లీలాకథలలో ఇప్పటివరకు శ్రీదుర్గాసప్తశతి పారాయణ–సాధన యొక్క ఆరు అంగముల గురించిన చర్చ జరిగింది. కవచము, అర్గళ, కీలకము, ప్రాధానిక రహస్యము, వైకృతికరహస్యము మరియు మూర్తిరహస్యముల మీద శక్తిసాధకులు మననము కావించారు. ఈ షడంగముల ఉద్దేశ్యం ఒక్కటే. శక్తి సాధన చేస్తున్నప్పుడు ప్రారంభంలో వచ్చే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సరము లనే అరిషడ్ వర్గములు కలిగించే అవరోధములను శమింపజేయుట. ఎందుకంటే ఈ ఆరు అంతఃశత్రువులు ఉన్నప్పుడు సాధన యొక్క ముఖ్య ద్వారంలోకి ప్రవేశించటము సంభవం కాదు అన్న విషయం సాధకులకు తెలుసు. ఇదికాకుండా దేవ్యథర్వశీర్షం, దేవీసూక్తం, రాత్రిసూక్తం మరియు శ్రీసిద్ధకుంజికాసోత్ర తాత్త్విక రహస్యము చెప్పబడినది. వీటన్నింటిలోను ఒక క్రమపద్ధతిలో శక్తి సాధన మాహాత్మ్యం తెలియ జేయబడినది. ఆదిశక్తి లీలాకథలను చదివే శ్రద్ధాళువులైన సాధకులు వాటి గొప్పతనమును అనుభూతిలోకి తెచ్చుకునే ఉంటారు.

ఈ విషయములు అనుభూతిలోకి వచ్చిన తరువాత ఆదిశక్తి లీలాకథ యొక్క ముఖ్యాంగమైన 'శ్రీదుర్గాసప్తశతి' వస్తుంది. ఈ దుర్గాసప్తశతి తన దార్శనిక, మాంత్రిక మరియు యోగార్థ విశేషతలతో ప్రత్యేకంగా నిలుస్తుంది. దీని సంపూర్ణజ్ఞానం భగవంతుడైన సదాశివుడు తప్ప ఈ సమస్త సృష్టిలో అన్యులెవ్వరు ఎరుగరు. దీనినే ఆదిదేవుడైన బోళాశంకరుడు మేరుమంత్రములో ఇలా చెప్పారు.

**సప్తశత్యాశ్చ సకలం తత్త్వం వైజ్ఞయహమేవహి ।**<br>
**పాదోనం శ్రీహరిపేంత్తి, వెత్యర్ద్ధ తు ప్రజాపతి ।**<br>
**వ్యాసస్తుభ్యాం శకంవేతి, కోష్ట్యాంశమితరే జనాః ॥**

అనగా 'సప్తశతి యొక్క సంపూర్ణ తత్త్వము కేవలం నేను మాత్రమే ఎరుగుదును. విష్ణుభగవానునికి కూడా దీనిలోని కేవలం మూడు చరణములు మాత్రమే తెలుసు. బ్రహ్మదేవునికి రెండు చరణములు లేక అర్ధభాగం, వేదవ్యాసునకు కేవలం ఒక చరణం లేక పావుభాగం మాత్రమే తెలుసు. ఇతర జనులకు దీనిలో కేవలం కోటో వంతు మాత్రమే తెలుసు.

ఐతే గురువులకే గురువైన దక్షిణామూర్తి అయిన శివుని చరణములను ఆశ్రయించి, జగజ్జనని మాత ఆదిశక్తి కొంగును ఒడిసిపట్టుకుని ఈ సప్తశతి సాధన చేసేవారికి సర్వతోముఖమైన కళ్యాణం చేకూరుట తథ్యం. **'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్'** అన్న గీతా (1/14) సూత్రమును అనుసరించి దీనిలోని సూత్రములను లేశమైనా ఆచరణలో పెట్టినప్పటికి భవసాగరంలోని గొప్ప భయముల నుండి రక్షణ లభిస్తుంది. విద్వాంసులైనా, జ్ఞానులైనా, యోగులు లేక సాధకులైనా ఎవరైనప్పటికి భావభరిత హృదయముతో కేవలం 'అమ్మా!' అని పిలవటం నేర్చుకుంటే, 'మాతా!' అని అనటం తెలుసుకుంటే వారు ఈ సప్తశతి అనే సరోవరంలో భావమయ స్నానం చెయ్యగలరు.

తల్లి తన సంతానం జ్ఞానులైనా లేక అజ్ఞానులైనా వారి ప్రేమను గుర్తిస్తుంది. వారు ఎంతో తపనతో విలపిస్తూ 'అమ్మా!' అని ఆర్తితో పిలిచిన తక్షణమే దేవి పరుగున వచ్చి వారిని తన ఒడిలోకి తీసుకుంటుంది. వామాఖేపాకు శాస్త్రజ్ఞానం లేదు, భక్తుడైన రామచంద్రప్రసాదు సంస్కృత పండితుడు కాదు, భక్త చండీదాసుకు దర్శనశాస్త్ర తత్త్వజ్ఞానం తెలియదు, కాళీమాత ముద్దుబిడ్డడైన రామకృష్ణపరమహంసకు పాండిత్యం లేదు, కానీ వీరందరి మనస్సులలో తల్లి యొక్క స్మరణ అనే దీపం జ్ఞాన కాంతులను వెదజల్లి వారిని జ్ఞానవంతులను చేసింది. 'నేను విద్య నభ్యసించకపోతే నేమి? కాళీమాత నా అంతరంగంలో జ్ఞానమును ప్రవహింపజేస్తున్నది' అని శ్రీరామకృష్ణపరమహంస అనేవారు.

చేతివ్రేళ్ళ మధ్య కలమును పట్టుకుని దీనిని వ్రాస్తున్న ఈ పేదవాడికి కూడా ప్రేమమూర్తి అయిన ఆ తల్లి దయ మీద విశ్వాసముంది. సద్గురువు సర్వేశ్వరుడైన భగవాన్ సదాశివుని మీద నమ్మకముంది. 'నేను సప్తశతి తత్త్వం సంపూర్ణంగా ఎరుగుదును' అని ఆయన అన్నారు. ఆయనే తత్త్వమును ఉపదేశించి, చక్కగా

వ్రాయిస్తారు. సప్తశతి సంపూర్ణ కథ 3 చరిత్రలుగా, 13 అధ్యాయములుగా విభజించ బడినది. ఇది ఎంత దుర్భేధ్యమైనదో అంత సరళమైనది. సప్తశతి జ్ఞానులకు దుర్భేధ్యమైనది భక్తులకు సరళమైనది. మాత యందు ప్రీతి ఉన్నవారికి, ఆమె చరణముల మీద భక్తి ఉన్నవారికి ఇది అత్యంత సరళమైనది. ఎందుకంటే దీనిలోని ప్రతి శబ్దం భక్తితో నిండిఉంది. ఇందులోని అక్షరం అక్షరం మాత మహిమతో ప్రకాశిస్తు ఉంటుంది.

సప్తశతిలోని మూడు చరిత్రలు గాయత్రీమంత్రంలోని మూడు చరణముల వంటివి. అవి జగదంబ త్రిగుణాత్మక రూప బోధ చేస్తాయి. అంతేకాక సాధకునకు త్రిగుణముల తాత్త్విక రహస్యమును ఉపదేశించి అతనిని త్రిగుణాతీతునిగా నిలబెడతాయి. ఎందుచేతనంటే మాత ఏకకాలంలో గుణమయి, గుణాతీతురాలు కూడా. ఆమె మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి రూపంలో సాధకునికి సత్త్వ రజస్తమోగుణముల జ్ఞానమును ప్రసాదిస్తూ వారిని ఈ త్రిగుణాలనుండి ముక్తులను కావిస్తుంది. ఇదేవిధంగా 700 మంత్రములతో నిండిన భండాగారం శ్రీదుర్గాసప్తశతి. అంతేకాక అందులో సప్తమహాశక్తుల కథ కూడా ఉంది. ఈ ఏడు మహాశక్తులు సాధకుని సప్తచక్రాలను భేదిస్తాయి. అతనికి సప్తచక్రాలలోని జ్ఞానమును బోధించి క్రమంగా జ్ఞానం యొక్క సప్తతలాలను దాటించివేస్తాయి.

పతంజలిమహర్షి తన యోగసూత్రాలలో **'తస్య సప్తధా ప్రాంతభూమిః ప్రజ్ఞా (2/27)'** అన్న సూత్రమును ప్రతిపాదించి ప్రజ్ఞ యొక్క ఏడు తలాల చర్చ చేశారు' అన్న విషయం యోగశాస్త్రం అధ్యయనం చేసినవారికి తెలుసు. సాధకునికి సప్త ప్రజ్ఞలు వరుసగా 1) జ్ఞేయశూన్య అవస్థ 2) హేయశూన్య అవస్థ 3) ప్రాప్యప్రాప్త అవస్థ 4) చికీర్షాశూన్య అవస్థగా అనుభూతిలోకి వస్తాయి. ఆ తరువాత ప్రజ్ఞరూపంలో 1) చిత్తకృతార్థత 2) గుణలీనత 3) ఆత్మస్థితిగా అనుభవంలో కొస్తాయి.

ఈ సప్తభూమికల చర్చ 'యోగవాశిష్ఠం'లో జ్ఞానం యొక్క సప్తభూమికల రూపంలో చెయ్యబడినది. ఈ సప్తతలాలు వరుసగా 1) శుభేచ్ఛ 2) విచారణ 3) తనుమానస 4) సత్త్వాపత్తి 5) అసంసక్తి 6) పదార్థభావని మరియు 7) తుర్యగా. శక్తి సాధకులను మాత వరుసగా 1) మధుకైటభ వధ 2) మహిషాసుర వధ 3) ధూమ్రలోచన వధ 4) చండముండల వధ 5) రక్తబీజుని వధ 6) నిశుంభ వధ 7)

శుంభుని వధ అనే ఏడు భూమికలను దాటించివేస్తుంది. మాత తన సంతానం చేసే సాధనలో వరుసగా వచ్చే ఈ ఏడు అవరోధాలను లేక విఘ్నాలను అధిగమింపజేసి వారికి తత్త్వజ్ఞానము ప్రసాదిస్తూ శక్తిని అనుగ్రహిస్తుంది.

సప్తశతిలో సప్తతలాల ప్రజ్ఞ–సత్యం నిబిడీకృతమై ఉండటంతో పాటు దీనిలోని మూడు అధ్యాయములలో ప్రకృతిలోని సమస్త రహస్యములు ఇమిడి ఉన్నాయి. ఆ మూడు అధ్యాయములు 1) సత్త్వరజస్తమములనే త్రిగుణములు 2) అవిద్య–అస్మిత–రాగ–ద్వేష–అభినివేశము లనే పంచక్లేశములు 3) ప్రమాణం–వికల్పం–విపర్యయం–స్మృతి–నిద్ర అనే పంచవృత్తులను సమన్వితం చేస్తాయి. సప్తశతి పారాయణ మరియు సాధనతో సాధకుడు ఈ మూడు తత్త్వాలను నశింపజేసుకుంటూ, పరిణతి చెంది చివరగా సగుణ స్థితిని అధిగమించి ఆత్మస్థితిని అనుభూతిచెందుతాడు.

ఇంతమాత్రం సాధనతోనే సాధకునికి విభూతుల మరియు సిద్ధుల లెక్కలేనన్ని వరదానాలు లభిస్తాయి. పై పంక్తులలో చెప్పబడినది సాధనతో ప్రాప్తించే సత్యం యొక్క సూక్ష్మ ప్రకాశం మాత్రమే. వాస్తవ సత్యం చాలా విశాలమైనది. దాన్ని చెప్పటానికి ముందు, ఒక వ్యాసంలో మూడు చరిత్రల సమన్విత తాత్త్విక మరియు మంత్రపరమైన పరిచయం ఇవ్వబడుతుంది. దాని తరువాత తిరిగి అప్పుడు మూలకథా క్రమం ప్రారంభమౌతుంది. అందులో ముందుగా ప్రతి చరిత్ర మరియు ప్రతి అధ్యాయం యొక్క వాస్తవ జ్ఞానం ఉపదేశించబడుతుంది. తదుపరాంతం ఆ చరిత్రలోని ప్రతి అధ్యాయం యొక్క విశేష మంత్రసాధన, విధివిధానం, దాని తత్త్వదర్శనం మరియు యోగం–సత్యం యొక్క ఉపదేశ క్రమం అందించబడుతుంది. ఈ కథాక్రమంలో గాయత్రీ మంత్ర విజ్ఞానం యొక్క ప్రతి పదం మరియు అక్షరమును శక్తి సాధకులు అనుభూతిచెందగలరు. రాబోయే భాగములలో శక్తి సాధకులకు తమ మాత యొక్క మమతామాధుర్యం అలౌకిక రీతిలో బోధించబడుతుంది. అది సాధకుల బుద్ధిని తీక్షణంగా చేసి, ప్రజ్ఞను దీప్తివంతం చేసి, భావములను అద్భుత రీతిలో నింపుతుంది.

# 18. శ్రీ దుర్గాసప్తశతి కథ గాయత్రీ సాధనా మర్మమును తెలుపుతుంది

ఆదిశక్తి లీలాకథలోని ప్రతి అక్షరము గాయత్రీ సాధన యొక్క ఆధ్యాత్మిక అనుభూతులతో నిండి ఉంటుంది. దీనిలోని ప్రతి చరిత్ర, ప్రతి అధ్యాయం, ప్రతి మంత్రం, ప్రతి శబ్దములో గాయత్రీ మంత్ర అధిష్ఠాత్రి శక్తి యైన భగవతి గాయత్రి కరుణ కిరణములు ప్రకాశిస్తాయి. అంతేకాదు ఈ పవిత్రమైన కథలో సవితాదేవుడైన భర్గుని తేజస్సు ధారణ చేసే విజ్ఞానం ఉద్ఘాటించబడినది. ఈ వ్యాస పరంపరలో ముందు ప్రచురించబడిన వ్యాసాలు తాత్త్విక దృష్టితో గాయత్రీ మంత్ర సాధన చేస్తున్నప్పుడు ఆచరించే షట్కర్మల తత్త్వపరమైన విస్తృత వర్ణనలే. వాటిని గాయత్రీ పురశ్చరణకు ముందు చేసే షట్కర్మలు మరియు తదుపరాంతం ఆచరించే క్రియారూపంలో కూడా అనుభూతి చెందవచ్చును.

**పాఠకులను అన్య ఉపాసనల వైపుకు ప్రేరేపిస్తున్నామేమో అన్న సందేహం పాఠకులకు మనస్సులో ఏ మూలనో తొంగి చూడవచ్చును. కానీ ఆ సందేహమును త్యజించవలెను.** నిజమేమిటంటే ఈ వ్యాసపరంపర ద్వారా వారిని గాయత్రీ సాధన యొక్క ఉచ్చస్తరీయ సోపానాల దిశగా తీసుకువెళ్ళే ప్రయత్నం జరుగుతున్నది. వ్యాసపరంపర సహాయంతో శరీర త్రయము, సప్తచక్రాలు, పంచకోశసాధనా విజ్ఞానముల సాధనా విధానమును తెలుసుకొనగలరు. మరియు గాయత్రీ సాధనా ప్రక్రియతో కుండలినీ తత్త్వజ్ఞానం, సత్య సాక్షాత్కారం ఏ చరణముల ద్వారా, ఏవిధంగా జరుగుతుంది అనేది సాధకులు గ్రహించగలరు.

ఇప్పటివరకు ఏ సాధకులైతే గాయత్రీమంత్ర సాధన ద్వారా తమ లౌకిక సమస్యలనుండి బయటపడి, వాటిని అధిగమిస్తూ వచ్చారో, వారు ఇప్పుడు గాయత్రీమంత్ర సాధన ద్వారా సత్త్వ, రజ, తమో గుణముల వలన కలిగే అవరోధము లను అధిగమిస్తూ ఆధ్యాత్మిక విభూతులను తత్త్వపరమైన సత్యరూపంలో ఏవిధంగా పొందగలరో కూడా గ్రహించగలరు. ఈ స్థితిలో ఏ భయాలు ఉండరాదు, ఏ భ్రాంతులకు తావివ్వకండి. వివేకమును కోల్పోకండి. అంతఃకరణలో అణువంత భక్తి, లేశమాత్రపు వివేకం ఉన్నవారు గాయత్రి తత్త్వమునకు వేరుగా బాహ్యజగత్తులో,

సృష్టిలో మరేది లేదు అన్న విషయమును తెలుసుకుంటారు. సర్వ స్వరూపాలలో భగవతి దర్శనానుభూతి చెందగలవారే నిజమైన భక్తులు.

**ఆదిశక్తి లీలాకథ నిజానికి యథార్థంగాను, సంపూర్ణమైన అర్థంలోను గాయత్రీమాత గాథయే!** ధర్మాచరణగావించే మనుష్య లలో వివేకం జాగృతమైనప్పుడు అతను ఆధ్యాత్మిక సాధనను, గాయత్రీ సాధనను ఆరంభిస్తాడు. సాధకునిలో శ్రమ, దమ, విరక్తి, తితీక్ష, వివేక-వైరాగ్య-ముముక్షత్వాలు జాగృతమై నప్పుడు అతని యథార్థ సాధన ప్రారంభమౌతుంది. అవే ఆదిశక్తి లీలాకథ యొక్క షడంగములు. కవచం, అర్గళ, కీలకం, ప్రాధానిక రహస్యం, వైకృతికరహస్యం మరియు మూర్తి రహస్యములను అనుభూతి చెందిన సాధకుడే ఆధ్యాత్మిక మార్గంలో పయనించుటకు యోగ్యుడు.

సాధకుని ఈ యోగ్యతే ఆధ్యాత్మిక మనస్సు రూపంలో, పరమేశ్వరుని కృపారూపంలో అంకురిస్తుంది. దానినే శేషసాయి మీద శయనించిన విష్ణుభగవానుని నాభినుండి బ్రహ్మదేవుని ప్రకటీకరణగా వర్ణిస్తారు. పరమేశ్వరుని కృపతో ఉద్భవించిన ఆధ్యాత్మిక మనస్సు ముందుగా తమస్సును ఎదుర్కొంటుంది. నలుచెరగులా అంధకారం ఆవరించి ఉంటుంది. ఆ గాడాంధ కారంలో విష్ణుదేవుని కర్ణములలోని గుబిలినుండి ఆవిర్భవించిన మధు-కైటభులు అనగా మోహం-భయములు ఆధ్యాత్మిక మనస్సును భయపెడతాయి. అప్పుడు గాయత్రి సాధకుని ఆధ్యాత్మిక మనస్సు, అనగా బ్రహ్మదేవుడు తన రక్షణ కొరకు భగవతి జగన్మాతను ఎలుగెత్తి పిలుస్తాడు. ఆ సమయంలోనే భక్తి యొక్క ప్రారంభరూపం, ఆర్తిభావన ప్రకటితమౌతుంది. రాత్రిసూక్త రూపంలో దీని వ్యక్తీకరణ జరుగుతుంది. సాధకుని ఆధ్యాత్మిక మనస్సు యొక్క ఈ ప్రార్థనను ఆలకించి భగవతి గాయత్రి కుండలినీ జాగరణ ప్రథమ చరణంగా ఆవిర్భవిస్తుంది.

దీనితోపాటు సహస్రారదళం మీద నిదురించిన అనగా సహస్ర పడగల శేషనాగుమీద శయనించిన విష్ణుభగవానుని యోగ నిద్ర భంగమౌతుంది. దేవదేవుడు మధు-కైటభులతో యుద్ధం చేస్తాడు. అయితే అనుభవజ్ఞుడైన సాధకునికి మోహం-భయముల నుండి బయటపడుట అంత తేలికకాదని తెలుసు. అందువల్ల పరమేశ్వరి కుండలినీ మహాశక్తి మధు-కైటభులను మోహింపజేస్తుంది. ఆమె మాయచే

మోహితులైన మధు–కైటభులు ‘విష్ణు భగవానుడినే తమనుండి వరదానమును గ్రహించమని’ అడుగుతారు. ‘నాచేతిలో మీరు మరణించాలి’ అని విష్ణువు ఆ రాక్షసుల నుండి మాటను తీసుకుంటాడు. మాటకు కట్టుబడిన రాక్షసద్వయం భగవానుడు విష్ణువు చేతిలో అసువులు కోల్పోతారు. తదుపరాంతం అస్తిత్వంలో ఆధ్యాత్మిక ప్రకాశం కాంతులీనుతుంది. దానికితోడు కుండలినీ జాగరణ ప్రారంభిక ప్రక్రియ పూర్ణమౌతుంది.

దీని పిమ్మట గాయత్రీ సాధన ద్వితీయ చరణం ఆరంభమౌతుంది. ఈ స్థితిలో సాధకుని సాధన మీద సంస్కారాలు ఆధిపత్యం చెలాయిస్తాయి. సాధకుని ప్రాణబలం ఈ వాసనల కుతంత్రంలో చిక్కుకుని అర్ధ–పశు రూపును ధరిస్తుంది. ఆ రూపే మహిషాసురుడు. మహిషుని నాశనం కొరకు ఇంద్రియాల అధిదేవత, మనస్సు అనగా బ్రహ్మ, వైరాగ్యభావం అనగా శివునితో కలిసి శేష శయనుడైన విష్ణు భగవానుడిని మార్గదర్శనమునకై అర్థిస్తారు. విష్ణువు మార్గదర్శన స్వరూపం ఇక్కడ మరల భగవతి గాయత్రీ మహాశక్తిగా అవతరిస్తుంది. ఈ వాసనలను – భావనలుగా రూపాంతరం కావిస్తుంది. ఈ తత్త్వం ఎలా ముందుకు సాగుతుంది అన్న విషయము యొక్క విస్తారమైన కథా వర్ణనయే ద్వితీయ చరిత్ర.

తన సాధన ప్రారంభ చరణాలలో సాధకుని చేతన మూలాధారం నుండి జాగృతమై స్వాధిష్ఠానచక్రమునకు చేరి ఆ చక్రానుభూతి చెందుతూ మణిపూరకచక్రంలో ప్రతిష్ఠితమౌతుంది. ఈ ద్వితీయ చరణంలో అనాహతచక్రంలో అతని వికాసం జరుగుతుంది. ఈ కథానుభూతిని చెందని సాధకుడు ఎప్పటికీ వాసనలనే బురదలో కూరుకుపోయి ఉంటాడు. సాధకుడు తప్పకుండా సాధనలోని సూక్ష్మ అనుభూతులను చెందాలి. ఈ అనుభవం తర్వాతనే సాధకుడు తృతీయచరణంలోకి అడుగు పెట్టగలడు.

ఈ తృతీయ చరణంలో ‘ధియో యోనః ప్రచోదయాత్’ యొక్క లక్ష్యమైన బంధనముక్తి తత్త్వదర్శనంతో జరుగుతుంది. అయితే ఇక్కడ సాధకుడు అహంకారం, మమత అనే భావాలు అనగా శుంభ–నిశుంభులు అను రాక్షసులతోను, అతని సేనయైన 1) సుగ్రీవుడు (పరిగ్రహించుట), 2) ధూమ్రలోచనుడు (భ్రాంతి), 3) ముండుడు (దర్ప–నివృత్తి), 4) చండుడు (క్రోధ ప్రవృత్తి), 5) రక్తబీజుడు (కామన–

కర్మబీజం) అనే రాక్షససేనతో తలపడవల్సి ఉంటుంది. ఈ స్థితిలో సాధకుడు ప్రబల భావనతో గాయత్రీ సాధన చేస్తే ముందుగా మూలాధారం, తర్వాత అనాహత చక్రములలో ప్రకటితమయ్యే భగవతి గాయత్రి తిరిగి ఇప్పుడు ఆజ్ఞాచక్రంలో ప్రత్యక్ష మౌతుంది.

ఆజ్ఞా చక్రంలో ఆవిర్భవించిన గాయత్రీదేవీ అక్కడున్న అహంకార–మమకారా లతో తలపడి వాటితోను, వాటి సేనతోను భీకర సంగ్రామం చేస్తుంది. ఈ క్రమంలోనే సాధకునిలో గాయత్రీ మహా ప్రజ్ఞరూపం అవతరించి, ఆ దేవి సాధకునికి 'ధర్మమేధ సమాధిస్థితి' ని అనుగ్రహిస్తుంది. అంతేకాక సాధకుడిని తీసుకుని దేవి స్వయంగా సహస్రారచక్రం మీద ప్రతిష్ఠితమౌతుంది. ఇదే సాధకుడు అందుకోవల్సిన చరమస్థితి. గాయత్రీ సాధన యొక్క సారం కూడా ఇదే. **అందువల్ల సాధకులు ఆదిశక్తి లీలాకథ రూపంలో ఈ గాయత్రీ సాధనను లోతుగా మననం చెయ్యవల్సి ఉంటుంది.**

*– అఖండజ్యోతి, జూన్ 2008*

# 19. తత్సవితుర్వరేణ్యం యొక్క మర్మం

ఆదిశక్తి లీలాకథ (శ్రీదుర్గాసప్తశతి) యొక్క ప్రథమచరిత్ర గాయత్రీ మంత్ర సాధన యొక్క మొదటి చరణము. తత్వపరంగా ఈ కథాంశము త్రిపదా అయిన గాయత్రీ మంత్ర ప్రథమ చరణము 'తత్సవితుర్వరేణ్యం' యొక్క విపుల వివరణయే. గాయత్రీ సాధనలో సాధకుని స్థితి ఎలా ఉంటుంది? పరిస్థితులు మరియు మనః స్థితి యొక్క ఏయే అవరోధములను సాధకుడు ఎదుర్కొనవలసి వస్తుంది? దీని యొక్క అత్యంత రమణీయమైన వర్ణన ఈ కావ్యకథలో చెయ్యబడినది. తన ఈ అవరోధముల నివారణకు, వాటి తొలగింపునకు ఆధ్యాత్మిక సాధకునకు సద్గురు ప్రాప్తి కలుగుతుంది. గురువే సాధకునకు మహామాయాతత్త్వమును – గాయత్రి యొక్క సత్యమును ప్రబోధించినపుడు శిష్యుని సాధన యొక్క ప్రథమ చరణము ప్రారంభమౌతుంది.

ఈ ప్రథమ చరణంలో సాధకుడిని తమస్సు నలుచెరగులా చుట్టుముడుతుంది. ఈ మహాంధకారం యొక్క సంతానము సాధకుని తీవ్ర అభిలాషను, ఆధ్యాత్మిక

మనస్సును మ్రింగి వేయాలనుకుంటాయి. అప్పుడు అతని ఆధ్యాత్మిక మనస్సు గురు మంత్రమును స్మరిస్తుంది. అంతేకాక గాయత్రీమహామంత్ర ప్రథమ చరణ అధిష్ఠాత్రి యైన ఆదిజననిని, ఆ పరమాత్మను ఎలుగెత్తి పిలుస్తుంది. 'హేమాత! ఈ అంధకారము భయమును గొలుపుతున్నది, అంతా అగమ్యగోచరముగా ఉన్నది. స్వయంగా పరమేశ్వరుడు కూడా యోగనిద్రలో మునిగియున్నాడు. ఇటువంటి స్థితిలో సాధనకు అవరోధము కలిగించే అసురుల సంహారము ఎవరు చేస్తారు?' అని ఆర్తితో ప్రార్థిస్తాడు. సాధకులకు ఒక సత్యము ఎప్పుడూ చిరపరిచితమైనదే! వాక్కు ఒక్కొక్కసారి వినిపించకపోవచ్చు, కానీ ఆర్తితో కూడిన తీవ్ర ఇచ్ఛ మహాదేవికి వినిపించకపోవటమనేది ఎక్కడా ఉండదు. ఆదిశక్తి గాయత్రి మహామాయ, మహాకాళీ రూపు ధరించి కాళికయై తమస్సును పటాపంచలుచేస్తుంది.

అప్పుడు యోగనిద్రావశుడైన పరమేశ్వరుడు అట్టహాసం చేస్తూ అసురులతో సంవాదం చేస్తాడు. తమస్సు యొక్క ఈ సంతానము మహామాయ కృపతో స్వయంగా తమస్సునకు అధీనమై మోహితులౌతారు. ఈ స్థితిలో వారు వరదాత అయిన పరమేశ్వరుడినే వరము కోరుకోమని అంటారు. ఈ వరదానముతో అసుర సంహారం జరిగి సృష్టికి అంకురార్పణ ఆరంభమౌతుంది. ఈ సంపూర్ణ కథ శ్రీదుర్గాసప్తశతి యొక్క మంత్రకావ్య ప్రథమ చరిత్రలో గానం చెయ్యబడినది. ఇదే సూత్రరూపంలో తత్సవితుర్వ రేణ్యంలో ఇవ్వబడింది. గాయత్రీ మహామంత్ర ప్రథమ చరణములో ఈ సత్యమును అన్వేషించినప్పుడు మంత్రకథా స్వరం స్వయంగానే సాధకుని చేతనలో ప్రతిధ్వనిస్తుంది.

గాయత్రీ మహామంత్ర ప్రథమచరణములో కేవలము మూడు శబ్దములే ఉన్నాయి. అవి 1) తత్ 2) సవితుః 3) వరేణ్యం. వీటిలో మొదటి రెండు శబ్దములు పరమాత్మ యొక్క ద్వివిధావస్థలను గోచరింపజేస్తాయి. మూడవ శబ్దములో ఆధ్యాత్మిక సాధకుని తీవ్ర ఇచ్ఛ, శరణాగతుల భావనలు అంతర్లీనంగా ఉంటాయి. ఏ ఆధ్యాత్మిక సాధకుని జీవితంలోనైనా అతని ప్రాపంచిక సంపదతో అనుబంధం తెగిపోయినప్పుడు యోగ దృష్టి పరంగా ఆ క్షణములు పుణ్యప్రదములై ఉంటాయి. బుద్ధికి ఎవరైనా సద్గురువు లభ్యమై, ఆ సద్గురువు వారికి గాయత్రీమంత్ర దీక్ష నిచ్చి, వారికి ఆదిశక్తి యొక్క తాత్త్విక రహస్యమును బోధించినప్పుడే వారి సాధన ఆరంభమౌతుంది. ఈ

సమస్త విషయములు గాయత్రీమంత్ర పృష్ఠభూమి రూపంలో ఈ ప్రథమ చరిత్రలో వర్ణించబడినవి.

గాయత్రీమంత్ర ప్రథమచరణంలో దీని తదుపరి విషయములను ఆధ్యాత్మిక సాధకుని ఆధ్యాత్మిక మనస్సు నెమ్మదిగా ఒక క్రమంలో సాక్షాత్కరింపజేసుకుంటుంది. ఈ క్రమంలో పరమాత్మ యొక్క దర్శనానుభూతిని సాధకుడు నిర్విశేష యోగనిద్రలో మునిగిన స్థితిగా అనుభవిస్తాడు. ఇదే 'తత్' శబ్ద యోగరహస్యం. ఈ స్థితిలో భగవంతుడు భక్తునకు సహాయపడడు. ఎందుకంటే సాధకునిలో అతని క్రియాశక్తి అంతర్లీనంగా ఉంది. సాధకుని ఆధ్యాత్మిక మనస్సు ఆదిశక్తిని ఎలుగెత్తి పిలుస్తూ, ఆమె శరణుజొచ్చినప్పుడే తమస్సు దూరమౌతుంది. వరేణ్యం – శబ్దములో ఈ భావమే దాగివుంది. వరేణ్యం యొక్క సాధనా ప్రభావం వలన పరమాత్మ రూపంలోనే తత్ నుండి సవితుః యొక్క సత్యం ప్రకటితమౌతుంది. భగవంతుని క్రియాశక్తి తమోగుణ వినాశకుడైన సవితాదేవుని రూపంలో ప్రత్యక్షమౌతుంది. సవిత యొక్క శక్తి సావిత్రి, ఆమెయే మహాకాళి, కాళరాత్రి. కాళీమాత కృపచేత కుండలినీ జాగరణ అనే మహత్కార్యం సంపూర్ణమౌతుంది. ఆమె గర్భం నుండే సృష్టి ఆవిర్భవిస్తుంది. యోగసాధకుని అంతఃకరణంలో ఆధ్యాత్మిక ఉషోదయం దర్శనమిస్తుంది.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ ప్రథమ చరిత్రలో పలు చరిత్రలు ఉన్నాయి. వాటికి తమవైన లోతైన ఆధ్యాత్మిక అర్థములున్నాయి. కథ యొక్క ఈ వివిధ చరిత్రలలో 1) మార్కండేయ మహర్షి 2) రాజా సురథుడు 3) సమాధి వైశ్యుడు 4) మహామాయ తత్త్వమును బోధపరిచే మేధా ఋషి ఉన్నారు. ఈ చరిత్రలలో గాయత్రీ సాధకుని సాధన యొక్క ఆరంభ భూమిక వర్ణించ బడినది. దీని తరువాత 5) విష్ణు భగవానుడు 6) విష్ణువు కమలనాభి నుండి ఆవిర్భవించిన బ్రహ్మ 7) మధువు 8) కైటభుడు అనే రాక్షసులు ఉన్నారు. వీరు సాధకుని సాధనకు అవరోధములను కల్పిస్తారు. 9) భగవతి కాళరాత్రి, మహాకాళి ఉన్నది. ఆమె ఈ సంపూర్ణ చరిత్రకు అధిష్ఠాత్రి.

ఈ వివిధ చరిత్రల ఆధ్యాత్మిక చర్చలను చేస్తే వీటన్నింటినుండి తత్త్వజ్ఞాన ప్రకాశకిరణాలు వెదజల్లబడతాయి. ఈ కథా భాగపు ప్రథమ చరిత్ర మార్కండేయ ఋషిది. మార్కండేయ మహర్షి ఈ సంపూర్ణ కథలో ఎక్కడా కూడా ఏవిధమైన

పాత్రను పోషించరు. ఆయన కేవలము కథను వివరిస్తారు. ఆయన ఈ కథకు సూత్రధారులు. పురాణాలలో మార్కండేయ మహర్షి జీవితకథను వెతికితే ఆయన భగవంతుడైన మహాకాలుడిని ఆరాధించారు, మహాకాలుని కృపతో ఋషి శివాంశునిగా, శివస్వరూపునిగా రూపుదాల్చారు అని తెలుస్తుంది. ఈవిధంగా ఋషి ఈ సంపూర్ణకథను మహాకాలుని అంశగాను, ఆయన ప్రతినిధిగాను ఉండి కథను వినిపిస్తారు. నిజంగానే మహాకాలుని అంశ, ఆయన స్వరూపమే సాధకుని చేతనలో మరియు సమస్త సృష్టిని ఆవరించియున్న భగవతి లీలాకథకు సాక్షి. ఆయనయే వక్తగా ఉంటాడు, అలా ఉన్నాడు కూడా!

కథ యొక్క ప్రథమచరిత్రలో రాజా సురథుని చరిత్ర రెండవది. పృథ్వీతత్త్వ ప్రధానమైన ఈ శరీరమునకు స్వామి జీవాత్మ. అది ఆసురీశక్తుల చేతిలో ఓడిపోయి, హతాశయైన స్థితిలో పడియున్నది. సమాధివైశ్యునిది తృతీయచరిత్ర. ఇతను బుద్ధికి సంకేతము. బుద్ధి 'మనస్సు, ఇంద్రియములు' అనే తన కుటుంబసభ్యులచేతనే తిరస్కరింపబడి, బహిష్కృతమైనది. చతుర్థ చరిత్ర మేధాతిథిది. ఋషి ఆశ్రమము వింధ్య పర్వత శ్రేణులలో ఉంది. అది సాధకుని హృదయస్థానమునకు సంకేతము. ఇక్కడ నివాసముంటున్న మేధాఋషి వాస్తవానికి యోగసాధకుని అంతర్‌ప్రజ్ఞకు ప్రతీక. ఈ అంతర్‌ప్రజ్ఞ సాధకుని జీవితంలో సద్గురువు పాత్ర పోషిస్తుంది. అంతర్‌ప్రజ్ఞతో గాయత్రీ తత్వ ప్రబోధమును పొంది రాజా సురథుడు, సమాధివైశ్యుడు సాధన చేస్తారు. జీవాత్మ మరియు బుద్ధిల సాధనారూపంగా తపస్సు, ధ్యానము అనే రెండు సాధనలు ఆరంభమౌతాయి.

ఈ సాధనలో మేధాఋషి ద్వారా చెప్పబడిన సత్యము సాక్షాత్కరిస్తుంది, ప్రకటీకృతమౌతుంది. అది ఐదవ చరిత్ర. సత్యము స్వయంగా పరమాత్మ స్వరూపము. ఆధ్యాత్మిక సాధకుడు తన శ్రద్ధ మరియు విశ్వాసంతో దీనిని అనుభూతి చెందుతాడు. దీని అంశ తరువాతది అయిన ఆరవచరిత్రకు చెందినది. అనగా బ్రహ్మకు సంబంధించినది. గాయత్రీ సాధకునిలో ఆధ్యాత్మిక మనస్సు అనగా బ్రహ్మ యొక్క అనుభూతి కలుగుతుంది. మధు-కైటభులు అను ఇద్దరు అసురులు ఈ మనస్సును పీడిస్తుంటారు. వీరు వరుసగా మోహము-భయములకు సంకేతము. వీరు సాధకుని సంపూర్ణ సాధనను భగ్నం చేయాలని అనుకుంటారు. అప్పుడు సద్గురువు ద్వారా గాయత్రీ తత్వబోధన పొందిన ఆధ్యాత్మిక మనస్సు ఆదిశక్తి పరమేశ్వరిని ఆర్తితో

పిలుస్తుంది. పరమేశ్వరి కృపతో తమస్సును హరించివేస్తుంది. భగవంతుని సవితా రూపం దర్శనమిస్తుంది. తక్షణమే విఘ్ననివారణ జరిగి, తత్ఫలితంగా సాధకుని చేతనలో ఆధ్యాత్మిక ఉషోదయం దర్శనమిస్తుంది. వీటి ద్వారా గాయత్రీ సాధకులు గాయత్రీ సాధనా మర్మమును అవగతం చేసుకొనగలరు.

## 20. వినియోగ మంత్రముతో గాయత్రీ మహత్యం ప్రకటితమౌతుంది

ఆదిశక్తి లీలాకథ వినియోగమంత్రముతో ప్రారంభమౌతుంది. సాధనాక్రమంలో విశేషించి మంత్రసాధనలో వినియోగమునకు తనదైన విశిష్ట మహత్వమున్నది. ఈ క్రమంలో సాధకుడు సాధనావిధాన ప్రవర్తకుడైన ఋషి, దాని అధిష్ఠానదేవత, మంత్ర ఛందస్సు, దాని బీజం, సాధనావిధాన తత్త్వము, దాని స్వరూపమును పఠిస్తాడు. వాటిని హృదయంగమం చేసుకుంటాడు. దానికి అనుగుణంగా తన సాధనా ప్రక్రియలో, జీవనశైలిలో అవసరమైన మార్పులు, చేర్పులు చేసుకుంటాడు. వినియోగం అన్నది ఒకరకంగా సాధనావిధి యొక్క మహత్వపూర్ణమైన తత్త్వములన్నింటిని మించిన ఉత్తమస్థాయి జ్ఞానము. ఒకవేళ ఏ వ్యక్తియైనా సాధనాశీలుడైతే, అతని అంతర్ప్రజ్ఞ జాగృతమై ఉంటే అతనికి కేవలం సాధనావిధి యొక్క వినియోగమును చెప్పినప్పుడు అతను స్వయంగా సాధన యొక్క సంపూర్ణప్రక్రియ–ప్రభావాలను అవగాహన చేసుకుంటాడు. ఈసాధనా ప్రక్రియ ప్రయోగం ఎప్పుడు, ఏ స్థితిలో, ఎక్కడ, ఏవిధంగా చేయాలి అన్న విషయమును కూడా అర్థం చేసుకుంటాడు.

గాయత్రీమహామంత్ర సాధన ప్రథమ చరణము యొక్క ప్రక్రియ ప్రభావం, దాని విజ్ఞానము ఏమిటి? అన్న ప్రశ్నలకు సమాధానం ఆదిశక్తి లీలాకథ యొక్క ప్రథమచరిత్ర యొక్క వినియోగం ద్వారా తెలుస్తుంది. సాధనారతులైనవారు తమ తీవ్రమైన ప్రయత్నముతో సూక్ష్మజగత్తు యొక్క ద్వారములను తెరుస్తారు. సాధన యొక్క సూక్ష్మతత్త్వాల జ్ఞానమును ప్రాప్తింపజేసుకున్న సాధకులు దీన్ని అవగతం చేసుకొనగలరు. అయితే ఇప్పుడు కేవలము మంత్ర పురశ్చరణలో మునిగి ఉన్న

సాధకులు, స్థూలకర్మకాండల ప్రాముఖ్యత తెలియని సాధకులు దీనిని అర్థం చేసుకొనజాలరు. దీన్ని అవగాహన చేసుకుంటేనే జడత్వము, తమస్సు, అంధకారములను నశింపజేసుకుంటూ ఊర్ధ్వగతిని పొందగలరు.

ఈ జిజ్ఞాసను జాగృతపరచి, ఈ తీవ్రఇచ్ఛను రగిలించటమే వినియోగ ఉద్దేశ్యము. దాన్ని ప్రథమచరిత్ర ప్రారంభంలో ఈ విధంగా ఉచ్చరింపవలెను. 'ఓం ప్రథమచరిత్రస్య బ్రహ్మ ఋషిః, మహాకాళీ దేవతా, గాయత్రీ ఛందః, నన్దాశక్తిః, రక్తదన్తికా బీజమ్, అగ్నిస్తత్త్వమ్, ఋగ్వేదః స్వరూపమ్, శ్రీమహాకాళీ ప్రీత్యర్థం ప్రథమచరిత్ర జపే వినియోగః' ఈ వినియోగమంత్రములో 1. ఓంకారం ధ్యానబీజం. అంతేకాక ఓంకారము భగవంతుని నామధేయము 2. దీని స్మరణతోపాటుగా ప్రథమచరిత్ర యొక్క మంత్రద్రష్ట ఋషి గూర్చి చెప్పబడినది. ఋషి – బ్రహ్మ. 3. ఆదిశక్తి గాయత్రీమాత ప్రథమ మహాశక్తి –భగవతి మహాకాళి. 4. మంత్రకావ్యంలోని ప్రథమచరిత్ర ఛందస్సులలో శ్రేష్ఠమైన గాయత్రీ ఛందస్సులో గానం చెయ్యబడినది. 5. ఈ సాధనా శక్తి నంద. 6. సాధకుని అంతశ్చేతనలో విస్ఫోటనం చెందిన బీజమంత్రం అధిష్ఠానదేవతాశక్తి రక్తదంతిక. దీని తత్త్వము– అగ్ని. స్వరూపము ఋగ్వేదము. ఈ సాధనోద్దేశ్యము భగవతి గాయత్రి ప్రథమశక్తియైన మహాకాళీ కృపను పొందుట. మాత కృపతో సాధకుడు తన సాధన ద్వారా తన అస్తిత్వములోని అంధకారమును పటాపంచలు చేసుకుంటాడు.

వినియోగమంత్రములోని ఈ అష్టతత్త్వములు తమలో తాము చాలా సూక్ష్మమైనవి, లోతైనవి, రహస్యమైనవి. అనుభవజ్ఞులైన సాధకులకు తమ సాధనలో ఈ సంపూర్ణరహస్యములు తేటతెల్లమౌతాయి. ఇక్కడ సంకేతాత్మక చర్చమాత్రమే జరుగుతున్నది. తద్వారా దీనిని అర్థం చేసుకొన్న సాధకులు తమ సాధనా ప్రక్రియను సుగమం చేసుకొనవచ్చును. వినియోగమంత్ర ప్రథమ తత్త్వరూపంలో 1. పరమాత్ముని పావన నామమైన ఓంకారోచ్చారణ జరుగుతుంది. ఓంకారమును స్మరిస్తూ దానికి సమర్పణ చేసుకున్నప్పుడే సాధనా ప్రక్రియ యొక్క సూక్ష్మతలం లోకి మరింతగా ముందుకు సాగగలరు. ఏ సాధకులలో అయితే భగవంతుని నామస్మరణ మరియు సమర్పణ ఎంత ప్రగాఢంగా ఉంటుందో, వారి సాధన కూడా అంతే తీవ్రంగా మరియు సంపూర్ణంగా సాగుతుంది. ఇందువలన గాయత్రీ సాధన చేస్తున్న ప్రతి ఒక్క సాధకుడు ఈ స్మరణను, సమర్పణను తన సాధన యొక్క ఆధారంగా

మలచుకొనవలెను. దీని రెండవ తత్త్వరూపం ఈ సాధనకు ద్రష్టయైన బ్రహ్మాఋషి యొక్క స్మరణయే! ఈ బ్రహ్మ ఋషి సాధకుని ఆధ్యాత్మిక మనస్సు. గాయత్రీమంత్ర దీర్ఘకాల జప సాధనానంతరము ఈ ఆధ్యాత్మికమనస్సు ప్రకటితమౌతుంది. ఈ మనస్సే ఆధ్యాత్మిక తత్త్వములు, సత్యముల అనుభూతి స్థానము. మనస్సు లేనప్పుడు సాధనా ప్రక్రియ స్తంభించిపోతుంది. ఆధ్యాత్మిక మనస్సు లేక బ్రహ్మ ఎంత అధిక తపస్సు గావిస్తే ఆదిశక్తి జగన్మాత అంత కృపను చూపుతుంది. దీనిద్వారా చేయబడిన తపస్సు, దీనిద్వారా చేయబడిన ప్రార్థనతోనే జగన్మాత గాయత్రి జడత్వము మరియు అంధకారమును హరింప జేయుటకు మహాకాళీరూపు దాలుస్తుంది.

దీనితర్వాత వినియోగమంత్రములో సాధనావిధి అధిష్ఠాన దేవత మహాకాళీదేవీ ప్రార్థన వస్తుంది. జగన్మాత గాయత్రి త్రిగుణమయి, గుణాతీతురాలు అన్న విషయమును సాధకుడు దృష్టిలో ఉంచుకొనవలెను. ఆమె ప్రకృతిలోని త్రిగుణములను తనలో ఇముడ్చుకొని ఉంది. అయినప్పటికి ఆమె వాటికి అతీతురాలు. సాధన ప్రారంభములో సాధకుని ఆధ్యాత్మికమనస్సు అనగా బ్రహ్మ యొక్క ప్రార్థనను ఆలకించి, తపస్సును స్వీకరించి ఆమె మహాకాళి రూపుదాల్చి సాధకుని అస్తిత్వంలో ప్రకటితమౌతుంది. అప్పుడామె సాధకుడిని అనుగ్రహించి అతని మనస్సులోని జడత్వమును అంతమొందించి, అంధకారమును హరించి వేస్తుంది. అసురసంహారిణి అయిన మాత కృప లేకుండా ఎప్పుడూ కూడా కుండలినీమహాశక్తి ఊర్ధ్వగమనము చెయ్యలేదు. వినియోగ చతుర్థతత్త్వరూపంలో స్వయంగా గాయత్రీ ఛందస్సు యొక్క మననం వస్తుంది. ఈ స్వరమును గానం చేయుటవల్ల అస్తిత్వము ఆధ్యాత్మిక తరంగముల శక్తితో నిండిపోతుంది. గాయత్రీ ఛందస్సులో చెయ్యబడిన స్వరభరిత ఉచ్చారణ అంతశ్చేతనలో రూపాంతరణ తరంగాలను ఉత్పన్నం చేస్తుంది.

ఈ వినియోగమంత్రంలో ఐదవతత్త్వరూపంలో నందాశక్తి మననం ఉంటుంది. దీన్నిగూర్చి మూర్తిరహస్యంలో చెప్పటం జరిగింది.

**ఓం నన్దా భగవతీ నామ యా భవిష్యతి నన్దజా ।**
**స్తుతా సా పూజితా భక్త్యా వశీకుర్యాజ్జగత్రయమ్ ॥**

నందుని నుండి ఉత్పన్నమయ్యే నందాదేవిని భక్తిపూర్వకంగా స్మరించినట్లయితే ఆమె త్రిలోకాలను సాధకుడి అధీనం చేస్తుంది. అనగా ఈ నందాదేవి సాధకుని

భక్తిపూర్వకమైన పురుషార్థము యొక్క చక్కని ఫలస్వరూపము. ఈ భక్తిపూర్ణ ప్రయత్నమే నందాగోపుడు. అతని కుమార్తెయే ఈ నందాదేవి. నందాదేవి ఈ సాధన యొక్క శక్తి. మరోవిధంగా చెప్పాలంటే గాయత్రీ సాధకుని భక్తియే ఈ సాధన యొక్క శక్తి. ఆరవతత్త్వరూపంలో ఈ సాధన యొక్క బీజమంత్రము రక్తదంతికగా చెప్పబడినది. దీనిని గూర్చి ఋషి ఈవిధంగా వివరించారు.

**యా రక్తదన్తికా నామ దేవీ ప్రోక్తా మయానఘ ।**
**తస్యాః స్వరూపం వక్ష్యామి శృణు సర్వభయాపహమ్ ॥**

రక్తదన్తిక అను పేరు గల దేవీస్వరూపము సమస్త భయములను హరించివేస్తుంది. సాధకుడు తిమిర (అంధకారము) నాశనం కొరకు భగవతిని ఆహ్వానిస్తే ఆ కాలంలో అతని భావనలలో అనేక భయములు పొడసూపుతాయి. ఆ సమయంలో మంత్రబీజంలో ఇమిడి ఉన్న శక్తి రక్తదన్తిక రూపుదాల్చి సాధకుని సమస్త భయములను నశింపజేస్తుంది.

దీని తరువాత వినియోగమంత్రం యొక్క సప్తమతత్త్వము అగ్ని వస్తుంది. మనీషులందరకు ఈ సత్యము తేటతెల్లమే. ఈ సృష్టి త్రిగుణములతో, పంచ భూతములతో నిర్మించబడినది. గాయత్రీ సాధన ప్రథమచరణంలో వీనిలోనుండి తమోగుణము మరియు అగ్నితత్త్వము ప్రత్యక్షమౌతుంది. తమస్సును ఎదురొడ్డుతూ, దానిని నిర్మూలన గావించుటకై అగ్నితత్త్వము సాధకుని సాధనలో ప్రకటితమౌతుంది. దీనిని సాక్షాత్కరింప జేసుకొనకుండా సాధనలో పురోగతి ఉండదు. అంతేకాక ఇది ప్రకటితమవకుండా సాధకుని వికలత అంతమవ్వదు. ఈ స్థితి ప్రతి ఒక్క సాధకునకు దుస్సాధ్యమైనది. అయితే దీన్ని సహించుట చేత ప్రకటితమైన అగ్నితత్త్వము సమస్త విఘ్నములను దహించి వేస్తుంది. వినియోగమంత్రం యొక్క అష్టమతత్త్వము ఋగ్వేదము. ఋగ్వేదము యొక్క అర్థము, రహస్యము బహు ఆయామములు గలది. ఇది జ్ఞానం ప్రకటితమయ్యే ప్రథమదశ. ఇందులో సాధకునికి జీవనం, ప్రపంచము మరియు పరమేశ్వరుని స్వరూప జ్ఞానం ప్రాప్తిస్తుంది. అతను ప్రకృతి మరియు పరమేశ్వరుని స్వరూపమును అవగతం చేసుకునే యోగ్యతను పొందుతాడు. దీని తరువాత నవమతత్త్వరూపంలో ఇలా చెప్పబడినది. ఈ ప్రథమ చరణము లేక ప్రథమచరిత్రయొక్క సాధనా ఉద్దేశ్యము కేవలము భగవతి గాయత్రి యొక్క ప్రథమ

శక్తియైన మహాకాళీ కృపను పొందుట. మాత కృపతో తమస్సు నశిస్తుంది. చెడు సంస్కారములు దహించబడతాయి. ఎందుకంటే అలా జరుగకుంటే ప్రకాశము అవతరించుట సంభవం కాదు. దీర్ఘకాలీన పురుషార్థము తర్వాతనే సాధకుడు ఈ ఉద్దేశ్యమును సిద్ధింప జేసుకొనగలడు. అతి కష్టము మీదనే సాధకునికి గాయత్రీమహాశక్తి యొక్క ప్రథమస్వరూప జ్ఞానం బోధపడుతుంది.

# 21. జగన్మాత ధ్యానరూపంలోని ప్రత్యేకతలు

ఆదిశక్తి యొక్క లీలాకథకు సంబంధించిన ప్రథమ చరిత్రలో వినియోగం చేసిన తరువాత జగన్మాత దివ్యస్వరూపాన్ని ధ్యానించే క్రమం వస్తుంది. ఆధ్యాత్మిక విద్యకు సంబంధించిన సాధకులు, సిద్ధులు, మర్మజ్ఞులు మొదలైనవారందరూ ధ్యానం యొక్క మహిమ, ప్రాముఖ్యతలతో సుపరిచితులే. 'ఆధ్యాత్మికతలో అసలైన సాధన ధ్యానమే' అన్న సత్యం అనుభవజ్ఞులైన సాధకులకు బాగా తెలుసు. ధ్యానమే కాకుండా ఇంకా ఇతర క్రియలు, సాధనా విధానాలు ఏవైనా చేయబడినా, అవన్నీ ఏదో ఒకవిధంగా సాధకుని అంతరంగాన్ని ధ్యాన యోగ్యం గావించటానికి మాత్రమే సహాయ పడతాయి. ఆసనసిద్ధి, ప్రాణాయామము, జపము మొదలైన పనుల యొక్క ప్రాముఖ్యత ఇదే. ఈ పనులన్ని చేయటం వల్ల ఆధ్యాత్మిక సాధకుని యొక్క చేతనత్వము ధ్యానం చెయ్యటానికి యోగ్యంగా తయారౌతుంది. అతడు ధ్యానం చెయ్యటానికి అర్హతను పొందుతాడు. ధ్యానానికి అర్హుడైన తర్వాత ధ్యాన ప్రక్రియ సాధకునిలో అనేక ఆధ్యాత్మిక పరిణామాలను తీసుకొస్తుంది. అతడిలో సదా ఒక క్రొత్త చేతనత్వము ఉత్పన్నమౌతుంది. అతడు చిత్తశుద్ధిని పొంది తత్త్వజ్ఞానము–ఆత్మజ్ఞానములకు అధికారి అవుతాడు.

యోగము, తంత్రము యొక్క విధివిధానాలు, ధ్యాన ప్రక్రియకు సంబంధించి అనేక ధారణలు సూచించబడినవి. ప్రకృతిలోని స్థూలతత్త్వముల ధారణ, సూక్ష్మతత్త్వముల ధారణ, సాకార ధారణ, నిరాకార ధారణ మొదలైన వివిధ ధారణముల గురించిన వర్ణన, వివరణ యోగము మరియు తంత్ర శాస్త్రములలో మనకు లభిస్తాయి. కేవలము ధారణా విధానాలను గురించి మాత్రమే వ్రాయబడ్డ శాస్త్రములు, గ్రంథాలు అనేకం ఉన్నాయి. తంత్రశాస్త్రములో యోగముకన్నా, ఈ

ధారణ అనే రహస్యంపై ఎంతో లోతుగా, విస్తృతంగా చర్చించబడింది. తంత్ర శాస్త్రములో ఏ దేవీ-దేవత గురించైనా అనేకరకాల ధ్యాన ప్రయోగములు లభించటానికి ఇదే కారణము. వీనిలో ప్రతి ఒక్క దానికి తనదైన ఉనికి, ఔచిత్యము, విశిష్టమైన విలువ ఉన్నాయి. ప్రతి ఒక్క ధ్యాన విధానానికి తనదైన ప్రత్యేక ప్రయోజనము ఉంటుంది. ఆ ప్రయోజనము మరి ఏ ఇతర ధ్యానవిధుల ద్వారా నెరవేరబడదు.

ఈక్రమంలో యోగం, తంత్రశాస్త్రములలో ఉపదేశించబడిన ధారణలు ఏవైతే ఉన్నాయో వాటికి ముఖ్యమైన ప్రయోజనాలు రెండు ఉన్నాయి. అవి 1. చిత్తములోని సంస్కారములను, కర్మ బీజములను నశింపజెయ్యటం, హృదయాన్ని శుద్ధిచెయ్యటం. 2. తన ఆరాధ్యదేవత యొక్క ఏదో ఒక ప్రత్యేకమైన శక్తిని ఆహ్వానించటం, దానిని చక్కగా అర్థం చేసుకొని హృదయంగమం చేసుకొనగలగటం. ఈ రెండు ప్రయోజనాలను సిద్ధింప జేసుకొనటానికే ఆధ్యాత్మిక మర్మజ్ఞులు, దేవీ-దేవతల యొక్క కొన్ని భావరూపములను ఏర్పరిచినారు. ఈ రూపముల ఎడ ప్రగాఢమైన ఏకాగ్రత, ఆ రూపములతో తాదాత్మ్యం చెందటం ద్వారా అద్భుతమైన ఫలితాలను పొందవచ్చు. ఈ ధ్యానమూర్తులు రాతి విగ్రహములు లేదా లోహరూపములు గాక, కేవలం ఊహ, కల్పన, ఆలోచన, భావముల యొక్క సమ్మిశ్రణం ద్వారా ఏర్పరచుకున్నది.

ఆదిశక్తి జగన్మాతయైన గాయత్రీదేవి యొక్క ఇటువంటి విశిష్టమైన ధ్యానరూపము, ప్రథమచరిత్ర ప్రారంభంలో ఉపదేశించ బడినది. ఈ ధ్యానమూర్తికి తనదైన విశిష్ట ప్రయోజనము ఉన్నది. దీనిద్వారా సాధకుడు తన చిత్తములోను, చేతనత్వములోను ఉన్న జడత్వమును నశింపజేసుకొనగలడు. ఈ ధ్యాన ప్రయోగము వలన సాధకుని అస్థిత్వములోని అంధకారము నశిస్తుంది. అతడి అంతరంగంలో జగదంబ నీలమణి కాంతివలె అవతరిస్తుంది. ఈ ధ్యానమును నిరంతరము చెయ్యటం ద్వారా మూలాధారంలో నిద్రాణమై ఉన్న శక్తి జాగృతమౌతుంది. జడత్వాన్ని నశింపజేస్తూ చేతనత్వాన్ని ఊర్ధ్వగమనం కావిస్తుంది. ఆదిశక్తి యొక్క లీలాగాథలను వినిపిస్తున్న ఋషి సృష్టిలో ఈ ధ్యానమునకు ప్రథమ సోపానాన్ని బ్రహ్మ తయారు చేశాడని వచిస్తున్నాడు. దీని ప్రభావం చేతనే జగదంబ విష్ణువును జాగృతమొనర్చి మధుకైటభులను అంతమొందించటానికి ప్రేరేపించినది.

ఆదిశక్తి లీలాగాథ యొక్క ప్రారంభంలో ధ్యానవిధానము, క్రింద లిఖించబడిన మంత్రాక్షరములలో వివరించబడినది.

**ఓం ఖడ్గం చక్రగదేషుచాపపరిఘూఇఘ్ఛాలం భుశుణ్డీం శిరః।**
**శంఖం సందధతీం కరైస్త్రినయనాం సర్వాంగభూషావృతామ్ ।**
**నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాం సేవే మహాకాళికామ్ ।**
**యామస్తౌస్త్వపితే హరౌ కమలజో హన్తుం మధుం కైటభమ్ ॥**

అర్థము: విష్ణుభగవానుడు నిద్రించగా మధుకైటభులను సంహరించుటకై కమలంలో ఆసీనుడయిన బ్రహ్మదేవుడు ఎవరినైతే స్తుతించాడో, ఆ భగవతి మహాకాళికను నేను సేవిస్తున్నాను. ఆమె తన పదిచేతులలో ఖడ్గము, చక్రము, గద, బాణము, ధనుస్సు, పరిఘము, శూలము, భుశుండి, శిరము మరియు శంఖము ధరించి ఉన్నది. ఆమెకు మూడు నేత్రములు కలవు. ఆమె సమస్త అంగముల యందు దివ్యాభరణములను ధరించి ఉన్నది. పది ముఖములు, పది కాళ్ళు కలిగి ఉన్న ఆమె శరీరము యొక్క కాంతి నీలమణి సదృశముగా ఉన్నది.

ఆదిశక్తి జగన్మాత యొక్క ధ్యానమును గురించిన ఈ ధారణ, తద్వారా లభించే ప్రయోజనము వలెనే విశిష్టమైనది. దీని ప్రభావము విశిష్టమైనది, అలాగే ఈ ప్రతీకల యొక్క అర్థము కూడా ప్రత్యేకమైనది. బ్రహ్మదేవుడు స్థాపించిన జగన్మాత యొక్క భావరూపములో ఆమె శరీరకాంతి నీలమణితో సమానమైనదిగా వర్ణించబడినది. నీలమణి పూర్తిగా నీలంగా ఉండదు కాని నీలమణి యొక్క కాంతి ఆకాశంవలె ఉంటుంది. భగవతిని ఈ రంగులో చూడటమంటే ఆమె యొక్క సర్వవ్యాపకమైన స్వరూపాన్ని అర్థము చేసుకొనటమే. ఆమె ఆకాశం వలెనే లోపల, వెలువల సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఆమెకు పది ముఖములు, పది చేతులు, పది కాళ్లు కలవు. 'పది సంఖ్య పది దిక్కులను సూచిస్తుంది' అని ఈ వివరణకు అర్థము. చిహ్నరూపంలో అర్థం చెప్పుకోవాలంటే 'భగవతి ఈ రూపంలో సాధకుని సంపూర్ణ అస్తిత్వంలో అన్నివైపుల నుండి వ్యాపించి క్రియాశీలమై ఉంటుంది' అని భావించాలి. ఆమె పది ముఖముల నుండి వెలువడే శబ్దోచ్చారణతో దశదిశలు నిండుతున్నాయి.

జగదంబ యొక్క ఈ భావరూపంలో వర్ణించబడిన ఆయుధములన్నింటికి కూడా వాటి యొక్క చిహ్నపరమైన అర్థములు ఉన్నాయి. ఆమె మొదటి ఆయుధము ఖడ్గము అనగా కత్తి. ఈ కత్తి యొక్క దయ వలన సాధకుని అజ్ఞానం ఖండించ బడుతుంది. మాత యొక్క రెండవ ఆయుధమైన చక్రము చేత సాధకుని అహంకారము

ఛేదించబడుతుంది. మూడవ ఆయుధమైన గద భయాన్ని తుత్తునియలు గావిస్తుంది. గద యొక్క దెబ్బతో మాత తన సంతానము యొక్క సమస్త భయములను నశింపజేస్తుంది. ధనుర్బాణాలు రెండూ కలిసి లక్ష్యాన్ని ఛేదించ గలవు. యోగశాస్త్రములో జిహ్వను ధనస్సుగాను, ఓంకారమును బాణంగాను సూచించటం జరిగింది. వాని సహాయంతో సాధకుడు లక్ష్యాన్ని ఛేదించగలడు. జగన్మాత చేతులలో శోభిస్తున్న పరిఘ మోహాన్ని నశింపజేస్తుంది. ఆమె తన చేతులలో ధరించి ఉన్న శూలముతో తపస్సు యొక్క ఫలితమును అందిస్తుంది. మాత చేతిలో ఉన్న శిరస్సు అనేది సాధకుని ఆలోచనలు నియంత్రణలో ఉండవలెనని సూచిస్తుంది. మస్తిష్కాన్ని నియంత్రించుకొనలేనిదే ఎవరికైనా, ఎప్పుడైనా సిద్ధి లభించదు. భగవతి చేతిలో ఉన్న శంఖము సాధనను ప్రారంభించటానికి ముందు చేసే మహాఘోషకు సంకేతము.

జగన్మాత యొక్క మూడు కన్నులు క్రమంగా సూర్యుడు, చంద్రుడు, అగ్నికి ప్రతీకలు. ఆమె వివిధ అంగముల యందు ధరించి ఉన్న ఆభరణములు, ఈ ధ్యానం యొక్క ప్రయోగం వలన సాధకునకు లభించబోయే పలు రకాలైన ఆధ్యాత్మిక సంపదలకు సంకేతము. ఈవిధంగా చిహ్నాలు–అర్థాలతోపాటు ఈ ధ్యాన విధానము కూడా విలక్షణమైనది, ప్రత్యేకమైనది. జగన్మాత యొక్క ఈ రూపాన్ని ధారణ చేసి ఈ క్రమాన్ని తీవ్రతరం చేసి ధ్యానంలోకి మార్చుకోగలిగిన సాధకుని అంతరంగపు అస్తిత్వంలో ఆదిశక్తి జగన్మాత యొక్క ప్రథమశక్తి మహాకాళి రూపు ధరించి అతని చెడుసంస్కారాలను, జడత్వాన్ని నశింపజెయ్యటం ప్రారంభిస్తుంది. జగన్మాత యొక్క రూపాన్ని ఈవిధంగా ధారణ చేసిన పిదప ప్రారంభమయ్యే ధ్యాన ప్రక్రియ యొక్క ప్రభావము ప్రథమచరిత్రలో చెప్పబడి ఉన్నది. గాయత్రీమంత్రం యొక్క ప్రథమచరణం 'తత్సవితుర్వరేణ్యం' కు సంబంధించిన ఈ తత్త్వగాథయే ప్రథమచరిత్ర యొక్క ప్రథమాధ్యాయంలో 104 మంత్రాలలో వర్ణించబడినది. చండిక కు నమస్కరించ డంతో దీని ప్రారంభం జరుగుతుంది. ఈ నమస్కారం తర్వాత ప్రథమ చరిత్ర యొక్క మొదటి మంత్రం మొదలౌతుంది. కథాసూత్రము ఆరంభమౌతూనే తన విశిష్ట మాంత్రిక మాహాత్మ్యమును ప్రకటీకృతం కావిస్తుంది.

# 22. ఓంకార స్వరూపిణి చండికా దేవియే గాయత్రీ మంత్ర అధిష్ఠాత్రి

ఆదిశక్తి లీలాకథ యొక్క మంత్రోచ్చారణకు ముందే భగవతి జగన్మాత ధ్యానము వస్తుంది. దాని తత్త్వపరమైన వివేచన అయిన ఈ పావనమైన కథ గత సంచికలో చెప్పబడినది. శక్తి సంచారము మరియు పాపనాశనం గావించే దిశలో ఈ ధ్యానమునకు విశేష మహత్వమున్నది. ఈ తథ్యము సంవత్సరాల ప్రయత్నం వలన అంతర్జగత్తులో ప్రకటితమౌతుంది. సాధకులైన వారు ఈ ధ్యానమును నియమంగా అభ్యసిస్తే ఈ పంక్తులలో వివరించిన విషయాల గొప్పతనమును స్వయంగానే అనుభూతి చెందగలరు. ఈ ధ్యానములో శక్తిసాధకులు స్వయంగానే శక్తిపాత అనుభూతిని పొందగలరు. దాని ప్రభావము వలన వారి సాధనామార్గము నిరాటంకముగా సాగుతుంది. ఆ మార్గములో వచ్చే అడ్డంకులన్నీ తమకై తామే ప్రక్కకుపోతాయి. ఆదిశక్తి జగన్మాత గాయత్రి ప్రథమశక్తియైన భగవతి మహాకాళి యొక్క ఈ విశిష్ట ధ్యానము సాధకుని మరియు సృష్టి యొక్క సమస్త తమస్సును, జడత్వమును, అజ్ఞానమును మరియు మోహమును నశింపజేయుటలో సర్వసమర్థ వంతమైనది. ఈ ధ్యాన మూలము నుండే ప్రథమచరిత్ర యొక్క మంత్రమాల ఆవిర్భవించినది అని నిరంతర ధ్యాన అనుభూతి తేటతెల్లము చేస్తుంది.

అయితే ఈ ప్రథమచరిత్ర యొక్క మంత్రమాలకు చెందిన మంత్రోచ్చారణకు మున్ముందుగా భగవతి ఆదిశక్తి యొక్క అతి విశేష పుణ్య నామస్మరణము చేస్తూ, ఆమెకు వందనమర్పించే విధివిధానమున్నది. జగన్మాత మహామాయ యొక్క పుణ్యప్రదమైన లీలాకథ పారాయణను ప్రవచించే ముందు మార్కండేయమహర్షి దానిని వందనశ్లోకముతో ఆరంభిస్తారు.

**ఓంనమచణ్డికాయై ॥**

ఓంకారస్వరూపిణి చండికాదేవికి నమస్సులు. ఇది ఏ ఆదిశక్తి యొక్క లీలాకథయో ఆమెకు వందనము. ఆమెయే గాయత్రీమంత్ర అధిష్ఠాత్రి. సమస్త వేద మంత్రముల సారభూతతత్త్వమునకు అభివాదము. ఆమెకు అనంతమైన అసంఖ్యాకమైన నామములున్నాయి. అయితే అధ్యాత్మిక విద్యా జిజ్ఞాసువులకు,

ఉపాసకులకు మరియు సాధకులకు ఈ చండికానామము కొంత విశేష మాహాత్మ్యము ననే కలిగి ఉన్నది. ఈ నామధేయములో కేవలము జగన్మాత యొక్క విరాట్ మహిమ అందంగా అలరింపబడి ఉండటమే కాదు, ఆమె సాధన చేసినవారి సంపూర్ణ చరిత్ర ఇమిడి ఉన్నది. రహస్యదర్శులైనవారు మాత్రమే ఈ సత్యమును, మర్మమును అనుభూతి చెందగలరు. ఇతరులు కేవలము భ్రమలో పడి కొట్టుమిట్టాడుతుంటారు.

ఆదిశక్తి జగన్మాత గాయత్రి యొక్క ఈ నామమునకు చెందిన మహత్త్వము, మహిమ గాయత్రీ సహస్ర నామములో కూడా కనిపిస్తుంది. గాయత్రీమాత నైష్ఠిక సాధకులు తమ సాధనా క్రమములో పూజ, కవచము, న్యాసము మరియు ధ్యానములతో పాటు గాయత్రీ సహస్ర నామ స్తోత్ర పారాయణను అవశ్యం చేస్తారు. గాయత్రీ మహావిజ్ఞాన్ రెండవ భాగములో ఈ సహస్ర నామ స్తోత్ర వర్ణన ఉన్నది. ఈ సహస్రనామ స్తోత్రములో జగన్మాత యొక్క ఇతర నామములు కేవలము ఒక్కమారే ఉద్ఘాటించబడితే, ఈ **చండిక** అనే నామోచ్చారణ రెండుసార్లు చేయబడినది. ప్రప్రథమముగా ఇలా చెప్పబడినది.

**చటులా చణ్డికాచిత్రాచిత్రమాల్యవిభూషితా ॥ 44**

రెండవమారు

**చంద్రికా చంద్రధాత్రీ చ చౌరీ చౌరా చ చణ్డికా ॥ 46**

గాయత్రీ సహస్రనామ మహిమను చెప్తూ స్వయముగా పరమపూజ్య గురుదేవులు ఇలా అన్నారు. 'గాయత్రీ సహస్ర నామములో ప్రతి నామము చాలా రహస్యమమయ మైనదే. సామాన్య దృష్టితో చూసినప్పుడు ఈ నామాలు సాధారణమైనవని తోస్తుంది. అయితే సూక్ష్మదృష్టితో వివేచన చేసినప్పుడు ప్రతినామములోను గొప్ప గొప్ప రహస్యములు ఇమిడి ఉన్నాయని తెలుస్తుంది. ఈ నామములు గాయత్రీమాత గుణములు, ఇతిహాసము, విజ్ఞానముల రహస్య ఉద్ఘాటన చెయ్యటమేకాక అనేక రకాలైన దక్షిణమార్గ, వామమార్గ సాధనావిద్యలను కూడా అందిస్తాయి. హస్తముద్రలు, సంకేతాలు సూక్ష్మము మరియు బీజరూపములో ఈ సహస్రనామాల అంతర్గతముగా గాయత్రీవిద్య యొక్క అనంత భాండారము నిండి ఉన్నది (గాయత్రీ మహావిజ్ఞాన్, ద్వితీయ భాగం పేజీ నం. 217). యుగ ఋషి మంత్ర పూరితమైన శబ్దాలుకూడా భగవతి చండికనామధేయపు విశిష్ట మహిమను దర్శింపజేస్తాయి. గాయత్రీ సహస్ర

నామములో చండికా నామము రెండుసార్లు ప్రయోగింపబడుట వెనుక గల కారణం ఏమిటంటే జగన్మాత చండికా నామధేయములో దక్షిణమార్గ మరియు వామ మార్గములనే రెండు రకాలైన సాధనా రహస్యములు ఇమిడి ఉన్నాయి. తత్త్వదర్శులైన యోగులు ఈ సత్యమును తమ సాధనా మార్గమున అనుభూతి చెందుతారు.

శ్రీదుర్గాసప్తశతి కథాక్రమములో కూడా ఆదిశక్తి చండికా నామము పలుచోట్ల ప్రయోగించబడినది. వీనిలో ప్రత్యేక ప్రయోగ క్రమంలో ఆమె వివిధ స్వరూపక్రమము, మహిమ గానం చెయ్యబడినది.

**యస్యాః ప్రభావమతులం భగవాననన్తో ।**
**బ్రహ్మా హరశ్చ న హి వక్తుమలం బలం చ ॥**
**సా చణ్డికాఖిలజగత్పరిపాలనా ।**
**నాశాయ చాశుభభయస్య మతిం కరోతు ॥ 4/4** **(దుర్గాసప్తశతి)**

ఎవరి అనుపమ ప్రభావము, బలములను వర్ణించుటలో భగవంతుడు శేషశాయి, మహాదేవుడు మరియు బ్రహ్మదేవుడు కూడా అసమర్థులో, అట్టి భగవతి చండికను సంపూర్ణజగత్పాలన మరియు అశుభనాశనము గావించమని ప్రార్థించాలి ఈ క్రమములో 13వ అధ్యాయములో ఇలా వర్ణించబడి ఉన్నది.

**'పరితుష్టా జగద్ధాత్రీ పత్యక్షం ప్రాహ చణ్డికా ॥ 13**

జగత్తును ధారణ చేసే చండికాదేవి ఈ స్తోత్రమును ఆలకించి ప్రసన్నురాలై ప్రత్యక్షదర్శనమిచ్చింది. ఈ మంత్రములో చండికాదేవి సమస్త జగత్తును ధారణ చేసే శక్తిగా పేర్కొనబడినది. ఈ క్రమములోనే 8వ అధ్యాయములో ఆమె యొక్క ఆదిశక్తి స్వరూపదర్శనమున్నది.

**ఏతస్మిన్నన్తరే భూప వినాశాయ సురద్విషామ్ ।**
**భవాయామరసింహానామతివీర్యబలాన్వితాః ॥ 12**
**బ్రహ్మేశగుహవిష్ణూనాం తథేన్ద్రస్య చ శక్తయః ।**
**శరీరేభ్యో వినిష్క్రమ్య తద్రూపైశ్చణ్డికాం యయుః ॥ 13**

'హే రాజా! దేవాసుర సంగ్రామములో అసురసంహారము మరియు దేవతల అభ్యుదయము కొరకు బ్రహ్మ, విష్ణు, కార్తికేయ మరియు శివ మరియు ఇంద్రాది

దేవతల అత్యంత పరాక్రమము మరియు బలముతో నిండిన శక్తులు ఆయా దేవతల శరీరముల నుండి బయటపడి ఆయా రూపములలోనే చండికాదేవిలోకి ప్రవేశించినాయి.' అనగా భగవతి చండికాదేవియే ఈ సమస్త శక్తులకు మూలస్రోతము (source). ఆమె యొక్క ఈ శక్తి అంశతోనే వివిధ దేవతాశక్తులు ప్రాదుర్భవించాయి. ఆ శక్తియే వాటిలో నిండి ఉన్నది. పైన చెప్పబడిన వివరణయేకాక శ్రీదుర్గా సప్తశతిలో భగవతి చండికా నామము పలుచోట్ల ప్రయోగించ బడినది.

దృష్ట్వా సా **చణ్డికా** కోపం తద్వధాయ తదాకరోత్ ॥ 3/28

తతః క్రుద్ధా జగన్మాతా **చణ్డికా** పానముత్తమమ్ ॥ 3/34

విషాణాభ్యాం చ చిక్షేప **చణ్డికాం** ప్రతి భూధరాన్ ॥ 3/35

ప్రాచ్యాం రక్ష ప్రతీచ్యాం చ **చణ్డికే** రక్షదక్షిణే ॥ 4/25

ఉవాచ కాళీం కళ్యాణీ లలితం **చణ్డికా** వచః ॥ 7/26

హన్యన్తామసురాః శీఘ్రం మమ ప్రీత్యాహ **చణ్డికామ్** ॥ 8/22

**చణ్డికా**శక్తిరత్యుగ్రా శివాశతనినాదినీ ॥ 8/23

తాన్విషణ్ణాన్ సురాన్ దృష్ట్వా **చణ్డికా** ప్రాహసత్వరా ॥ 8/53

తతో సావాజఘానాథ గదయా తత్ర **చణ్డికామ్** ॥ 8/57

నిహన్తుం **చణ్డికాం** కోపాత్కృత్వా యుద్ధం తు మాతృభిః ॥ 9/8

చిచ్ఛేదాస్త్రాఞ్ఛరాంస్తాభ్యాం **చణ్డికా** స్వశరోత్కరైః ॥ 9/10

ఆవిద్ధ్యాథ గదాం సోపి చిక్షేప **చణ్డికాం** ప్రతి ॥ 9/15

తతః సా **చణ్డికా** క్రుద్ధా శూలేనాభిజఘాన తమ్ ॥ 9/28

చక్రాయుధేన దితిజశ్ఛాదయామాస **చణ్డికామ్** ॥ 9/30

తతో నిశుమ్భో వేగేన గదామాదాయ **చణ్డికామ్** ॥ 9/32

తస్యాపతత ఏవాశు గదాం చిచ్ఛేద **చణ్డికా** ॥ 9/33

హృది వివ్యాధ శూలేన వేగావిద్ధేన **చణ్డికా** ॥ 9/34

తస్యాపతత ఏవాశు ఖడ్గం చిచ్ఛేద **చణ్డికా** ॥ 10/17

తత్రాపి సా నిరాధారా యుయుధే తేన **చణ్డికా** ॥ 10/22

నియుద్ధం ఖే తదా దైత్య**శ్చండికా** చ పరస్పరమ్ ॥ 10/23

అభ్యధావత దుష్టాత్మా **చణ్డికా**నిధనేచ్ఛయా ॥ 10/25

శుభాయ ఖడ్గో భవతు **చణ్డికే** త్వాం నతా వయమ్ ॥ 11/28

పైన ఇవ్వబడిన వివరణతో జగన్మాత చండికా నామధేయ మహత్త్వము స్పష్టమౌతుంది. ఈ మంత్రముల అర్థము శ్రీదుర్గాసప్తశతీ పారాయణ పుస్తకములో చూడవచ్చును. సాధనా సంబంధ దృష్టితోను, ముఖ్యంగా నవరాత్రి పర్వ సందర్భం గాను చూచినప్పుడు సంపూర్ణ పారాయణలో 25 సార్లు ప్రయోగించ బడిన జగన్మాత నామము యొక్క విశేష మహిమ అతి మహత్వ పూర్ణమైనది. ఈ నామములో భగవతి మరియు ఆమె భక్తుల యొక్క సమ్మిళిత స్వరూపము మరియు చరిత్ర పొందుపరచబడి ఉన్నది. రాబోయే భాగములో అది స్పష్టముగా వివరించబడుతుంది.

# 23. సాధన తీవ్రం, వేగవంతం కావాలి

ఆదిశక్తి లీలాకథ పారాయణ, శ్రవణములకు ముందు భగవతీ దేవిని చండికగా భావించి నమస్కరించాలి. ఓం నమశ్చణ్డికాయై ఈ నమస్కార మంత్రము స్వయముగా తనలో అనేక సాధనా సంకేతాలను ఇముడ్చుకొని ఉంది. గత కథా భాగంలో జగన్మాత యొక్క ఈ పావన నామ మహిమను గానం చెయ్యటము జరిగింది. శ్రీదుర్గాసప్తశతి యొక్క వివిధ ప్రసంగాలలో ఈ నామము ఏ విధంగా, ఎన్నిమార్లు వచ్చిందనే అంశము చెప్పబడినది. కొన్ని చోట్ల చండికా నామము భక్తరక్షణ సందర్భములోను, మరికొన్ని చోట్ల అసుర సంహార రూపములోను ప్రయోగించబడినది. ఇందులో దక్షిణమార్గ, వామమార్గములనే రెండు రకాల సాధనలు ఇమిడి ఉన్నాయి. ఈ సాధనా రహస్యములు అత్యంత లోతైనవి మరియు రహస్యమయమైనవి అగుటచేత వీటి పరిపూర్ణ విధి విధానములు ఇక్కడ వివరముగా చెప్పుట సంభవము కాదు. శాస్త్రములు 'గోపనీయం గోపనీయం గోపనీయం ప్రయత్నతః' అని ప్రవచించి, ఎక్కడపడితే అక్కడ, ఎవరికిపడితే వారికి చెప్పుటను నిషేధిస్తూ మార్గనిర్దేశనము చేశాయి.

ఈ శాస్త్ర ఆజ్ఞలను శిరసావహిస్తూ జగదంబ చండికా నామములో ఏ సాధన యొక్క సామాన్య సత్యములు ఇమిడి ఉన్నాయో సాధకగణములో వాటి చర్చ, చింతనలు చేయాలనే భావనలు మనస్సులో ఎగసిపడుతున్నాయి. భగవతి అనంత నామములలో ఈ చండికా నామము విశిష్టమైనది అని ఇప్పటికే చెప్పబడినది. ఈ విశిష్టతకు ఒక కారణము కూడా ఉన్నది. చణ్డవేగేతి–ఇతి చణ్డికా అనే ప్రత్యేక గుణమును ఈ నామము తనలో ఇముడ్చుకొని ఉంది. దీని అర్థము జగజ్జనని యొక్క ఈ రూపసాధనను చేసే సాధకుల సాధన తీవ్రతరమైన వేగముతో ముందుకు సాగాలి. దీనిలో మరో సత్యము కూడా దాగి ఉన్నది. వేగవంతముగా సాధన చేసేవారిపైన భగవతి యొక్క కృప కూడా అత్యంత వేగముగా వర్షిస్తుంది. మనుష్యులందరు తమ చిత్తములో అసంఖ్యాక కర్మ సంస్కారాల, కర్మబీజాల విషమును నింపుకుని ఉంటారన్న సాధనా సత్యమును సాధకగణమంతా ఎరుగుదురు. ఒకవేళ వీటన్నింటిని తప్పక అనుభవించి తీరవలసి ఉన్నప్పుడు జీవి యొక్క జీవితము ఎన్నటికి ఏ సమయములోనూ ఉద్ధరింపబడదు.

కర్మబీజములు కూడ రక్తబీజ రాక్షసుని వలె భయావహమైనవి. అవి ఒకానొక ప్రత్యేక జన్మలో తమదైన విశిష్ట రీతిలో ఒకటి అనేకంగా మారి భయావహం మరియు ప్రళయ భీకరమైన వినాశనములను చూపించే తీరుతాయి. ఈ విషయమే సంకేత రూపములో రక్తబీజుని కథా ప్రసంగాలలో చెప్పబడినది.

**యావన్తః పతితాస్తస్య శరీరాద్రక్తబిన్దవః ।**
**తావన్తః పురుషా జాతాస్తద్వీర్యబలవిక్రమాః ॥**

**తే చాపి యుయుధుస్తత్ర పురుషా రక్తసమ్భవాః ।**
**సమం మాతృభిరత్యుగ్రశస్త్రపాతాతిభీషణమ్ ॥ శ్రీదుర్గాసప్తశతి 8/44/45)**

రక్తబీజుని శరీరము నుండి ఎన్ని రక్తబిందువులు జారి భూమిమీద పడతాయో అంతమంది రక్తబీజులు ఆవిర్భవిస్తారు. వారంతా రక్తబీజునితో సమానమైన వీరులు, బలవంతులు, పరాక్రమవంతులును. వారి రక్తం నుండి పుట్టే పురుషులు కూడా అత్యంత భయంకర అస్త్రశస్త్రములను ప్రయోగిస్తూ యుద్ధ భూమిలో మాతృగణముతో ఘోరయుద్ధమును చేయసాగారు.

సాధకుడు తన సాధనను తీవ్రతరమైన వేగముతో సాగిస్తూ భగవతి చండికను ప్రసన్నురాలిని చేసుకోనంతవరకు జీవుడు–జీవితము యొక్క ఈ కర్మబీజముల శృంఖల నశించదు. ఎందుకంటే ఆమె ఒక్కతియే వీటిని నిరోధించి, నశింపజేయుటలో సమర్థురాలు. ఈ ప్రక్రియలో మరో సత్యము కూడా దాగి ఉన్నది. ఈ సాధన ఏదో ఒక క్రియావిశేషము కాదు అన్నదే ఆ యథార్థము. ఫలానా మంత్రజపము, ఫలానా ధ్యానము లేక ఏదైనా విశేష హవనసామగ్రితో హవన మొనరించుటను సాధన అని చెప్పలేము. అయినప్పటికి ఇవన్నీ సాధనలో తప్పక ఆచరించవల్సిన బాహ్యోపచారములు. **అయితే ఆలోచనలలో వివేకవైరాగ్యములు, భావనలలో శ్రద్ధాసమర్పణల తీవ్రతయే నిజమైన సాధన అనిపించుకుంటుంది.** ఇవి లేకుండా సమస్త క్రియలు మరియు సాధన విధివిధానాలు కర్మబీజముల యొక్క కర్మ శృంఖలను పెంచుతాయి. భావసంవేదనలు లేకుండా సాధన చేస్తే కర్మయొక్క అనంతానంత పాశములు సాధకుడిని బంధిస్తూ ఉంటాయి. నిరంతరము అతనిని బాధిస్తూ ఉంటాయి.

మహర్షి పతంజలి ఈ సత్యమునే తమ యోగసూత్రములో ఈవిధంగా పొందు పరచారు.

**'తీవ్రసంవేగానాం ఆసన్నః' (1/21)**

ఎవరి సాధన తీవ్రగతితో సాగుతుందో అతనికి నిర్బీజసమాధి శీఘ్రముగా సిద్ధిస్తుంది.

ఈ సూత్రములో 'తీవ్రసంవేగానాం' అనే పదము 'చణ్డవేగేతి' అనే పదానికి సూచిక. ఇదంతా కూడా ఒక కథా ఉపదేశము వంటిది. అదేమిటంటే కుంతీదేవి యుధిష్ఠిరుడు మున్నగు పాండు పుత్రులతో ఇలా అంటుంది. 'కుమారులారా! దహించ బడాలి అనుకుంటే పొట్టువలె పొగను వెలువరిస్తూ కాకుండా ఎండిన తుమ్మచెట్టు కొమ్మల వలె ప్రచండవేగముతో జ్వలించండి.' సాధనలో ప్రచండ వేగం ఉన్నవారే చండీమాత యొక్క నిజమైన సంతానము. వారే పతంజలి మహర్షి ప్రతిపాదించిన 'తీవ్ర సంవేగానాం' అనే పద రహస్యమును తెలుసుకొనగలరు. కేవలము ఇటువంటి వారే భగవతి కృపను పొందగలరు. పతంజలి మహర్షి తమ తరువాతి సూత్రములో ఈవిధంగా చెప్పారు. 'తీవ్ర సంవేగానామ్' సాధన కేవలము క్రియవరకే పరిమితము

కాదు. దీనిలో ఆలోచనలతో ఇమిడి ఉన్న వివేక వైరాగ్యములు మరియు భావనలలో నిహితమై ఉన్న శ్రద్ధా సమర్పణల తీవ్రత కూడా పొందుపరచబడి ఉన్నది.

అందుకే పతంజలి మహర్షి తరువాతి సూత్రములో ఇలా ప్రతిపాదించారు.

**'మృదుమధ్యాధిమాత్రత్వాత్తతోఽపి విశేషః' (1-22)**

సాధన విధానము సామాన్యం మధ్యమం ఉచ్చం అను రీతిలో సాగు కారణము చేత తీవ్రసంవేగం ఉన్న సాధకులలోనే కాలభేదము ఉంటుంది.

ఏ సాధకులైతే సాధనా విధానమును సముచితరీతిలో పూర్తి కావించినప్పటికి వారి ఆలోచనలలో వివేక వైరాగ్యములు, భావనలలో భగవతిపట్ల శ్రద్ధా సమర్పణలు తీవ్రమైన వేగంతో ఎగసిపడవో వారు తమ లక్ష్యమును చేరుకొనుటకు సమయము పడుతుంది. ఎందుకంటే సాధన కేవలము ఆసన ప్రాణాయామ ధారణ ధ్యానముల అభ్యాసము మాత్రమే కాదు. వీటిని ఏ కర్మ కాండల పరిధిలోనైనా చేర్చవచ్చు, ఇమడ్చవచ్చు. ఇందుచేతనే మహర్షి ఈ రెండు సూత్రములకు ముందు మరో సూత్రమును ప్రతిపాదించారు.

**శ్రద్ధావీర్యస్మృతిసమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్ (1/20)**

సాధకుల ఈ యోగము శ్రద్ధ, వీర్యము, స్మృతి, సమాధి మరియు ప్రజ్ఞా పూర్వకంగా సిద్ధిస్తుంది.

ఈ ఐదింటిలో శ్రద్ధ స్మృతుల సంబంధము భావక్షేత్రమునకు చెందినది. సమాధి ప్రజ్ఞలు ఆలోచనా క్షేత్ర సంబంధితములు. వీర్య శబ్దములో తీవ్రపరాక్రమ భావన ఇమిడి ఉన్నది. సాధకుల అంతఃకరణలో ఉద్ధృతంగా ఎగసిపడే ఈ తీవ్రపరాక్రమమే భగవతి చండిక కృప. ఏ సాధకులలో అయితే తీవ్రమైన శ్రద్ధా సమర్పణ మరియు వివేక వైరాగ్యములు ఉంటాయో వారి అంతఃకరణ యొక్క అస్తిత్వములో భగవతి చండికాదేవి విజయ హూంకారము ప్రతిధ్వనిస్తుంది.

**ఉవాచ కాళీ చాముణ్డే విస్తీర్ణం వదనం కురు ।**
**మచ్ఛస్త్రపాత సమ్భూతాన్ రక్తబిన్దూమహాసురాన్ ।**
**రక్తబిందోః ప్రతీచ్ఛ త్వం వక్త్రేణానేన వేగినా ॥**
**భక్షయన్తీ చర రణే తదుత్పన్నాన్మహాసురాన్ ।**

**ఏవమేష క్షయం దైత్యః క్షీణరక్తో గమిష్యతి ॥ - శ్రీదుర్గాసప్తశతి 8/53/55**

ఆ సమయములో తక్షణమే చండిక కాళీమాతను ఉద్దేశించి ఇలా అన్నది. 'హే చాముండే! నీవు నీ నాలుకను అతి పెద్దగా విస్తరింపజేసినా అస్త్ర శస్త్రముల ప్రహారము తెగిన అవయవముల నుండి క్రిందికి జారిపడే రక్తబిందువులను మరియు వాటి నుండి ఉత్పన్నమయ్యే మహాదైత్యులను నీవు నీ అతి పెద్దగా విస్తరించిన నాలుకతో పీల్చివేయుము, భక్షించుము! ఈవిధంగా మహా దైత్యులను భక్షిస్తూ నీవు రణరంగములో వీరవిహారము చేయుము. ఆవిధంగా చేయుటచేత దైత్యుల సమస్త రక్తము క్షీణించుట వలన వారు స్వయముగా నశించిపోతారు.'

భగవతి యొక్క ఈ కృపయే సాధకుల సాధనా ఫలము. కేవలము **తమ ఆలోచనలలో వివేక వైరాగ్యములను మరియు భావనలలో శ్రద్ధా సమర్పణలను తీవ్రము నుండి తీవ్రతరము గావిస్తూ తమ సర్వస్వమును చండిక యొక్క శ్రీచరణముల వద్ద అర్పిస్తూ ఆమెనే నిరంతరమూ స్మరిస్తూ, నమస్కరిస్తూ ఉంటారో వారు మాత్రమే భగవతి చండిక నామ స్మరణ సత్యానుభూతిని చెందగలరు.**

# 24. గాయత్రి యొక్క విస్తృత రూపమే ఆదిశక్తి లీలాకథ

భగవతి చండికకు నమస్కరించిన పిదప ఆదిశక్తి యొక్క లీలాకథ శుభప్రదంగా ప్రారంభమౌతుంది. జగన్మాత చండికయే అన్ని కథా ప్రసంగాలకు, సంఘటనాక్రమాలకు మూలం. అవన్నీ ఆమె గర్భములోనే పోషింపబడి, ఉత్పన్నమౌతాయి. కాలానికి కూడా ఆమెయే తల్లి. కాలము యొక్క కళలు ఆమె నుండే వ్యాపించి చివరకు ఆమెలోనే లీనమౌతాయి. సృష్టియొక్క రహస్యాలన్నీ ఆమె గర్భము నుండే జన్మించి వృద్ధిచెందుతాయి. అందుచేత ఆమెకు నమస్కరించిన తరువాతనే ఆమెయొక్క లీలా గాథను చదవటం, వినటం చేయాలి. ఈ గాథ మార్కండేయ పురాణము యొక్క 13 అధ్యాయములో చెప్పబడింది. స్వయంగా మార్కండేయ మహర్షియే ఈ గాథకు ముఖ్య సూత్రధారి. ఈ ప్రసంగమును ఉల్లేఖిస్తూ చిదంబర సంహితలో ఈ క్రిందివిధముగా చెప్పబడింది.

**తదా సా చిన్మయీ శక్తిః కాళీ రూపా బభూవ హ ।**
**సైవ కాలాన్తరే లక్ష్మీస్తథైవ చ సరస్వతీ ॥**
**తాసాం కథానకం భద్రే త్రిదశాధ్యాయ రూపకమ్ ।**
**మార్కణ్డేయ పురాణోక్తం స్తవం సప్త-శతాభిధమ్ ॥**

అనగా 'అప్పుడు ఆ చిన్మయిశక్తి కాళీరూపంలో ఆవిర్భవించినది. కాలక్రమేణా ఆమెయే లక్ష్మిగా, సరస్వతిగా రూపుదాల్చింది. ఆమె కథ మార్కండేయపురాణములో 13 అధ్యాయములలో చెప్పబడింది. ఆ కథ పేరు సప్తశతి.

మార్కండేయమహర్షి వాక్కుతోనే ఈ మంత్ర కథ ప్రారంభమౌతుంది.

**ప్రథమచరిత్ర**
**ప్రథమో అధ్యాయః (మధు-కైటభుల వధ)**
**ఓం ఏం మార్కణ్డేయ ఉవాచ ॥ 1/1/1**

శబ్దార్థము: ఓం - ఓంకారము ధ్యానబీజము. ఏం - సరస్వతి బీజము యొక్క వాగ్భవ బీజం. మార్కండేయ ఉవాచ - ఋషి మార్కండేయుడు పలికెను.

భావార్థము: పరమాత్మయొక్క పవిత్రనామమైన ఓంకారమును స్మరించి సరస్వతిదేవియొక్క శబ్దరూపమైన ఏం ను ఉచ్చరించి సరస్వతిమాతకు నమస్కరించి మార్కండేయ ఋషి కథను ప్రారంభించెను.

ఈ ప్రథమచరిత్రయొక్క మొదటి అధ్యాయములోని మొట్టమొదటి మంత్రము యొక్క రహస్యార్థములోనికి ప్రవేశించే ముందు ఈ కథ పూర్వపీఠిక గురించి తెలుసుకొనటము చాలా అవసరము. దీనిని గురించి మార్కండేయపురాణములో ఈ క్రింది విధముగా వర్ణించబడినది.

**తపస్యన్తం మహాత్మానం మార్కణ్డేయం మహామునిమ్ ।**
**వ్యాస-శిష్యో మహాతేజా జైమినిః పర్యపృచ్ఛత ॥**

జైమిని ఉవాచ ॥

**మార్కణ్డేయ మహాప్రాజ్ఞ! సర్వశాస్త్ర విశారద ।**
**శ్రోతుమిచ్ఛామ్యశేషేణ దేవీ-మాహాత్మ్యముత్తమమ్ ॥**

వ్యాసమహర్షి యొక్క శిష్యుడు, మహాతేజస్వియైన జైమిని, తాపసులలో మహాత్ముడైన మార్కండేయమహర్షితో, "సర్వశాస్త్ర విదుడవు, మహాజ్ఞానివైన ఓ మార్కండేయా! ఉత్తమమైన దేవీ మహాత్మ్యమును నేను సంపూర్ణముగా వినగోరు తున్నాను" అని అడిగెను.

శ్రీమార్కండేయ పురాణములో ఆదిశక్తి యొక్క లీలాకథ యొక్క శుభప్రదమైన ప్రారంభము జరిగిన పవిత్రమైన ప్రదేశమిదే. దేవీ మహాత్మ్యము(చండీ లేదా దుర్గాసప్తశతి) యొక్క యథార్థమైన రహస్యమును తెలుసుకొనటానికి ముందు సందేహములకు సమాధానములు చాలా అవసరము. వేదవ్యాసమహర్షి శిష్యుడైన జైమిని, మార్కండేయమహర్షిని కొన్ని సందేహాలను గురించి ప్రశ్నించగా వారు ఆ సమయములో కొన్ని లోతైన ఆధ్యాత్మిక ప్రయోగములలో లీనమై ఉన్నందున అన్ని అంశములను వివరంగా చెప్పుటకు అవకాశము లేకపోయెను. అందుచేత వారు జైమిని ఋషిని, సకలశాస్త్రములయందు నిష్ణాతుడైన ద్రోణుని యొక్క నలుగురు కుమారులైన పింగాక్షుడు, వివోధుడు (విరాధుడు), సుపుత్రుడు, సుముఖుడు అనువారి వద్దకు పంపెను.

ఈ నలుగురు ఆ సమయములో తమ తండ్రి ఇచ్చిన శాప కారణముగా వింధ్య పర్వత గుహలలో పక్షిరూపధారులై నివసిస్తున్నారు. శాపవశాన పక్షిరూపమును ధరించినప్పటికి పూర్వ జన్మకు సంబంధించిన సాధన, తపస్సుల కారణంగా వారు సకలశాస్త్రజ్ఞానవిజ్ఞానములను కలిగి ఉన్నారు. జైమినిఋషి ప్రశ్నించిన అన్ని సందేహములకు వారు సమాధానం ఇచ్చారు. చివరగా జైమినిఋషి వారిని 14 మన్వంతరముల విషయమును గురించి ప్రశ్నించెను. ఈ విషయమై మార్కండేయ మహర్షి మొట్టమొదట క్రౌష్టుకి (భాగురి)కి చెప్పి ఉండిరి. 1. స్వాయంభువు, 2. స్వారోచిష, 3 ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుష, 7. వైవస్వత అనే ఏడు మన్వంతరాలను వర్ణించిన పిదప మార్కండేయ మహర్షి క్రౌష్ఠుకికి, ఎనిమిదవదైన సావర్ణిక మన్వంతరమును గురించిన విషయములను చెప్పుట ప్రారంభించిరి.

మార్కండేయమహర్షి నుండి తాము విన్న ఈ కథను పక్షిరూపధారులైన మునిపుత్రులు జైమినికి వివరించిరి. ఈ విధంగా 1. మార్కండేయ మహర్షి, 2. క్రౌష్ఠుకి, 3. పింగాక్షుడు, 4. వివోధుడు, 5. సుపుత్రుడు, 6. సుముఖుడు, 7.

జైమినిఋషి అనే ఏడుగురు వ్యక్తుల ద్వారా ఈ ఆదిశక్తి లీలాగాథ వెలుగులోకి వచ్చింది. అందుచేత సప్తశతిని సప్త సంవాద కథ అని కూడ అంటారు.

ఆదిశక్తి లీలాగాథను వర్ణించిన మహావక్త మార్కండేయమహర్షి యొక్క జీవితము బాల్యమునుండి భగవంతుడు, భగవతీల కృపాపూర్ణమైన లీలలకు ప్రత్యక్ష ప్రమాణముగా భాసిల్లెను. పద్మపురాణములోని ఉత్తరఖండములో ఇవ్వబడిన కథాప్రసంగాన్ని అనుసరించి వీరి తండ్రి భృకండుమహర్షి, ధర్మపరాయణురాలైన భార్యతో కలిసి భగవంతుడైన మహాశివుని ఆరాధించి వీరిని పుత్రునిగా పొందెను. కానీ సదాశివుడు వీరికి కేవలము 16 సంవత్సరముల ఆయుర్దాయమును మాత్రమే ప్రసాదించెను. తన ఆయువు తీరకముందే ఆయన సదాశివుని ఆరాధించుట ప్రారంభించెను. నిర్ణీతసమయమునకు కాలుడు రాగా, ఆయన వికలమైన మనస్సుతో దేవాధిదేవుడైన మహాదేవుని స్తుతించ సాగెను. ఆయన స్తోత్రముతో ప్రసన్నుడైన మహాదేవుడు ప్రత్యక్షమై అత్యంత వేగంతో కాలుని ఛాతిపై తన్నెను, మార్కండేయునికి అమరత్వమును ప్రసాదించెను.

శ్రీమద్భాగవతపురాణములోని కథాప్రసంగానన్ననుసరించి మార్కండేయఋషి బాల్యంనుండి నైష్ఠికబ్రహ్మచర్యవ్రతమును పాటిస్తూ హిమాలయక్షేత్రములో నరనారాయణులను సేవించటం ప్రారంభించినట్లు చెప్పబడింది. తపస్సు పూర్తైన పిదప భగవంతుడు ఆయనకు దర్శనమిచ్చి కృతార్థుని గావించెను. భగవంతుడు ఆయనను ఏదైనా వరం కోరుకోమనగా మార్కండేయమహర్షి మాయను చూడవలెననే కోర్కెను ప్రకటించాడు. తథాస్తు అని భగవానుడు ఆయన కోర్కెను తీర్చాడు. ఆ క్షణకాలములోనే ఆయన ప్రళయ సమయములోని భయానక దృశ్యాలను చూసి వ్యాకులుడై భగవంతుడిని పిలిచాడు. ఆ పిలుపును వింటూనే భగవంతుడాయనకు బాలముకుందుని రూపంలో దర్శనమిచ్చాడు. భగవంతునికి ప్రణమిల్లుతూ ఆయన

**'కరారవిన్దేన పదారవిన్దం ముఖారవిన్దే వినివేశయన్తం ।**
**వటస్య పత్రస్య పుటే శయానం బాలం**
**ముకున్దం శిరసా నమామి ॥'**

అని కీర్తించాడు. ప్రళయ సముద్ర మధ్యంలో స్థిరంగా నిలబడిన మహావట వృక్షపు ఈశాన్య కోణములోని కొమ్మమీద ఒక ఆకుదొన్నెలో భగవానుడు బాల

ముకుందుని రూపంలో శయనించి ఉన్నాడు. శిశురూపంలో ఉన్న ఆయన అందమైన తన చేతిగ్రేళ్ళతో కుడికాలుని పట్టుకొని నోట్లో బొటనవ్రేలుని చప్పరిస్తూ ఉన్నాడు. మార్కండేయఋషి ఆ శిశువుయొక్క నాసికాఛిద్రం గుండా ఆయన పొట్టులోనికి ప్రవేశించినట్లు పురాణగాథ చెప్తున్నది. అక్కడ ఆయన అనంతకోటి బ్రహ్మాండాలను తిలకించాడు. తిరిగి అదే ముక్కురంధ్రం గుండా వెలుపలికి రాగా ఇంతకుముందు కనిపించి అదృశ్యమైన ఆ ప్రళయకాల దృశ్యమే తిరిగి ప్రత్యక్షమైనది. ఈ భగవత్ కృపను అనుభూతి పొందిన ఆయన హిమాలయములలో ఉన్న తన ఆశ్రమానికి వచ్చి తిరిగి ధ్యానంలో లీనమైనారు. అప్పుడు ఆకాశమార్గాన నంది వాహనముపై పయనిస్తూ పార్వతి సమేతుడై సదాశివుడు అక్కడకు విచ్చేసెను. జగన్మాతయైన పార్వతి సదాశివునితో

"నాథా! ధ్యానమగ్నుడై ఉన్న ఈయన ఎంత గొప్ప తపస్వియో కదా! తమరు ఆయనను అనుగ్రహించండి" అని అడుగగా 'దేవీ! ఈయన నాకు పరమభక్తుడు అయిన మార్కండేయ మహర్షి. ఈయనకు ఎటువంటి కోరికలు లేవు. ఐతే ఇటువంటి భగవద్భక్తులను కలవడం ఎల్లప్పుడు శ్రేయస్కరం కాబట్టి తప్పకుండా వీరిని కలుద్దాము' అని అంటూ భగవంతుడైన పరమశివుడు పార్వతీదేవితో కలిసి ఆయనకు దర్శనమిచ్చి 'పురాణాచార్యుడు' అనే వరాన్నికూడా ప్రసాదించాడు. పార్వతీదేవి కూడా తన దయామృతాన్ని ఆయనపై వర్షింపజేస్తూ ఆయనను పుత్రరూపంలో స్వీకరించినది. భగవంతుని వరాన్ని పొందిన మార్కండేయ ఋషి మార్కండేయ పురాణానికి ఆచార్యుడై ఆ పురాణ భాగంలో ఆదిశక్తియొక్క లీలాగాథను వినిపించెను.

మంత్రమయమైన లీలాగాథలో ఇది మొదటి మంత్రము. శ్రీదుర్గాసప్తశతి యొక్క మంత్రరహస్యములను తెలుసుకొనగోరిన మహాసిద్ధులు, భగవతి భక్తులు ఈ విధానమును ఈప్రకారంగా వివరించారు.

## సాధనా విధానము

**వినియోగము : ఓం అస్య శ్రీ 'మార్కణ్డేయ ఉవాచ' ఇతి సప్తశతీ ప్రథమ మన్త్రస్య శ్రీమహర్షి వేదవ్యాస ఋషిః, భగవాన్ శ్రీసదాశివః దేవతా శ్రీం బీజం, జగద్ధాత్రీ శక్తిః, భువనేశ్వరీ మహావిద్యా, రజోగుణః రసనా జ్ఞానేన్ద్రియం, వైరాగ్యో రసః, వాక్ కర్మేన్ద్రియం, మధ్యమ స్వరం, భూతత్త్వం, విద్యాకళా, బ్రూం ఉత్కీలనం, ప్రవాహినీ**

ముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమ స్థైర్యాయురారోగ్య మభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రి రూపేణా భగవతీ మహాదుర్గాప్రసాద సిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ లోమ విలోమ పుటితోక్త ప్రథమ మన్త్ర జపే వినియోగః ॥

## న్యాసః

| <u>కరన్యాసః</u> | <u>షడంగన్యాసః</u> |
|---|---|
| ఓం నమో అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| ఏం నమో తర్జనీభ్యాం నమః | శిరసే స్వాహా |
| శ్రీం నమో మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| నమో నమః అనామికాభ్యాం నమః | కవచాయ హుమ్ |
| ఓం ఏం శ్రీం నమః కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయ ఔషట్ |
| మార్కణ్డేయ కరతలకర-ఉవాచ పృష్ఠాభ్యాం నమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారుచన్ద్రావతంసమ్ ।
రత్నాకల్పోజ్జ్వలాఙ్గం పరశుమృగవరాభీతిహస్తం ప్రసన్నమ్ ॥
పద్మాసీనం సమన్తాత్ స్తుతమమరగణైర్వ్యాఘ్రకృత్తిం వసానమ్ ।
విశ్వాద్యం విశ్వవన్ద్యం నిఖిలభయహరం పఞ్చవక్త్రం త్రినేత్రమ్॥

## మంత్రం

**ఓం ఏం శ్రీం నమః మార్కణ్డేయ ఉవాచ**
**నమో శ్రీం ఏం ఓం ॥ (1)**
**1000 జపాత్ సిద్ధిః గుడం-తిల-ఘృతేన దశాంశ హోమః ।**

గాయత్రీ మహామంత్ర జపము - 10,000

గాయత్రి విధానేన దశాంశ హోమః ।

పది మాలలు గాయత్రి, ఒక మాల సప్తశతీమంత్రము ఈ విధంగా పది దినములు చెయ్యాలి. తరువాత ప్రతి ఒక్కదానికి దశాంశముతో హోమము చేయాలి.

## ఫలశృతి :

**ఆధ్యాత్మిక ఫలశృతి : వైరాగ్యం**
**లౌకిక ఫలశృతి : యశం**

ఆదిశక్తి గాయత్రీమాత యొక్క లీలాగాథను చదువుతూ, శ్రవణము చేస్తూ ఉన్న శక్తిసాధకులకు పైన చెప్పబడిన పద్ధతి ఆశ్చర్యం గొలిపేదిగా ఉండవచ్చు, ఇక్కడ సంక్షిప్తంగా ఇవ్వబడిన, పైన చెప్పిన విధానము ఖచ్చితంగా మహాశక్తి సాధకుల మంత్ర విద్యామర్మజ్ఞుల యొక్క కృపాప్రసాదమే! సాధకుడు సప్తశతీ మంత్ర జపమునకు 10 రెట్లు గాయత్రీజపము, ఆపైన అందులో దశాంశము హవనము చేయవలెనని మంత్రవిద్యా ఆచార్యుల నిర్ణయం. **శ్రీదుర్గాసప్తశతిలోని 700 మంత్రములన్నీ కూడ ఆదిశక్తి గాయత్రీమాత యొక్క 700 శక్తులను వెల్లడిచేస్తున్నవనేది సత్యము.** గాయత్రీ విద్యకు ఆది ఆచార్యుడు ఆదిశక్తికి మొట్ట మొదటి సాధకుడు అయిన భగవంతుడైన సదాశివుని ధ్యానము ఈ మంత్రములో చెప్పబడినది. గాయత్రీమంత్రముతో ఈ మంత్రమును సమన్వయము కావించుట వలన సాధకునిలో వైరాగ్యము తేజోవంత మౌతుంది. తరువాత తరువాత ఈ మంత్రములో ఆదిశక్తి గాయత్రీమాత యొక్క ఆధ్యాత్మికరూపముతో వైరాగ్యము, లౌకికరూపముతో కీర్తి ప్రకటితము అవుతుందని చెప్పబడినది.

ఆదిశక్తి గాయత్రీమాత యొక్క గర్భమునుండే ఈ జగత్తు, జీవితము ఉద్భవించినవి అని సాధనలో మర్మజ్ఞులైనవారికి తెలుసు. కఠినమైన ఆపదలను నశింపజేయగలిగిన దుర్గ ఆమెయే! ఆమె యొక్క 24 మంత్రాక్షరముల నుండియే సకల మంత్రములు ప్రకటితమైనవి. సంకల్పము గలిగిన సాధకులు శ్రీసప్తశతీ మంత్రములలో దీని ప్రమాణాలను పొందగలరు. గాయత్రీ మహా మంత్రమే సప్తశతి యొక్క 700 మంత్రముల రూపంలో తనను తాను విస్తృతమొనరించుకున్నది' అని వారు అనుభూతి చెందగలరు.

# 25. గాయత్రీ సాధనతోపాటు సప్తశతి మంత్ర సాధన

ఆదిశక్తి యొక్క లీలాకథ పారాయణ, శ్రవణముల చేత మనిషి సమస్త సంకటముల నుండి విముక్తుడౌతాడు. సప్తశతి అతని మనోవాంఛితములను హస్తగతము చేస్తుంది. ఈ పావన కథా మర్మజ్ఞుడు మార్కండేయమహర్షి. ఆయన భగవంతుడు సదాశివుని, మాత భవానీల కృపాపాత్రుడైన వ్యక్తి. దేవాధిదేవుడు మహాదేవుని కృపయే మార్కండేయ మహర్షిని మృత్యుంజయుడిని చేసింది. శివుని వరదానము చేత ఆయనను మృత్యువు కనీసం స్పృశించలేకపోయింది. భగవానుడు మృత్యుంజయుని ఆశీర్వాదం వలననే మార్కండేయమహర్షి మృత్యుంజయుడయ్యాడు. ఆయన జీవన్మరణాల సమస్త రహస్యములను ఎరిగిన జ్ఞాని. భూత భవిష్య వర్తమానరూపంలో ఉన్న మూడు కాలఖండములు అఖండ రూపములో ఆయనకు కరతలామలకములు. ఆ కారణముగానే ఆ మహర్షికి కాలము మరియు దాని ప్రత్యేక కళల రహస్యజ్ఞానము ప్రాప్తించినది. సృష్టి యొక్క సృజనకు చెందిన రహస్యము ఆయన ఎరుగుదురు. జగన్మాత దయవలన మార్కండేయ మహర్షులవారు జీవ జగత్తుల సూక్ష్మతతో పరిచితులు. బాల ముకుందుని కృపచేత వాటిని దర్శించుట వలన మహర్షికి ఆదిశక్తి యొక్క మాత మరియు మాయలనే రెండిటి స్వరూప జ్ఞానం బోధపడినది.

తత్త్వజ్ఞాని, మాతకు పరమభక్తుడు అయిన మార్కండేయ మహర్షి మాతా భగవతి కథను ప్రవచిస్తున్నప్పుడు భవానీమాతయే స్వయముగా శబ్దరూపు ధరించి ప్రకటీకృతమౌతుంది, వాగ్ధారగా ప్రవహిస్తుంది. అటువంటి పావన కథలో భగవతి భగవానుల రసోవైసః యొక్క పరమస్వరూపము ప్రకటీకరించబడుతుంది. ఆదిశక్తి లీలాకథ గత భాగంలో దుర్గాసప్తశతి మంత్రకావ్య ప్రథమ మంత్రోచ్చారణలో ఈ సత్యమే తెలియజేయబడినది. ఇందులో మహర్షి మరియు ఆదిశక్తి లీలాకథ యొక్క భావమయ సంబంధము స్పష్టీకరించబడినది. దీని తదుపరి మంత్రములో పరమజ్ఞానియైన మార్కండేయ మహర్షి ఇలా అన్నారు.

## ప్రథమ చరితమ్

### ప్రథమో అధ్యాయః (మధు-కైటభ వధ)

**సావర్ణిః సూర్యతనయో యో మనుః తథ్యతేఽష్టమః ।**
**నిశామయ తదుత్పత్తిం విస్తరాద్ గదతో మమ ॥ (1/1/2)**

భావార్థము : మేము విపులంగా వర్ణిస్తున్న 8వ మనువు అని చెప్పబడే సూర్యపుత్రుడైన సావర్ణి జన్మవృత్తాంతము యొక్క ఆ కథను వినుము.

ఆదిశక్తి లీలాకథ ఈ సూత్రములో అనేక పౌరాణిక సత్యములు, దార్శనిక, ఆధ్యాత్మిక రహస్యములు ఇమిడి ఉన్నాయి. వాటిని చింతన చేసినట్లయితే శ్రీదుర్గా సప్తశతి యొక్క ఈ శ్లోక మంత్రములో కొంగ్రొత్త గవాక్షములు తెరుచుకుంటాయి. నూతన ఆయామములు ఆవిష్కరింపబడతాయి. ఈ శ్లోకములో 8వ మనువు జన్మ వృత్తాంతమును విస్తారంగా ప్రవచించే విషయము చెప్పబడి ఉన్నది. మన్వంతరాధిపతిని మనువు అని పిలుస్తారు. పురాణ కథల వర్ణన ప్రకారము 14 మన్వంతరాధిపతులు 14 మంది మనువులు. పురాణాలలో ఈ 14 మంది మనువుల వివరణ ఈ విధంగా వర్ణించబడి ఉన్నది. 1) స్వాయంభువ, 2) స్వారోచిష, 3) ఉత్తమ, 4) తామస, 5) రైవత, 6) చాక్షుష, 7) వైవస్వత, 8) సావర్ణి, 9) దక్షసావర్ణి, 10) బ్రహ్మసావర్ణి, 11) ధర్మసావర్ణి, 12) రుద్రసావర్ణి, 13) దేవసావర్ణి, 14) ఇంద్రసావర్ణి లేక మౌత్య.

ముందు చెప్పినట్లుగా ఒక్కో మనువు ఒక్కొక్క మన్వంతరానికి అధికారిగా ఉంటారు. పౌరాణిక వర్ణనల ఆధారముగా 71 చాతుర్యుగములు అనగా 30 కోట్ల 67 లక్షల 20 వేల సంవత్సరముల మానవ సంవత్సరముల ఒక మన్వంతరకాలము అవుతుంది. ఇదే ఇంద్రుడు, సప్తర్షులు మరియు మనువుల అధికారిక కాలము. ప్రస్తుతము 7వ మన్వంతరకాలం నడుస్తున్నది. దీనికి రాజు లేక అధిపతి వైవస్వతుడు. ఆధ్యాత్మిక సాధన, అనుష్ఠానముల ప్రారంభకాలములో చేయబడే సంకల్ప మంత్రములో దీని వివరమంతా చెప్పబడుతుంది. **'ఓం విష్ణుర్విష్ణుర్విష్ణుః ఓం నమః పరమాత్మనే, శ్రీపురాణ పురుషోత్తమస్య శ్రీవిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్యా శ్రీబ్రహ్మణో ద్వితీయపరార్థే శ్రీశ్వేత వరాహకల్పే వైవస్వతమన్వన్తరే...॥** ఈ మన్వంతర కాలములోనే మనమందరము జీవిస్తున్నాము.

దీనికి అతి పురాతన మన్వంతరకాలాధిపతిగా స్వారోచిష మనువు ఉండేవారు. ఆయన అధికారకాలములో రాజా సురథుడు జగన్మాత ఆదిశక్తి ఉపాసన చేశాడు. తపః ప్రభావముచేత ఆయన భగవతి నుండి 8వ మన్వంతరమునకు అధిపతిగా ఉండే వరదానమును పొందాడు. ఆ వరప్రభావ కారణముచేత తరువాతి అనగా 8వ మన్వంతరములో ఆయన సవర్ణ గర్భమునుండి సూర్య తేజస్సుతో జన్మించి, సావర్ణి అను పేరు గల 8వ మన్వంతరమునకు అధిపతి అవుతాడు.

ఇది ఒక పౌరాణిక సత్యమేకాక శ్రీదుర్గాసప్తశతి యొక్క ఈ ప్రథమశ్లోక మంత్రములో రహస్యమయ దార్శనిక, ఆధ్యాత్మిక రహస్యములు కూడ ఇమిడి ఉన్నాయి. వాటి అనుభూతిని చెందిన సాధకగణము తమ ఆత్మసాధనలో ఉన్నత ఉచ్చతర సోపానములను అధిరోహించగలరు. ఈ శ్లోకమంత్రములో రాజా సురథునకు భగవతి కృపతో సూర్యపుత్రుడు జన్మించుటయే అన్నింటికన్నా మహత్వపూర్ణమైన విషయము. **'సూర్య ఆత్మ జగతస్తస్థుషశ్చ'** అనగా సూర్యుడు ఈ సమస్త జగత్తుకు ఆత్మ అను వేదవాక్కు విఖ్యాతమైనది. జీవాత్మ ఈ విరాట్ ఆత్మ పరమాత్మ నుండి విముఖమై పోయింది. వాటి సంబంధము త్రెగి పోయింది. అందువల్ల జీవాత్మ అజ్ఞానాంధకారములో కూరుకు పోయింది. దానిని పలురకాల కష్టములు వివిధరూపములలో ఆవరిస్తున్నాయి.

మనిషి జీవితము పరివర్తన చెందినప్పుడే ఈ విముఖత దూరమౌతుంది. మానవుడు నూతన ఆధ్యాత్మిక జీవనమును పొంది ద్విజుడౌతాడు. దీనికొరకు ఆదిశక్తి జగన్మాత ఉపాసన చేయుట తప్పనిసరి. ఈ జగన్మాత ఆదిశక్తియే సూర్యతేజస్సు, వేదమాత గాయత్రి. గాయత్రీ మహామంత్రము 24 అక్షరములలో చతుర్వేదములలో గానము చెయ్యబడినది. గాయత్రీ ఉపాసన చేతనే జీవుని జీవితములోని చీకట్లు పటాపంచలైపోతాయి. నూతన అనుభూతులు పొంది అతను తనను తాను సూర్యభగవానుడు అనగా పరమాత్మ పుత్రుని రూపములో అనుభూతిచెందుతాడు. ప్రకృతి అతనిని అతని జీవనము యొక్క కాలఖండమునకు అధికారిని చేస్తుంది. అయితే భగవతి కృప లేకుండా ఇది జరుగుట సాధ్యపడదు. ఆమె కృపను పొందుటకు జీవుడు తన జీవితములో ఆదిశక్తి లీలాకథ పారాయణ, శ్రవణములను చేస్తూ భగవతి యొక్క మహామంత్రజపము ద్వారా ఆమెను ఆరాధించవలసి ఉంటుంది.

ప్రతి మనిషి జీవితములో ఈ సాధనాకాలమే మాత ఒడి అవుతుంది. సూర్యుని తేజస్సును, గాయత్రీ తపస్సును ధారణ చేయుటలో ఈ సవర్ణయే సమర్థురాలు. సవర్ణలో తప్ప ఈ సామర్థ్యము మరెవ్వరిలోనూ ఉండదు. నిజానికి ఈ సవర్ణయే సత్ప్రవృత్తుల, సత్కర్మల మరియు గాయత్రీ తపశ్చర్యకు ప్రతీక. ఏ జీవునకు ఈ సవర్ణమాత గర్భస్థానము లభించదో అతనెప్పటికీ సూర్య పరమాత్ముని పుత్రుడయ్యే సౌభాగ్యమును పొందలేడు. కేవలం మంత్రోచ్చారణ చేయుట, కర్మకాండలను ఆచరించుటతోనే సూర్య సాధన, గాయత్రీ సాధన సంపూర్ణమవదు. దీనికిగాను సత్ప్రవృత్తి మరియు సత్కర్మల కొరకు తపించవలసి ఉంటుంది. గాయత్రీ ఉపాసనతో పాటు సాధన, ఆరాధనల సమస్త విధి విధానములను పాటించవలసి ఉంటుంది. అప్పుడే సద్గుణముల యొక్క కృప లభిస్తుంది. సూర్యసాధకునికి సూర్యుడు లేక సవర్ణకు పుత్రునిగా అయ్యే గౌరవపూర్వకమైన అనుభవం పొందుతాడు.

ఇది ప్రతి జీవునకు పునర్జన్మ, అతని ఆధ్యాత్మిక జీవన శుభారంభము. ఈ నూతన జీవితము ఏవిధముగా లభించినది? ఆ విస్తారగాథ యథార్థమునకు జగన్మాత గాయత్రీమహామంత్ర సాధనా కథ. అది పరమ రహస్యమైనది, పరమ గోపనీయ మైనది. ఈ రహస్యములను అందరూ చెప్పలేరు, అందరూ వినలేరు. వీటిని తెలుసు కొనుట కూడ పరమ ఆశ్చర్యకరము. ఈ తత్త్వమును బోధపరుస్తూ యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు ఆధ్యాత్మిక సప్తశతీరూప శ్రీమద్భగవద్గీతలో ఇలా అన్నారు.

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।**
**ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతిశృత్వాప్యేనం**
**వేద న చైవ కశ్చిత్ ॥ (2/29)**

ఎవరో ఒక అసామాన్యమైన మహాపురుషుడే ఈ ఆధ్యాత్మిక తత్త్వమును ఆశ్చర్యంతో చూస్తాడు, అలానే మరొక అసాధారణ మహా సాధకుడే దాని తత్త్వమును ఆశ్చర్యంతో వర్ణిస్తాడు. వేరొక విశేష పురుషార్థపరాయణుడైన సాధకుడు దీన్ని ఆశ్చర్యంతో వింటాడు మరియు మరెంతోమంది వినినప్పటికి దానిని తెలుసు కొనలేరు.

శ్రీదుర్గాసప్తశతిలో గాయత్రీ సాధన యొక్క రహస్యమయ ప్రసంగాల ఈ ఆశ్చర్యకరమైన వివరణనే ఆదిశక్తి పావనలీలాకథ యొక్క మర్మజ్ఞులైన మార్కండేయ

మహర్షి వినిపిస్తున్నారు. దీని యొక్క ఈ దార్శనిక మరియు ఆధ్యాత్మిక సత్యమేకాక ఈ శ్లోకమంత్ర మాంత్రిక సత్యం కూడ ఉన్నది. సాధనావిధాన అంతర్గతముగా ఈ వర్ణన చెయ్యబడినది.

**సాధనా విధానము**

వినియోగః ఓం అస్య శ్రీ "సావర్ణిః సూర్యతనయో" ఇతి సప్తశతీ ద్వితీయ మన్త్రస్య శ్రీ మార్కండేయ ఋషిః, భగవాన్ శ్రీ సూర్యనారాయణోదేవతా, హ్రీం బీజం, జ్యోతిః శక్తిః, ఛిన్నమస్తా మహావిద్యా, రజోగుణః శ్రోత్రజ్ఞానేన్ద్రియం, శాన్త రసః, వాక్ కర్మేన్ద్రియం, పఞ్చ స్వరం, భూతత్త్వం, విద్యాకళా, హ్రీం ఉత్కీలనం, సంజ్కోచినీముద్రా, మమజ్ఞాన భక్తి వైరాగ్య క్షేమ స్థైర్యాయురారోగ్యభివృద్ధ్యర్థం శ్రీ ఆదిశక్తి మాతా గాయత్రి రూపేణా యోగమాయా భగవతీ మహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమో-యుత ప్రణవ-వాగ్బీజ-స్వ బీజ లోమవిలోమ పుటితోక్త ద్వితీయ మన్త్రజపే వినియోగః ॥

**న్యాసః**

| <u>కరన్యాసము</u> | <u>షడంగన్యాసము</u> |
| --- | --- |
| ఓం ఏం హ్రీం అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| ఏం నమోనమః తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| సావర్ణిః సూర్యతనయో మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| యో మనుః కథ్యతేఽష్టమః అనామికాభ్యాం నమః | కవచాయహుమ్ |
| నిశామయ తదుత్పత్తిం కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయ వౌషట్ |
| విస్తరాద్ గదతో మమ కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయఫట్ |

**ధ్యానం**

**(ధ్యేయః సదా సవితృమణ్డల-మధ్యవర్తీ)**

**భాస్వద్-రత్నాఢ్య-మౌలిః స్ఫురధర-రూచా రఞ్జితశ్చారూ కేశో,**
**భాస్వాన్యో దివ్యతేజాః కర కమలయుతః స్వర్ణ-వర్ణః ప్రభాభిః ॥**
**విశ్వాకాశాపకాశో గ్రహ-గణ సహితో భాతి యశ్చోదయాద్రౌ ।**
**సర్వానంద ప్రదాతా హరి-హర-నమితః పాతు మాం విశ్వ-చక్షుః ॥**

**మంత్రం**

**ఓం ఏం హ్రీం నమః సావర్ణిఃసూర్యతనయో**
**యో మనుః కథ్యతేఽష్టమః ।**
**నిశామయ తదుత్పత్తిం విస్తరాద్ గదతో**
**మమ నమో హ్రీం ఏం ఓం ॥**

**1000 జపాత్ సిద్ధిః శర్కరాతిల ఘృతేన దశాంశ హోమః।**

గాయత్రీ మహామంత్రజపం 10,000

గాయత్రీ విధానేన దశాంశ హోమః ।

**10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము ।**

**ఈ విధంగా పదిదినములు అనుష్ఠించి తరువాత ప్రతి ఒక్క దానికి దశాంశముతో హోమము చేయాలి.**

**ఆధ్యాత్మిక ఫలశృతి :** సాధనా జీవన ప్రారంభము అనగా ఆధ్యాత్మిక నవజన్మ ప్రాప్తి

**లౌకిక ఫలశృతి :** సంతానప్రాప్తి

ఆదిశక్తి గాయత్రీమాత యొక్క లీలాగాథను చదువుతూ, శ్రవణము చేస్తూ ఉన్న శక్తిసాధకులు ఈ కథాక్రమములో మాత గాయత్రి రహస్యాత్మక సాధనాకోణములను నిరంతరము అనుభూతి చెందుతుంటారు. దీనితోపాటు వారు సప్తశతి మంత్రాలలో వేదజనని గాయత్రి యొక్క చమత్కారపూరితమైన శక్తులను

అనుభూతి చెందుతారు. అనుభవజ్ఞులైన సాధకులకు కామనతో కూడిన సాధనలలో విధివిధానమునకు విశేష మహత్వమున్నదని తెలుసు. సప్తశతి మంత్రములు గాయత్రీ సాధన సుయోగము, సంయోగమును పొంది విశేషమైన ప్రభావశాలి మంత్రములుగా రూపొందుతాయి. కామనతో విధిపూర్వక అనుష్ఠానం చేసినప్పుడు కూడ అనుకున్న కోరిక ఫలించక పోవటమును మనము పలుమారులు చూస్తూనే ఉంటాము. ప్రబలమైన ప్రారబ్ధం వలన ఇలా జరుగుతుంది. అటువంటి స్థితిలో జగన్మాత సాధకులు, తసాధకురాంౖడు అయిన సంతానము తమ సాధనా ప్రయాసలను విడువరాదు. పైగా ఈ దిశలో నిరంతర ప్రయత్నము చేస్తూ వుండాలి.

## 26. సింహవాహినియైన భవానీమాత సాధన ద్వారా మహాభాగులు కాగలరు

ఆదిశక్తి లీలాకథలోని 700 శ్లోకాలు ఈ సృష్టిసూత్రములోనే ఇమిడి ఉన్నాయి. అఖిలసృష్టికి చెందిన ఆరోహ, అవరోహణము లన్నింటిలోను, ప్రతి ఒక్క సంఘటనా క్రమములోను అంతెందుకు జీవితము, జగత్తుకు చెందిన ప్రతి కణములో కూడ ఈ దివ్యగాథ ధ్వని ప్రతిధ్వనులను వినగలము. ఆదిశక్తి జగన్మాత గాయత్రి విజ్ఞానమూర్తి. ఆమె వేదమాత, జ్ఞానదాయిని కూడా. ఆమెలో భావాలను లయము చెయ్యడమనే ఉపాసన ద్వారా లభించే ఆత్మీయ సాన్నిధ్యములో ఆమె విరాట్ స్వరూపము మనకు బోధపడుతుంది. ఆమెలోనే ఆలోచనలను లయము చెయ్యడమనే సాధన ద్వారా ఆమె యొక్క లీల రేఖామాత్రంగా కనపడుతుంది. మనస్సును కేంద్రీకరించి భగవతితో తాదాత్మ్యము చెందగలిగిన వారే మహామాయయైన గాయత్రి లీలలను చూడగలరు. ఆమె లీలలను దర్శించగలిగినవారు ఆమెను ఆరాధించడముతో తమను తాము మార్పుచేసుకొనగలరు. వారే వేదమాతను సకలరూపాల లోనూ చూసి ఆమెను సేవించగలరు.

ఈవిధమైన ఉపాసన, సాధన, ఆరాధనలతో కూడిన త్రివేణిలో నిత్యము స్నానం చేసే సాధకులు, త్రిపదా గాయత్రి రహస్యములను తెలుసుకొనగలుగుతారు. త్రిపదా గాయత్రి మూడు చరణములు వాస్తవానికి శ్రీదుర్గాసప్తశతి యొక్క మూడు చరిత్రలే

అనే సత్యమును కూడా వారే అనుభూతిచెందగలుగుతారు. గాయత్రీ మహామంత్రము లోని 24 అక్షరములు, శ్రీదుర్గాసప్తశతి యొక్క 700 శ్లోకాలలో ఇమిడి ఉన్నవనే విషయమును కూడా వారు గ్రహించగలరు. వారు తమ జీవితములో కష్టకాలం వచ్చినప్పుడు, క్లిష్టమైన క్షణాలలోను, వరదాయిని అయిన వేదమాత గాయత్రి తన భక్తులను దుర్గమమైన కష్టమునుండి రక్షించటానికి దుర్గ రూపమును ధరిస్తుందని కూడా వారు అనుభూతి చెందగలరు. పాలు నీరును విడదీయగలిగే విచక్షణా జ్ఞానం కలిగిన హంసను తన వాహనముగా చేసుకున్న హంస వాహినియైన గాయత్రీ మాత ధర్మాచరణలో నిష్ఠను కలిగిన ధర్మమయమైన సింహమును వాహనముగా చేసుకొని సింహ వాహిని దుర్గగా రూపుదాల్చి, ధర్మమునకు కష్టమును కలిగించే ఆసురీ శక్తులను నాశనము చేయగలదు. ఈ జగత్తుపైన, జీవితము పైనా ఆపదలను కలిగించే క్రూరకర్మలతో వినాశనమును కలిగించే దుష్టశక్తులను ఆమెయే నిర్మూలించి వేయగలదు.

గతంలోకి వెళితే క్రీ.శ 1965, క్రీ.శ 1971 సంవత్సరములలో పాకిస్తాన్ మన దేశము పైన ఆక్రమణ జరిపింది. అప్పుడు యుగద్రష్ట, యుగావతారస్వరూపులైన గురుదేవులు గాయత్రీ పరివార్‌కి చెందిన తన స్వజనులు, సంతానము మొదలగు వారందరినీ గాయత్రీమాతను దుర్గాస్వరూపములో ఆహ్వానించమని ప్రబోధించారు. అదే సమయములో గాయత్రీ మహామంత్రమును 'క్లీం' బీజముతో సంపుటీకరణం చేసి జపించమని కూడ సూచించారు. పరమపూజ్యగురుదేవులు ఆనాడు చేసిన మార్గ దర్శనము ఇప్పుడు కూడ అన్నివిధాలా ఆమోద యోగ్యమైనది. ఆ రోజులలో వారు చెప్పినది అప్పటి అఖండజ్యోతి సంచికలో చదువవచ్చు. ప్రస్తుతకాలములో కూడా దేశము, ప్రపంచము అనేక రకాల సమస్యల నెదుర్కొంటున్నది. వాటన్నింటిని సమూలంగా నశింపజెయ్యటానికి వరదాయిని, హంసవాహిని అయిన గాయత్రీ మాత తపస్సును స్వీకరించి సింహవాహినిగా మారవలసి వచ్చినా ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు. ఆమె పుత్రులు, పుత్రికలు, సేవకులు, సంతానము, భక్తజనము అయిన మనమందరం ఆమెకు వాహనములమే!

వివేకపూర్ణమైన జీవనాన్ని గడుపుతూ సంపూర్ణమైన జ్ఞానమును, మోక్షమును ఆ తల్లినుండి మనం కోరుకున్నట్లయితే మన స్వరూపమే హంసవలె ఉంటుంది. అలాకాక క్లిష్టమైన, వ్యతిరేకపరిస్థితులతో పోరాడుతూ ధర్మంపట్ల స్థిరమైన

విశ్వాసమును నిలుపుకొని ధర్మమునే ఆచరిస్తూ, దుష్కరమైన, దుర్ధర్షమైన తపస్సును సాగిస్తూ ధర్మం యొక్క విజయము కోసము కఠినమైన ఘర్షణకులోనై మహాసంగ్రామ మొనరిస్తూ ఉన్నట్లయితే కనుక మనం సింహరూపులమౌతాము. అప్పుడు ఆదిశక్తి వేదమాత సింహాలమైన మనలను స్వీకరించి సింహవాహినియై అపరిమితమైన సాహసమును, అనంతమైన శౌర్యమును, మహా విజయము అనే వరదానమును మనకు అనుగ్రహిస్తుంది. ఆ విజయము ఎవరో ఒక వ్యక్తికి మాత్రమే చెందదు. ఇది ధర్మమునకు లభించిన విజయం

వివేకమును ప్రసాదించే వరదాయినియైన గాయత్రీమాతను శౌర్య సాహసము లను, కష్టములను ఎదుర్కొనగలిగి మంచి శక్తి సామర్థ్యములను ప్రసాదించమని కోరినవారికి ఆదిశక్తి గాయత్రీమాత సింహవాహనియై దర్శనమిస్తుంది. అనంత రూపాలను కలిగి ఉన్నప్పటికి ఆమె ఒక్కరే! గాయత్రీ మహా మంత్రము యొక్క 24 అక్షరములలో ఆమె 24 రూపములలో దర్శనమిస్తుంది. యుగద్రష్ట, యుగఋషియైన పరమ పూజ్య గురుదేవులు భారతదేశము యొక్క మొట్టమొదటి శక్తిపీఠ రూపములో 'బ్రహ్మవర్చస్ శోధ్ సంస్థాన్'ను స్థాపించేటప్పుడు విశ్వమాత 24 రూపములను ప్రతిష్ఠించారు.

ఇక్కడ ఆమె తన మూలరూపములో హంసవాహినిగా ఉంటూనే మహా సంకటములను నివారించటానికిగాను సింహవాహినియైన భవానిగా కూడా అవుతున్నది. రూపములు ఎన్ని అయినప్పటికి తన సంతానమునకు ఆమె తల్లిమాత్రమే! వరదాయినియైన ఆ తల్లియొక్క సాధకులలో అత్యంత శ్రేష్ఠుడైన మార్కండేయ మహర్షి ఆమె దయను సంపూర్ణముగా అనుభూతి చెందాడు. సత్యయుగంలో మార్కండేయమహర్షి పొందిన ఆ అనుభూతిని తన శిష్యులకు సంతానమును ప్రసాదించటానికి గాను, కలికల్మషనాశకుడు, కల్కిరూపధారియై భగవంతుడైన మహాకాలుడు, జగన్మాతయైన భగవతితో సహా ఈ యుగములోనే వేంచేసి ఉన్నాడు. ఆ మహాశక్తిమంతుడు ఆ మహాశక్తి వారిరువురి లోకయాత్ర ప్రత్యక్షంగా లేనప్పటికి పరోక్షంగా ఆమె లీలాగాథ ఇప్పుడు కూడ జరుగుతూనే ఉన్నది. మధుకైటభులను, మహిషాసురుని సంహరించటానికి ఆమె ఇప్పుడు కూడా పరమ శివునితో కలిసి సన్నద్ధమై ఉన్నది. శుంభనిశుంభులను వారి సమస్త సేనాపతులను ఇప్పుడు కూడా నిర్జించటానికి ఆమె దృఢ సంకల్పంతో ఉన్నది.

వాస్తవానికి ఈ లీలాగాథ ఆమెదే! అంతర్దృష్టి, యోగదృష్టితో పాటు, ఆధ్యాత్మికశక్తి కలిగినవారు ఈ సత్యమును వీక్షించగలరు, వినగలరు, అర్థము చేసుకొనగలరు. శబ్దములు ఎలా ఉన్నప్పటికి యథార్థమేమిటంటే అదృశ్యంలో జరుగుతూ ఉన్న యుగ పరివర్తనకు చెందిన సత్యములే శబ్దరూపములో వెలువడు తున్నాయి అనే విషయమును ఇతరులకు కూడా అర్థమయ్యే విధంగా చెప్పవలెను. ఈ సత్యమనేది ఒక నాణెమైతే దానికి యుగప్రత్యావర్తన కారకమైన సృష్టిసత్యము ఒక వైపు ఉంటే, రెండవవైపు ఉన్న సత్యము సాధకులు. ఆదిశక్తి వేదమాత గాయత్రిని ఆరాధించే సాధకుల యొక్క అంతశ్చేతనలో ఈ సత్యములు వెల్లడౌతున్నవి. అందుచేత భ్రమలను తొలగించుకొని, ధైర్యంగా ఉంటూ ఆదిశక్తి గాయత్రి యొక్క రహస్యమయ చరిత్రను పఠించండి. ప్రస్తుతకాలంలో ఆమె మనకు ప్రసాదిస్తున్న చక్కని దృష్టితో వీక్షించండి. ప్రాచీనకాలంలో ఆమె దయతోనే మార్కండేయమహర్షికి ఇటువంటి దృష్టి లభించినది.

దీనిని పొందిన తరువాతనే మార్కండేయమహర్షి శ్రీదుర్గా సప్తశతి యొక్క ప్రథమచరిత్ర, మొదటి అధ్యాయములో, మొదటి శ్లోకంలో 'ఎనిమిదవ మనువుగా చెప్పబడే సూర్యపుత్రుడైన సావర్ణి యొక్క జన్మవృత్తాంతమును విపులంగా చెప్పి నాకు వినిపించ వలసినది' అన్నారు.

మార్కండేయమహర్షి చెప్పిన కథనాన్ని భక్తుడైన ఒక కవి ఈ క్రిందివిధంగా వ్రాశాడు.

**సూర్యపుత్ర సావర్ణి ఆఠవేఀ హోంగే జగమే మను విఖ్యాత । జన్మకథా**
**విస్తారసహిత మై కహతా ఉన్‌కీ సునియే తాత ॥**

ఋషి యొక్క ఈ కథనమును ఆదిశక్తి లీలాగాథ యొక్క గత సంచికలో వివరంగా చెప్పడమైనది. దీని తరువాత రాబోయే మంత్రమయమైన గాథను మంత్రోచ్చారణ చేస్తూ సర్వశ్రేష్ఠుడైన మార్కండేయమహర్షి ఈ క్రిందివిధంగా చెప్తున్నారు.

**మహా మాయానుభావేన యథా మన్వంతరాధిపః ।**
**స బభూవ మహాభాగః సావర్ణిస్తనయో రవేః ॥ (1/1/3)**

అనగా మహామాయ యొక్క అనుగ్రహముతో మహాభాగుడైన ఆ సావర్ణి మన్వంతరానికి అధిపతియైన విధానమును ఇప్పుడు మీకు వినిపిస్తున్నాను' అని

అర్థము. భక్తుడైన కవి దీనిని ఈ క్రిందివిధంగా అనువదించాడు.

**మన్వంతర్ కే అధిపతికైసే హుయే సునో వే సూర్యకుమార ।**
**ఆదిశక్తికీ అనుకంపాసే మహాభాగ సావర్ణి ఉదార ॥**

ఆదిశక్తి యొక్క సంతానమైన సాధకులకు ఈ గాథ లోతైన భావముతో పూరించబడిన మంత్రము వంటిది. ఈ మంత్రములో ఋషి, జగన్మాత యొక్క సాధనలో తత్పరుడైన వ్యక్తి మహా భాగుడౌతాడు' అనే సత్యమును స్పష్టంగా వెల్లడించారు. **ఆధ్యాత్మిక శాస్త్రములను అనుసరించి 1) ఐశ్వర్యము, 2) వీర్యము, 3) యశము, 4) శ్రీ, 5) జ్ఞానము, 6) వైరాగ్యము ఈ ఆరు భాగములని చెప్పబడతాయి. ఈ ఆరింటిని సంపూర్ణంగా పొందగలిగిన వ్యక్తిని మహాభాగ అంటారు.** ఈ మంత్రములో 'మన్వంతర బభూవ' అనగా మన్వంతరమునకు అధిపతి అయ్యెను అని అర్థము. అయితే అసలు కథలోని సత్యమేమిటంటే రెండవ మన్వంతరములో సురథుడు, రాబోయే ఎనిమిదవ మన్వంతరానికి అధిపతి కాగలిగినట్టి వరమును పొంది ఉన్నాడు. అందుచే 'మన్వంతరమునకు అధిపతి అయ్యే అధికారమును పొందాడు' అని పైన చెప్పబడిన మంత్రమునకు భావార్థము తీసుకొనవచ్చు. ఈ కారణముగానే కొంతమంది వ్యాఖ్యానవేత్తలు, 'బభూవ' అనే శబ్దమునకు 'భవిష్యత్తులో జరుగుతుంది' అనే అర్థమును కూడా తీసుకున్నారు. సంస్కృతభాషా మర్మజ్ఞుల అభిప్రాయమును అనుసరించి **'భావిని భూత్వారోషం'** అని చెప్పబడింది. ఈ మంత్రము యొక్క సాధన 'ఆదిశక్తి యెడల చేయబడిన సమర్థ వంతమైన సాధన, సాధకునకు షడైశ్వర్యములను 'సమకూర్చ గలదు' అని సూచిస్తున్నది. ధైర్యపూర్వకంగా సాధన చెయ్యటం వలన సాధకుడు సమస్తమైన భౌతిక, ఆధ్యాత్మిక సంపదలకు అధికారి కాగలడు. దీనితోపాటు శ్లోకం యొక్క మంత్రపూర్వకమైన సత్యము, సాధనావిధానము ఈ క్రింద ఇవ్వబడినది.

## సాధనా విధానము :

**వినియోగము : ఓం అస్య "శ్రీమహామాయానుభావేన" ఇతి సప్తశతీ తృతీయ మన్త్రస్య శ్రీమార్కండేయ ఋషిః, భగవాన్ శ్రీసూర్య నారాయణదేవతా, క్లీం బీజం, జ్యోతిః శక్తిః, ఛిన్నమస్తా మహావిద్యా, రజోగుణః శ్రోత్రజ్ఞానేన్ద్రియం, శాన్త రసః, వాక్ కర్మేన్ద్రియం, ప్రశ్నస్వరం, భూతత్త్వం, విద్యాకళా, హ్రీం ఉత్కీలనం,**

సంజ్ఞోచిన్ముద్రా, మమజ్ఞాన భక్తి వైరాగ్య క్షేమ స్థైర్యాయురారోగ్య మభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణా యోగమాయా భగవతీ మహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమో–యుత ప్రణవ–వాగ్బీజ–స్వబీజ లోమ విలోమ పుటితోక్త తృతీయ మన్త్ర జపే వినియోగః ॥

## న్యాసః

| కరన్యాసము | షడంగన్యాసము |
|---|---|
| ఓం ఏం క్లీం అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| ఏం నమోనమః తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| మహామాయానుభావేన మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| యథామన్వన్తరాధిపః అనామికాభ్యాం నమః | కవచాయహుమ్ |
| స బభూవమహాభాగః కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయ వౌషట్ |
| సావర్ణిస్తనయోరవేః కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

భాస్వద్–రత్నాఢ్య–మౌలిః స్ఫురదధర–రూచా రఞ్జితశ్చారు కేశో ।
భాస్వాన్యో దివ్యతేజాః కర కమలయుతః స్వర్ణవర్ణాప్రభాభిః ॥
విశ్వాకాశావకాశో గ్రహ–గణ సహితో భాతి యశ్చోదయాద్రౌ ।
సర్వానన్ద–ప్రదాతా హరి–హర–నమితః పాతు మాం విశ్వ–చక్షుః ॥
విశ్వాద్యం విశ్వవన్ద్యం నిఖిలభయహరం పఞ్చవక్త్రం త్రినేత్రమ్॥

## మంత్రం

**ఓం ఏం క్లీం నమః మహామాయానుభావేన, యథా మన్వన్తరాధిపః ।**
**సబభూవమహాభాగః సావర్ణిస్తనయో రవేః నమో క్లీం ఏం ఓం॥**

**1000 జపాత్ సిద్ధి–శర్కరాతిల ఘృతేన దశాంశ హోమః**

పంచదార, నువ్వులు, నెయ్యిని కలిపి అందులో పదవవంతు హోమము, గాయత్రీమహామంత్ర జపం 1000 చెయ్యాలి. గాయత్రీ విధానమును అనుసరించి అందులో పదవవంతు హోమము.

గాయత్రీమహామంత్రజప 10,000 గాయత్రి విధానేన దశాంశ హోమః ।

10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము. ఈ విధంగా పదిదినముల విధానం తరువాత ప్రతి ఒక్కదానికి దశాంశముతో హోమము చేయాలి

**ఆధ్యాత్మిక ఫలశృతి :** సాధనలో ఎదురయ్యే విఘ్నములు తొలగుట, ఆధ్యాత్మిక ఐశ్వర్యము చేకూరుట.

**లౌకిక ఫలశృతి :** లౌకిక సంపదలు, ఉన్నత పదవులు ప్రాప్తించుట.

ఆదిశక్తి జగన్మాత గాయత్రీమాత సాధకుల సముఖంలో ఈవిధంగా అనేక ఆధ్యాత్మిక రహస్యార్థములు వెల్లడౌతుంటాయి. సాధనలోని గూఢమైన సత్యమును తెలిసినవారికి 'ఎల్లవేళలా సంపూర్ణంగా, నిష్కామపూర్వకంగా చేసిన సాధనయే సర్వోత్తమమైన' అన్న సత్యమును తప్పనిసరిగా తెలుసుకొన వలయును. సాధన నిష్కామంగా చేసినట్లయితే చిత్తశుద్ధితోపాటు అంతశ్చేతనలో అనేక ఆయామములు ప్రకటీకృతము కాగలవు. ప్రాపంచికమైన సమస్యలలో చిక్కుకుని కష్టాలతో బాధపడుతుండే వారికి గాయత్రీసాధనతోపాటు సప్తశతీ సాధనకూడా కలిసి చేసుకొనటం వలన బాధలనుండి కొంతవరకు ఉపశమనము కలుగుతుంది. తత్ఫలితముగా అతడు సహజముగానే తన మనోరథమును నెరవేర్చుకొనగలుగుతాడు.

# 27. ఈ సాధన ఆధ్యాత్మిక మనోవాంఛను సిద్ధింపచేస్తుంది

ఆదిశక్తి లీలాకథ యొక్క పారాయణ, శ్రవణము, మననములు జీవితంలో శక్తిని ప్రవహింపజేస్తాయి. శక్తిలేని జీవితం యొక్క అస్తిత్వపు కల్పన చేయుట అసాధ్యము. క్రియ, జ్ఞానము మరియు ఇచ్ఛ ఇవన్నీ శక్తి యొక్క వ్యక్తీకరణే. శక్తి ప్రవాహం పవిత్రం మరియు శుభకరంగా ఉన్నచోట ప్రసన్నత, పులకింత మరియు పల్లవింపును చూడగలము. దీనికి విరుద్ధంగా అపవిత్రత మరియు అశుభ శక్తి ప్రవహించిన చోట బాధ, నాశనము మరియు మరణ దృశ్యములు ప్రత్యక్షమౌతాయి. ఎక్కడైనాసరే ఏదైనా సంఘటన చోటుచేసుకుంటే అక్కడ ప్రత్యక్ష అప్రత్యక్ష రూపాలలో శక్తి స్పందనే కనిపిస్తుంది. విభూతులు, సిద్ధులు, లాభాలు సమస్తము కూడా శక్తియొక్క వరదానములే. శక్తి సాన్నిధ్యములో నిరాకారం సాకారమౌతుంది. సహజంగానే అసంభవము సంభవంగా రూపొందుతుంది. అయితే శక్తి లేనప్పుడు సాకారము తన ఆకృతిని పోగొట్టుకుంటుంది. సహజంగా సంభవమయ్యేది శాశ్వతంగా అసంభవమైపోతుంది. ఇందువలన జీవించాలని గాఢంగా అభిలషించే మానవులు ప్రత్యక్ష లేక పరోక్షరూపంలో శక్తిని తప్పనిసరిగా ఉపాసించవలసి ఉంటుంది.

శ్రీదుర్గాసప్తశతిలోని 700 శ్లోకములలో శక్తితత్త్వమే బోధించ బడినది. శక్తి యొక్క ఉపాసన, జాగరణ, గ్రహణము మరియు సంప్రేషణ (ఉపయోగం) యొక్క విధానమే వీటిలో ఉన్నది. శ్రీదుర్గాసప్తశతిలోని 700 శ్లోకముల పారాయణ, శ్రవణం మరియు మననములు సాధకునకు సమస్తమును ప్రసాదిస్తాయి. దీనిని గతంలో లక్షలాదిమంది సాధకులు అనుభూతిచెందారు, ప్రస్తుతము సాధకులు అనుభూతి చెందుతున్నారు మరియు భావికాలంలో దీనిని అనుభూతి చెందుతూనే ఉంటారన్నది ఒక శాశ్వత సత్యం. ఈ అనుభవజ్ఞుల జాబితాలో మీరు, మేము కూడా చేరవచ్చును. దీనికొరకు మనము చెయ్యవలసినది ఏమిటంటే కేవలము ఆదిశక్తి లీలాకథను పారాయణ చేసి, దానిని అర్థము చేసుకోవాల్సి ఉంటుంది. అంతేకాదు లీలాకథలోని సత్యము మరియు తత్త్వములో పూర్తిగా లీనమైపోవలసి ఉంటుంది. దీనిలో సంపూర్ణంగా మునకలేయవలసి ఉంటుంది. అప్పుడు అన్ని మార్గములు స్వయంగా, సులభంగా తెరచుకుంటాయి. ఆధ్యాత్మిక జీవన విభూతులైనా లేక భౌతిక ఉపలబ్ధులైనా

సమస్తం దీనిద్వారా సహజసిద్ధంగా, సులభంగా లభిస్తాయి. గత భాగాల కథాక్రమంలో అనుభవం ఆధారంగానే ఈ విషయమును చెప్తున్నాము తప్ప ఈ మాటలు కల్పిత కథలు కావు.

ఈ కథాక్రమంలో వ్రాయబడుతున్న మొత్తము విషయములో కొన్ని వివరణలు సాంకేతికములు. మిగతాదంతా సుస్పష్టంగా వివరించబడుతున్నది. కొన్ని సందర్భాలలో ఎక్కడెక్కడైతే సాంకేతిక చర్చసాగిందో అక్కడక్కడ కేవలము ఆధ్యాత్మిక తత్త్వములు, సత్యములు మరియు సూత్రముల మర్యాదను అనుసరించి గోప్యతను కాపాడాలి తప్ప దానికి భంగం కలిగించరాదనే శాస్త్ర ఆదేశము కారణంగా అలా చర్చించటము జరిగినది. జగన్మాత ఆదిశక్తి పట్ల శ్రద్ధ, నిష్ఠ మరియు విశ్వాసం గల సాధకులైనవారు స్వయంగానే తమ అంతఃప్రజ్ఞ యొక్క వెలుగులో ఈ సాంకేతిక రహస్యములను అవగాహన చేసుకొనగలరు. ఇప్పుడిప్పుడే సాధనా సోపానాల మీద ప్రథమపాదము మోపిన సామాన్యజనులకు మేమిస్తున్న ఈ సుస్పష్ట వివరణ చాలు. దీనిని నిరంతరము చింతనమననాదులు గావిస్తున్న సాధకులు ఈ సాంకేతిక రహస్యాలను శీఘ్రముగానే అర్థము చేసుకొనగలిగే, తెలుసుకొన గలిగే సామర్థ్యమును పొందుతారు. సంతానము పట్ల పరిపూర్ణ మమత, వాత్సల్యములు కలిగిన మాత ఆదిశక్తి సహజంగానే వారిని ఆధ్యాత్మిక పథములో అగ్రసరులయ్యేవిధంగా అవశ్యము ప్రేరణ, వెలుగును ప్రసాదిస్తూ ఉంటుంది.

మహామాయ యొక్క ఈ లీలాకథ గత సంచికలలో ప్రథమ చరిత్ర, ప్రథమాధ్యాయములోని మూడవ మంత్రభావనలో వివరించి చెప్పటం జరిగినది. ఈ మంత్రములో మార్కండేయ ఋషి ఇలా చెప్పారు. 'మహాభాగ', 'సావర్ణి' మొదలైనవారు మహా మాయ అనుగ్రహముతో ఏవిధంగా మన్వంతాధిపతులయ్యారో ఆ విషయమునే నేనిక్కడ వినిపిస్తున్నాను, వివరిస్తున్నాను. ఈ ప్రసంగమే ఆ కథాసూత్రము. అందులోనే కథ యొక్క అన్ని అధ్యాయములు ఇమిడి ఉన్నాయి. దీనిలోనే జగన్మాత యొక్క రెండు రూపములు గుదిగ్రుచ్చబడి ఉన్నాయి. ప్రథమాధ్యాయములో మహామాయ రూపును ధరించి త్రిలోకములను, సంపూర్ణ చరాచర విశ్వమును సమ్మోహితము గావించుచున్నది. ఆమె అతులిత ప్రభావముచేత క్రిమి–కీటకాదులు, పశు–పక్ష్యాదులేకాక, స్వయంగా త్రిమూర్తులుకూడా సమ్మోహితులయ్యారు. దయార్ద్ర హృదయముతో తత్త్వమయి రూపు ధరించినప్పుడు జీవుల మాయాపాశములను

త్రెంచివేసే కరుణామయి మాత ఆమెయే! మాత కృపచేతనే వారికి తత్త్వదృష్టి అలవడుతుంది. మాత తన కృప చేత వారికి వివేక, వైరాగ్య, జ్ఞానములను ప్రసాదిస్తుంది. ఒక్కమారు ఆదిశక్తి జగన్మాతను 'అమ్మా!' అని ఆర్ద్రంగా పిలిస్తే చాలు మాత వారికి సమస్తమును ప్రసాదిస్తుంది అనే సత్యమును జీవులు తెలుసుకొన గలుగుతారు. అప్పుడు ఆ సమయములో దుస్సాధ్యమైన కాలం కూడా మాత కృప ముందు అవనతశిరస్కుడై, ముకుళితహస్తుడై, వివశుడై నిలబడతాడు. అటువంటి ఆ మహామాయ ఆదిశక్తి కృప సురథ మహారాజుకు ప్రాప్తించింది.

ఆదిశక్తి లీలాకథ యొక్క రెండవమంత్రములో ఈ రాజు గూర్చిన చర్చారంభమే చెయ్యబడినది.

**స్వారోచిషేఽన్తరే పూర్వం చైత్రవంశసముద్భవః ।**
**సురథో నామ రాజాభూత్సమస్తే క్షితిమణ్డలే ॥ (1/1/4)**

అర్థము: పూర్వకాలము 'స్వారోచిష' మనువు కాలంలో సురథుడనే రాజు ఉండేవాడు. ఆయన చైత్రవంశములో జన్మించాడు. ఆయనకు సమస్త భూమండలము మీద ఆధిపత్యము ఉండేది.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ కథామంత్రములో పురాణేతి హాసములలో చెప్పిన సత్యముతోపాటు ఆధ్యాత్మిక అనుభవాల రహస్యములు, వాటి లోతులు కూడా ఇమిడి ఉన్నాయి. పురాణ కథల ప్రకారము స్వారోచిష మనువు రెండవ మన్వంతరాధిపతి. ఆయన జ్యేష్ఠకుమారుని పేరు చైత్రుడు. ఆ చైత్రవంశములో సురథ మహారాజు జన్మించాడు. శుభలక్షణములుగల ఈ మహారాజు సురథుని రాజ్యము సంపూర్ణ భూమండలమంతా వ్యాపించి ఉన్నది. ఈ పౌరాణికసత్యము లోతుల లోలోపల ఆధ్యాత్మిక రహస్యములు ఇవ్వబడ్డాయి. ఈ కథా ప్రసంగమునకు తనదైన సాంకేతికార్థము కూడా ఉన్నది. దానిని అర్థము చేసుకుంటే సాధనా పథము కాంతులీనుతుంది.

ఈ కథాప్రసంగములో సురథమహారాజు చైత్రవంశోద్భవుడు అని చెప్పబడినది. చైత్రమాస శుక్లపక్షము శుభకరమైనది. ఇది శ్రీరాముని జన్మించిన పుణ్యమాసము కూడా. భగవద్గీతలో యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు కూడా ఇలా అన్నాడు 'ఏ యోగ సాధకుల సాధన అసంపూర్ణంగా నిలిచిపోతుందో వారు పుణ్యకర్మల నాచరించే

శ్రీమంతుల ఇండ్లలో, వారి వంశము లోనే జన్మిస్తారు.' మహారాజు సురథుని జన్మ ప్రసంగములో కూడా సురథుడు తన అసంపూర్ణ సాధనను పూర్తిగావించేకునే నిమిత్తము చైత్ర వంశములో జన్మించాడు. సాధారణంగా సురథుడు జన్మతః సాధనారతుడైన జీవాత్మకు ప్రతీక. తన ఆధ్యాత్మిక సాధనను పరిపూర్ణం గావించుకునే నిమిత్తము జన్మించిన జీవాత్మ రాజా సురథుడు. అటువంటి జీవాత్మలు సాత్త్విక సంస్కారములు మరియు శుభకర్మలతో సాధనను సంపూర్ణం చేసుకుంటారు. అయినప్పటికి అతనిలో కొంతలోకొంత రజో తమో గుణములు మిగిలే ఉంటాయి. ఈ అంశములే అతని జీవితంలో పరీక్ష యొక్క కఠినమైన క్షణములుగా విజృంభిస్తాయి, ఎదురు నిలుస్తాయి. ఈ సమయములోనే సాధకుని తపోబలము, ఆత్మబలములకు పరీక్ష జరుగుతుంది. **సాధకుని జీవితంలోని విపత్కాలంలో అతను సర్వేశ్వరి జగన్మాత ఆదిశక్తి పట్ల ఎంత అనన్యభావముతో సమర్పణ చేసుకున్నాడు, ఎంతగా ఆమెను ఆశ్రయించాడు అన్న విషయము పరీక్షించ బడుతుంది.**

రాజా సురథుని ఈ కథాప్రసంగములో అతని రాజ్యము భూమండలమంతా వ్యాపించి ఉన్నది అన్న విషయము ప్రస్తావించ బడినది. ఈ పృథ్వీమండలము సాధకుని జీవితమునకు, అతని దేహమునకు ప్రతీక. ఎందుకంటే మనమందరము భూమండల వాసులము కనుక మన జీవితాలు పృథ్వీతత్త్వ ప్రధానమైనవి. మనము ఎవరిమైనా, ఎక్కడ జీవిస్తున్నాకూడా ఈ మట్టినుండే జన్మిస్తాము మరియు తిరిగి ఈ మట్టిలోనే కలిసిపోతాము. మట్టి యొక్క జడత్వములో జీవాత్మ కారణముగానే చైతన్య ప్రకాశము గోచరిస్తుంది. అతని చేతనాశక్తి వలన దేహము మరియు జీవితము చైతన్యమయముగా కనపడుతుంది. చింతన, చరిత్ర, నడవడిక, భావము, ఆలోచన మరియు కర్మలుగా జీవాత్మ యొక్క చేతనయే వివిధరూపాలలో కానవస్తుంది. దాని వివిధ అంశలే జీవాత్మ రూపమైన రాజా సురథుని మంత్రిగా, సేనాపతిగా రూపుదాలుస్తాయి. ఈ మంత్రే జీవాత్మ యొక్క తనదైన మనస్సు మరియు సేనాపతి ప్రాణము. వృత్తులే రాణులు మరియు ఇంద్రియములు పరిచారకులు. **జీవాత్మ సంస్కార సముదాయమే కుటుంబములోని స్వజనులు. జీవాత్మ కర్మలే కుటుంబీకులు.** వీరి సానుకూల్యతతోనే జీవాత్మ సుఖములను పొందుతుంది. వీరి ప్రతికూలతే జీవాత్మకు దుఃఖమును చేకూరుస్తుంది.

ఈ కథ ఆధ్యాత్మిక ప్రతీకలతోపాటు దాని మంత్రపరమైన సత్యము మరియు సాధనా విధానము కూడా ఉన్నది. అది ఈ క్రిందన ఇవ్వబడుతున్నది.

## సాధనా విధానము

**వినియోగః ఓం అస్య శ్రీ 'స్వారోచిషేఽన్తరే' ఇతి సప్తశతీ చతుర్థ మన్త్రస్య శ్రీబ్రహ్మఋషిః, శ్రీమహాకాళీదేవతా, శ్రీం బీజం, పద్మావతీ శక్తిః, దక్షిణాకాళీమహావిద్యా, తమోగుణః, త్వక్ జ్ఞానేన్ద్రియం, శాన్తరసః, వాక్ కర్మేన్ద్రియం, మధ్యమ స్వరం, ఆకాశతత్త్వం, శాన్తికళా, క్లీం ఉత్కీలనం, ద్రావిణీముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయ భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ వాగ్బీజ స్వబీజ లోమ విలోమ పుటితోక్త చతుర్థ మన్త్రజపే వినియోగః ॥**

## న్యాసః

| కరన్యాసః | షడంగన్యాసః |
|---|---|
| ఓం ఐం శ్రీం అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| ఓం నమో నమః శిరసేస్వాహా | తర్జనీభ్యాం నమః |
| స్వారోచిషేఽన్తరేపూర్వం మధ్యమాభ్యాంనమః | శిఖాయైవషట్ |
| చైత్రవంశ సముద్భవః అనామికాభ్యాంనమః | కవచాయహుమ్ |
| సురథోనామ రాజాఽభూత కనిష్ఠికాభ్యాంనమః | నేత్రత్రయాయవౌషట్ |
| సమస్తే క్షితిమణ్డలే కరతలకర పృష్ఠాభ్యాంనమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

**ఖడ్గంచక్ర గదేషు చాప పరిఘూన్ శూలం భుశుణ్డీం శిరః ।**
**శఙ్ఖం సందధతీం కరైస్త్రినయనాం సర్వాఙ్గం భూషావృతామ్ ।**
**నీలాశ్మ ద్యుతిమాస్య పాద దశకాం సేవే మహాకాళికామ్ ।**
**యామస్తౌత్ స్వపితే హరౌ కమలజో హన్తుం మధుంకైటభమ్ ॥**

## మంత్రం

**ఓం ఐం శ్రీం నమః**
**స్వారోచిషే న్తరే పూర్వం, చైత్రవంశసముద్భవః ।**
**సురథోనామ రాజా భూత, సమస్తే క్షితిమణ్డలే ॥**
**నమో శ్రీం ఐం ఓం ॥ 4 ॥**
**1000 జపాత్ సిద్ధిః పాయస దశాంశ హోమః ।**
**గాయత్రీమహామన్త్ర జప 10,000,**
**గాయత్రీ విధానేన దశాంశ హోమః ॥**

గాయత్రీమహామంత్ర జపము 10,000 చేయాలి. గాయత్రి విధివిధానముతో దశాంశ హోమము చేయాలి.

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈవిధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత దశాంశహోమము, హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** ఆధ్యాత్మిక అభీష్టము నెరవేరుతుంది.

**లౌకిక ఫలితము:** ఉన్నత పదవి లభిస్తుంది

గాయత్రీ సాధనా విధానముతో కలిసిన ఈ సప్తశతీమంత్రము అతిశయించిన ప్రభావశాలిగా నిలుస్తుంది. నిష్కామ భావనతో ఈ సాధనను ఆచరించినట్లయితే సాధకునిలో ఆధ్యాత్మిక ఇచ్ఛ ఏనాడు మందగించదు, అయితే ఒకవేళ దీనికి లౌకిక కామన జోడయినట్లయితే దాని ప్రభావము తప్పక కనిపిస్తుంది. దీని ప్రభావము వలన మధ్యలో నిలిచిపోయిన ఉన్నతస్థితి సహజంగానే ప్రాప్తిస్తుంది మరియు సాధన చేసేవారికి ఉన్నత పదవి లభిస్తుంది. అయినప్పటికి మా దేవపరివారసభ్యులను మేము కోరుకునేది ఒక్కటే వారు నిరంతరము నిష్కామసాధనలోనే తత్పరులైయుండు

గాక! ఎందుకంటే ఆత్మవైభవము నిరంతరము విస్తరిస్తుంది, మహామాయ కృప సహజముగా ప్రాప్తిస్తుంది.

## 28. అవరోధాలను గుర్తించి, జీవనశైలిని వికసింపజేసుకోండి

ఆదిశక్తి లీలాకథ అత్యంత పరమ ఆత్మకళ్యాణకరమైనది. దీని పారాయణ వలన, శ్రవణం వలన, మంత్రముల యొక్క మననము వలన శక్తి సాధకుడు చిత్తములోని కుటిలత్వము, కుసంస్కారము, కుచక్రమునుండి విముక్తి పొందుతాడు. మానవుని జీవనమునందు వచ్చే ఆపదలు, విపత్తులు మరియు అతనిని చుట్టుముట్టు సంకటములు, చికాకులు వీటన్నింటికి కారణము అతని యొక్క సంచితదుష్కర్మలే! నియంత యొక్క ఈ నియమమును తెలుసుకున్న మానవులు తమ జీవితములోని సంకట పరిస్థితులలో జగన్మాత ఆదిశక్తి భగవతీ మహామాయను శరణు వేడుతారు. ఈ సత్యము తెలియనివారు, అవగాహన లేనివారు మాత్రమే అటు ఇటు పరుగెడుతూ దెబ్బలు తింటూ ఉంటారు. ఎవరైతే తమ కష్టాలకు ఇతరులను నిందిస్తూ వారిపట్ల ద్వేషము, వైరము పెంచుకుంటూ ఉంటారో వారు తమ అంతఃకరణమును దహించుకుంటూ ఆ అగ్నిలోనే కాలిపోతారు. దానితోపాటు చెడు పనులు, కుతర్కములు, చెడు సంస్కారముల నూతన శృంఖలను నిర్మించుకుంటారు. దానివలన వారి భావి జీవితము, రాబోయే భవిష్యత్తు దట్టమైన అంధకారంలో కూరుకు పోతుంది.

ఉజ్జ్వల భవిష్యత్తును, సుఖప్రదమైన జీవితమును కోరుకునే మానవులు సత్కర్మలు అనే ఆధారమును పట్టుకునే నడవాలి. దీనికొరకు సాధనాత్మకమైన జీవితమును అలవరచుకోవాలి. అప్పుడే మానవుడు దుస్తరమైన సంకటములనుండి సునాయాసముగా బయటపడతాడు. మహామాయకు శరణాగతి చేసుకునే సాధకులు వర్తమానకాలములో మాత్రమేకాక భవిష్యత్తును కూడా స్వయముగానే బంగారమువలె సుఖప్రదంగా ఉజ్జ్వలంగా మలచుకుంటారు. దీనికోసము చక్కని స్వభావము, నిర్దోషియైన, నిశ్చలమైన మరియు పసిబిడ్డల సరళమైన మనస్సు అవసరము.

ఆదిశక్తి లీలాకథయొక్క గత సంచికలో సురథుడనే మహారాజు కథను చెప్పటం

జరిగింది. ఈ మహారాజు సురథుడు స్వారోచిష మన్వంతరమునకు చెందిన రాజు. ఆయన చైత్రవంశమున జన్మించాడు. సమస్త భూమండలము మీద ఆయన ఆధిపత్యము వహించాడు. జగన్మాత యొక్క ఈ లీలాకథ ప్రతీకాత్మకమైనదేగాక, మంత్రాత్మకమైనదికూడా అన్న సత్యమే ఇక్కడ ప్రథమంగా వక్కాణించబడినది. ఈ ప్రతీకకు అర్థముతోపాటు దీని మంత్ర సాధన విధానము కూడా తెలుపబడినది. కథాభాగాలలో ఈ రెండింటిని సుస్పష్టము చేసే ప్రయత్నము జరిగినది. ఈక్రమంలో సురథుడు అనే మహారాజు మానవుని జీవాత్మకు ప్రతీక. ఆ రాజు ఆధిపత్యము సంపూర్ణమైన దేహరాజ్యము మరియు మనో రాజ్యముల మీద ఉంటుంది. జీవాత్మవద్ద పుణ్యసంపద ఉన్నంత వరకు అతని పాలన నిష్కంటకముగానే సాగుతుంది. కానీ పుణ్యాత్మకుడగు జీవాత్మతోపాటు కొంత పాపము, దుష్కృతము కూడా వెంటవస్తుంది. ఇదే వాని అంతఃకరణములో ప్రమాదమును కలిగిస్తుంది. దీని ప్రభావము వలన వాని చేతన యొక్క చైతన్యము శిథిలమౌతుంది. అప్పుడు అతనిమీద సాధనయొక్క శత్రువులు ఆక్రమణ చేస్తారు. ఈ తత్త్వమే మంత్రమయమైన లీలాకథ తరువాతి మంత్రములో తెలుపబడినది.

**తస్య పాలయతః సమ్యక్ ప్రజాః పుత్రానివౌరసాన్ ।**
**బభూవుః శత్రవో భూపాః కోలావిధ్వంసినస్తదా ॥ (1/1/5)**

ఆ కాలంలో రాజులు ప్రజలను తమ కన్నబిడ్డవలె పాలించే వారు. మహారాజు సురథుని యొక్క 'కోలా' నగరమును ధ్వంసం చేయు క్షత్రియరాజులు ఆయనకు శత్రువులుగా మారారు.

ఆదిశక్తి లీలాకథలోని ఈ కథ మంత్రములలో ఇతిహాస పురాణముల యొక్క అనేక సంకేతాలు అందించబడినవి. వీటితోపాటు ఇందులో ఎన్నో ఆధ్యాత్మిక రహస్యములు కూడా ఇమిడి ఉన్నాయి. ఈ రహస్యములను ఆ శక్తులను సాధన చేసే సాధకుడు తన సాధనాక్రమంలో సాక్షాత్కరింపజేసుకుంటాడు. ఈ విషయము చరిత్రపరంగా చూస్తే 'కోలా విధ్వంసి'. ఇది ఒక విశేషమైన క్షత్రియకులానికి సంబంధించిన సంకేతము. దక్షిణ భారతదేశములో కోలానగరము ప్రసిద్ధిచెందినది. ఈ నగరము ప్రాచీనకాలంలో ఒక రాజ్యమునకు రాజధాని. ఏ క్షత్రియులైతే ఈ నగరము మీద అక్రమణ చేసి దానిని ధ్వంసము గావించారో వారే కోలావిధ్వంసి

అని పిలువబడ్డారు. ఈ సత్యమే కాకుండా శ్రీదుర్గాసప్తశతి యొక్క భాష్యకారులు ఈ మంత్రములలో గల 'కోలావిధ్వంసినః' అనే శబ్దమునకు పలు అర్థములను ఉటంకించారు. 1. కోల అనగా వరాహము. అనగా రాజు పందిని చంపి దాని మాంసమును తింటాడు. 2. 'కోలా' అను నగరము రాజా సురథుని రాజ్యమునకు రెండవ రాజధాని. దానిని ధ్వంసము గావించిన రాజు. 3. 'కోలా' ఒక ప్రత్యేకమైన ఆయుధము. దీని ద్వారా కోలావిధ్వంసినః అనే పదమునకు అర్థము కోలా అను శస్త్రముతో విధ్వంసము గావించిన రాజు అని తెలియవస్తుంది.

ఈ చిన్న చిన్న వివరణలేకాకుండా 'బ్రహ్మావైవర్త పురాణము' లోని ప్రకృతి ఖండమునందు దుర్గ ఉపాఖ్యానం ఉన్నది. ఇందులో మహారాజు సురథుడు కోలానగరిని ముట్టడించాడు అని వర్ణించబడి ఉన్నది. **కోలాం చ వేష్టయాభాస సురథస్య మహామతేః (62/3).** శ్రీదేవీభాగవత మహాపురాణములో కోలావిధ్వంసి అనే పర్వతనివాసులు అందరు మ్లేచ్ఛులు. **మ్లేచ్ఛాః పర్వత వాసినః ప్రాప్తః (5/32/79)** ఈవిధంగా భిన్నభిన్న అభిప్రాయములేకాక అమ్మ సంతానమైన శక్తి సాధకులకు తమ యొక్క ఆధ్యాత్మిక అనుభవము కూడా ఉన్నది. దీని ప్రకారంగా **కోలావిధ్వంసిః** అంటే జీవాత్మ యొక్క మొత్తము కులాన్ని పాడుచేసే శత్రువులు. జీవాత్మ యొక్క పూర్తి సాధనకు అనివార్యమైనవి సద్గుణములు. అవి వివేకము, వైరాగ్యము, తపస్సు, తితీక్ష, భక్తి మరియు ముముక్షత్వము. ఈ గుణములేకాక సాధకుని అంతఃకరణములో సాత్వికత నుండి ఉత్పన్నమైన అన్ని సద్గుణములు కూడా నిండి ఉంటాయి. ఈ సద్గుణములన్నీ కూడా నిజంగా జీవాత్మ యొక్క నిర్మలమైన వెలుగు యొక్క కిరణములు. వీటివల్లనే ఇది కాంతివంతమై ఉన్నది.

జీవాత్మ తన సామర్థ్యముతోనే తన ఆత్మరాజ్యమును, మనోరాజ్యమును, దేహరాజ్యమును సంచాలనము చేస్తుంది. ఒకవేళ ఏదో ఒక శక్తి ఈ సద్గుణములను ధ్వంసము చేస్తే ఆత్మ రాజ్యము ఛిన్నాభిన్నమైపోతుంది. ఇలా ఎందుకు జరుగుతుంది అనే కారణములను విశ్లేషిస్తే, వివేచన చేస్తే జీవాత్మకు తన సాత్వికత, పుణ్యము, సత్కర్మలు, సద్గుణములపట్ల అహంకారము పెరిగింది అన్న విషయము అర్థమవుతుంది. జీవాత్మయొక్క కులాన్ని శత్రువులు ఆక్రమణ చేయటానికి ఉపయోగపడే ఛిద్రము ఇదే. భ్రాంతితో పుట్టిన ఈ అహమే జీవాత్మ కులాన్ని, కోలానగరమును నాశనము గావిస్తుంది. ఈ వినాశనము నుండి బయటపడాలంటే

కేవలము ఆదిశక్తి జగనాత్మ యొక్క కృప అవసరము. ఆమెకు శరణాగతి చేసుకుంటే ఈ కోలావిధ్వంసులను నశింపజేయుట సంభవమే.

భగవతిపట్ల విముఖుడైన జీవాత్మ తన ఆత్మకళ్యాణము నుండి విముఖుడౌతాడు. అతడు జన్మజన్మల వరకు పుణ్యము, పాపము, సత్కర్మ, దుష్కర్మల జంజాటములో చిక్కుకుని తిరుగుతూ ఉంటాడు. ఒకప్పుడు అతనికి తన సామర్థ్యము మీద గర్వముంటుంది. మరోప్పుడు సామర్థ్యము ఉండికూడా పరాజయముపాలగుట సంభవిస్తుంది. జీవాత్మకు ప్రతీకయైన సురథుని స్థితి ఇది. అతను నీతిగల ప్రజా పాలకుడు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించేవాడు. నీతివంతుడై, ధర్మపరాయణత కలిగి ప్రజలను కన్నబిడ్డలవలె పాలిస్తున్నా కూడా అతనిలో అహంకారము, అభిమానము ఉన్నాయి. అతడు పుణ్యాత్ముడైన అహంభావి. అదే అతని పరాభవానికి, పరాజయానికి, పతనానికి కారణమైనది. నీతివంతుడగుట, పుణ్యపురుషులగుట, నిరంతరం సత్కర్మలను చేయుట శుభప్రదము, శ్రేష్ఠము అనేది నిజమే, కానీ జగన్మాతపట్ల భక్తి లేకపోతే ఆ శ్రేష్ఠత నిశ్చయంగా కోలావిధ్వంసులను ఆహ్వానిస్తుంది. మహారాజైన సురథునికి పట్టిన గతే అందరికీ పడుతుంది. దీనినుండి బయటపడటానికి ఆదిశక్తి జగన్మాతను స్మరించాలి.

ఈ శ్లోకమంత్రములలో ఐతిహాసిక, పౌరాణిక, ఆధ్యాత్మిక సత్యముతోపాటు ఒక మంత్రపరమైన సత్యము కూడా ఉన్నది. దీనికి ప్రత్యేకమైన సాధనావిధానము కూడా ఉన్నది.

## సాధనా విధానము

**వినియోగః ఓం అస్య శ్రీ 'తస్య పాలయతః' ఇతి సప్తశతీ పంచమ మన్త్రస్య శ్రీబ్రహ్మాఋషిః, శ్రీమహాలక్ష్మీదేవతా, ప్రీం బీజమ్, చూడామణి శక్తిః, లక్ష్మీమహావిద్యా, సత్త్వగుణః, నేత్ర జ్ఞానేన్ద్రియం, సౌమ్యరసః, కర కర్మేన్ద్రియం, మధ్యమ స్వరం, జల తత్త్వం, ప్రతిష్ఠా కళా, శ్రీం ఉత్కీలనం, మోహినీముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ క్షమహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ-లోమ-విలోమ పుటితోక్త పంచమ మంత్ర జపే వినియోగః ॥**

## న్యాసః

| కరన్యాసః | షడంగన్యాసః | |
|---|---|---|
| ఓం ఐం హ్రీం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| ఓం నమో నమః | తర్జనీభ్యాం నమః | శిరసే స్వాహా |
| తస్య పాలయతః | సమ్యక్ మధ్యమాభ్యాంనమః | శిఖాయైవషట్ |
| ప్రజాః పుత్రానివౌరసాన్ | అనామికాభ్యాంనమః | కవచాయహుమ్ |
| బభూవః శత్రవో భూపాః | కనిష్ఠికాభ్యాంనమః | నేత్రత్రయాయవౌషట్ |
| కోలావిధ్వంసినస్తదా | కర-తల కరపృష్ఠాభ్యాంనమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

కాన్త్యాకాఞ్చన సన్నిభం హిమగిరి ప్రఖ్యైశ్చతుర్భిర్గజైః ।
హస్తోత్క్షిప్త హిరణ్యామృత ఘటైరాసిచ్య మానాం శ్రియమ్ ॥
విభ్రాణాం వరమబ్జ యుగ్మమభయం హస్తైః కిరీటోజ్జ్వలామ్ ।
క్షౌమాబద్ధ నితమ్బ బిమ్బ వలితాం వన్దేఽరవిన్ద స్థితామ్ ॥

## మంత్రం

ఓం ఐం హ్రీం నమః
తస్య పాలయతః సమ్యక్ ప్రజాః పుత్రానివౌరసాన్ ।
బభూవః శత్రవోభూపాః కోలావిధ్వంసినస్తదా ॥
నమో హ్రీం ఐం ఓం ॥ 5 ॥

1000 జపాత్ సిద్ధిః దశాంశ పాయస హోమః ।

గాయత్రీ మహామంత్ర జప 10,000, గాయత్రీ విధానేన దశాంశ హోమః ॥

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈవిధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత దశాంశ హోమము, హవనము చేయాలి.

**దీనికి ఆధ్యాత్మిక ఫలశృతి:** ఆధ్యాత్మిక సాధనకు అడ్డువచ్చే అవరోధాల పట్ల జాగరూకత.

**లౌకిక ఫలితము:** రహస్య శత్రువులను గుర్తించుట.

గాయత్రీ సాధనా విధానముతో కలిసిన ఈ సప్తశతీమంత్రము తన విలక్షణమైన ప్రభావమును చూపిస్తుంది. దీని ప్రభావము వలన సాధకునిలో ఒక అద్భుతమైన జాగృతి కలిగి దోషములను, లోటుపాట్లను, ముఖ్యంగా సాధనలో వచ్చే అవరోధాలను గుర్తించేలా చేస్తుంది. ఆధ్యాత్మికదృష్టితో చూస్తే ఇదేమీ సామాన్యమైన లాభము కాదు, చాలా పెద్ద లాభము. ఎందుకంటే సాధకుడు సాధారణంగా తన సాధనా విధానాలను, సంపూర్ణ కర్మకాండను పూర్తి చేసికూడా దాని ఫలితము పొందకుండా వంచించబడతాడు, దీనికి కారణము సాధనను, సఫలతను సాధనయొక్క అవరోధక తత్త్వాలు నశింపజేస్తూ ఉంటాయి. ఈ కారణముగానే దీర్ఘకాలం వరకు చేసే సాధనలు కూడా సముచితమైన ఫలితాలను ఇవ్వక పోవడం కనిపిస్తుంది. సాధకులు తమ సాధనలోని అవరోధాలను గుర్తించి వాటిని తొలగించుకోలేక పోవడమే దీనికి కారణము. దుష్టులవలన, దుర్జనులవలన, చెడు సహవాసముల వలన జీవితంలో అపజయాలు అడ్డు ఆపు లేకుండా వస్తాయి. దీనివలన కలిగే లాభాలు మాత్రము పొంచి ఉన్న దుర్జనుల చేత చిక్కి నశించి పోతుంటాయి. వీటిని గనుక గుర్తించగలిగితే ఒక నూతన జీవన విధానము వికసింపజేసుకొన వచ్చును. దాని ఫలితము శుభకరంగా, సౌభాగ్యవంతంగా ఉంటుంది. అందుచేత జగన్మాత ప్రియ సంతానము నిష్కామ భావనతోనే తమ సంపూర్ణసాధనను చేయవలసి ఉంటుంది.

# 29. బయట, లోపల ఉన్న శత్రువులను గుర్తించండి

ఆదిశక్తి లీలాకథ యొక్క సూత్రములలో ఆధ్యాత్మిక విద్య యొక్క తత్త్వములు గుదిగ్రుచ్చబడి ఉన్నాయి. ఇందులో సాధనలోని సమర్థవంతమైన విధివిధానములు, నియమాలు మరియు సాధన యొక్క అనుభవములు పొందుపరచబడి ఉన్నాయి. వీటితోపాటే దీనిలోని అక్షరము అక్షరములోను భగవతీమాత అహైతుక కృప నిండి ఉన్నది. శిశువుకు ఏవిధంగా మాతయే సమస్తంగా ఉంటుందో, అదే రీతిలో శక్తి సంతానమునకు, శక్తి సాధకులకు శ్రీదుర్గాసప్తశతియే సమస్తం అయి ఉన్నది. శిశువు

తన పోషణ కొరకు, ఔషధముల కొరకు, సేవ కొరకు, ఆహారం కొరకు, మనో రంజనము కొరకు మరియు చిన్నాపెద్దా అవసరాల కొరకు, కేవలము తన తల్లికొరకు ఎదురుచూస్తూ ఉంటుంది. ఆమె మీదే అన్నింటికి ఆధారపడి ఉంటుంది. శిశువు అయాయకురాలు, శిశువుకు తన మాతృమూర్తిని 'అమ్మా' అని సరిగ్గా పిలవడము కూడా రాదు. శిశువు కేవలము తన తల్లిని చూడగలదు, ఏడవ గలదు. శిశువు భావనలతో గాఢ అనుబంధాన్ని పెనవేసుకున్న ఆమె తల్లి తన సంతానము యొక్క సంవేదనల సూక్ష్మతను గుర్తించగలదు. ఆమె బిడ్డ అవసరాలను తీర్చటములోను, బాధను నివారించుటలోను ఏవిధమైన పొరపాటును చెయ్యదు.

సామాన్య తల్లులతో పోలిస్తే జగన్మాత మహామాయ మరింత అధిక మమతామయిగా దర్శనమిస్తుంది. దేవి తన సంతానం యొక్క సంవేదనలతో సదా సుపరిచితయై ఉంటుంది. తనను స్మరించినంతమాత్రము చేతనే ఆ దేవి సంకటముల నన్నింటిని క్షణములో నివారిస్తుంది. ఈ మాటలు కేవలము ఒక కల్పన లేక ఒక ఆలోచనాధార కాదు. ఇవి భవానీమాత భక్తుల యొక్క యుగయుగాల అనుభూతులు, ఆ లీలలను అసంఖ్యాక జనులు ఈనాడు కూడా మననము చేసుకుంటున్నారు. ఆదిజనని దుర్గామాత వారికొరకు జీవితములోని అన్ని వ్యవస్థలను సహజముగానే ఏకత్రాటిపైకి తెస్తుంది. ఆ మాతయే వారి కష్టముల నన్నింటిని నివారిస్తుంది. ఆ జగన్మాతయే వారికి సద్వివేకమును అనుగ్రహిస్తుంది. దేవీ భగవతి వారి హృదయాలలో సత్కర్మలకు ప్రేరణగా నిలుస్తుంది. మహామాయయే వారికి ఆధ్యాత్మిక విద్య అధిష్ఠానదేవతగా రూపుదాలుస్తుంది. నిజముగానే మాత ఆదిశక్తి తన సంతానము యొక్క పోషణ, ఔషధులు, సేవ, సన్మార్గమును ప్రసాదించే సమస్త బాధ్యతలను వహిస్తుంది. ఇవన్నీ పొందటానికి మాత సంతానము చెయ్యవలసినది ఒక్కటే. 'అమ్మా' అని ఆ జగన్మాతను స్మరిస్తూ ఉండటమే! శ్రీదుర్గాసప్తశతిలోని 700 శ్లోకములలోను 'అమ్మా' అన్న ఈ రెండక్షరాల మహిమయే గానము చెయ్య బడినది.

ఆదిశక్తి లీలాకథ యొక్క గత సంచికలో ప్రథమచరిత్రకు చెందిన ప్రథమ అధ్యాయములోని ఐదవమంత్రము యొక్క లోతైన రహస్యములను వెలుగులోకి తేవటము జరిగినది. అందులో ఇలా చెప్పబడి ఉంది. 'ఆ కాలములో దేశ ప్రజలను కన్నబిడ్డలవలె భావించి సముచిత రీతిలో పరిపాలన సాగిస్తూ ఉన్న సురథ మహారాజు

కోలానగర రాజ్యమును కోలావిధ్వంసులు నాశనం చేశారు, వారు ఆయనకు శత్రువులుగా మారారు. చైత్ర వంశోద్భవుడైన ఈ రాజు సమస్త సద్గుణములకు నిలయుడు. ఆ రాజు వీరుడు, ప్రతాపవంతుడు, ప్రజాపాలకుడు. అయినప్పటికి అతనిమీద కోలావిధ్వంసులు ఘోర ఆక్రమణ గావించారు. సాధనా నిరతులైనవారిమీద అనేక ఆక్రమణానుభూతులు కలుగుతూనే ఉంటాయి. సాధకుని జీవితములో విపత్తులు సర్వవేళలా అతని జీవన సహచరులై ఉంటాయి. అడుగడుగునా అతను మహా సంకటములను ఎదుర్కొనవలసి వస్తుంది. ఎందుకంటే భక్తుడు తన తల్లి ఆరాధన సఫలతాపూర్వకముగా చేస్తూ ఉంటాడు కనుక ఒకవేళ సాధకుని జీవితములోను, సాధనలోను కష్టములు వచ్చినా, ఆ సమయములో ఆ ఆరాధనా ప్రభావము చేత ఆ కష్టములు అతనికి వరదానమును ప్రసాదించే అవకాశములుగా పరిణమిస్తాయి. ఈ క్రమములో జీవాత్మ భగవతిని విస్మరించి ప్రాపంచిక దిశగా, సంసారసాగర దిశగా ముందుకు సాగినప్పుడు లోటు కనిపిస్తుంది. ప్రాపంచిక సంసారసాగర బంధనములనే మోహపాశములలో చిక్కుకున్నప్పుడు అతి బలవంతుడైన సాధకుడైనప్పటికి కూడా అతను పరాజయము పాలుకావల్సిందే!

ఈ కథాసూత్రములో ఆదిశక్తి లీలాకథ యొక్క తరువాతి మహామంత్రము గుదిగ్రుచ్చబడి ఉన్నది.

**తస్య తైరభవద్ యుద్ధమతిప్రబలదణ్డినః ।**
**న్యూనైరపి స తైర్యుద్ధే కోలావిధ్వంసిభిర్జితః ॥ (1/1/6)**

**అర్థము : అత్యంత బలిష్ఠులను కూడా దండించగలిగే ఆ సురథునికి, మ్లేచ్ఛరాజులకు మధ్య యుద్ధము సాగింది. ఆ రాజులు సంఖ్యలో తక్కువ ఉన్నప్పటికి సురథమహారాజు పరాజితు డాయెను!**

ఆదిశక్తి లీలాకథ పావనమంత్రములో ఆధ్యాత్మికసాధన యొక్క నిగూఢమైన తత్త్వ నిరూపణ ఉన్నది. ఈ మంత్రము యొక్క శబ్దార్థమును ఆకళింపుజేసుకున్నచో ఇలా అవగతమౌతుంది. 'మహారాజు సురథుడు ప్రబలమైన శత్రువును మరియు ప్రబలమైన దండమును ధరించినవాడిని దండించుటలో సమర్థుడైనప్పటికి అతను మిత సంఖ్యాకులైన కోలావిధ్వంసులతో, వారు అల్ప సైన్యమును కలిగి ఉన్నప్పటికి వారి చేతిలో ఓటమిపాలయ్యాడు' అని మాత్రమే తేటతెల్లమౌతుంది. ఈ సత్యము

యొక్క ఆధ్యాత్మిక రహస్యము లోతుల్లోకి తొంగిచూసినచో నిజానికి ఈ ఓటమి సమర్థుడైన సాధకుని పరాజయమే! సాధనా జీవితములోని ఎటువంటి సత్యమంటే అది సామాన్యము మరియు ఉచ్చస్తరీయములనబడు రెండు రకములైన సాధకుల జీవన యానములో ఇటువంటి పరాజయం తొంగిచూస్తూనే ఉంటుంది. తమ సమర్థవంతమైన తపోబలము ఉన్నప్పటికి కూడా వారు ఓటమిని చవిచూడవలసి వస్తుంది. తమకు అంతర్దృష్టి-దివ్యదృష్టి మరియు రిద్ధి-సిద్ధులు మరియు విభూతుల అనంత శక్తి-సామర్థ్యములు ఉన్నప్పటికి ఓటమిని అంగీకరించవలసి వస్తుంది.

అలా ఎందుకు జరుగుతుందంటే సాధకునికి తన సాధనా సామర్థ్యము మీద నమ్మకము పెరుగుతుంది. తనను ప్రేమిస్తున్నానని చెప్పేవారితో, తమని ప్రేమించమని కోరేవారితో తాను, తన సర్వస్వమును త్యాగము చేశానని చెబుతుంటాడు. అయితే ఆ మాటలలో దాగి ఉన్న సత్యము మరొకటి!!

అనుభవజ్ఞులకు ఈ విషయము తెలుసు. అటువంటి అనుభవజ్ఞుల అనుభవము ద్వారా పరీక్షల తర్వాత తేలిన సత్యమేమిటంటే 'సాధకునికి తనసాధనా సామర్థ్యము మీద పెట్టుకునే భరోసానే నిజానికి అతని అస్తిత్వములో అహంకార బీజానికి అంకురార్పణ గావిస్తుంది. అది ఎంతో సాత్వికమైనదే అగుగాక! కానీ చివరికి అది వినాశకారకమే అవుతుంది. సాధన ఎంత సాటిలేనిది, ఎంత లోకోత్తర ఖ్యాతిగాంచి నప్పటికి, సాధకుడు ఎంత సమర్థుడైనప్పటికి వాస్తవానికి అది ఆ దివ్యజనని యొక్క పరమ సామర్థ్యములోని అనంతమైన అంశములో ఒక నగణ్యమైన అంశమే అవుతుంది. ఈ అఖిల బ్రహ్మాండ సృష్టిలో మహామాయయే సర్వసమర్థురాలు! ఇతర జనుల వద్ద ఆ మాత ప్రసాదించిన ఒక్క స్వల్ప అంశ మాత్రమే ఉంటుంది.

ఈ ప్రకారముగా ఆధ్యాత్మిక సాధకుని జీవనములో వ్యక్తిగత సంబంధాలకు స్థానమేమీ ఉండదు. నా భర్త, నా భార్య, నా పుత్రుడు లేక నా పుత్రిక ఇవన్నీ లోకవ్యవహారమునకు సంబంధించినంతవరకు సరియైనవే! అయితే ఈ అనుభూతి సాధకుని ఆంతరిక భావనలలోకి చొరబడినచో అది సదా సర్వదా వినాశకారకమే అవుతుంది. సాధకుని ఆంతరిక చేతనలో 'నేను నా మాతృదేవి సంతానమును! ఆ విశ్వజననియే నా సర్వస్వము! నా సర్వస్వము మీద ఆమెకే సర్వాధికారమున్నది! మిగిలినదంతా ఆ మాత లీలచేత సంస్కారవశంగా, కర్మవశాత్తు సంభవిస్తున్నది!

కాలానికి వశమై, కర్మకు అధీనమై జతకూడిన ఈ సంబంధాలన్నీ కర్మపరిపక్వమైన వెంటనే కాలము ద్వారా చేయబడే మార్పుతో పాటు నశించిపోతాయి!' అన్న భావన ఎల్లప్పుడు మనస్సులో మెదులుతూ, బలపడుతూ ఉండాలి. ఈ సత్యము బోధపడనివారిని అహంకార, మమకారములు రెండు కూడా తమ వశములో పెట్టుకుంటాయి. ఈ **'నేను-నావి' అనేవి మహామాయ యొక్క మాయారూపాలు.** అవే సురథమహారాజును వశపరచుకున్నాయి.

ఇలా మహారాజు సురథుడైనా లేక మరెవరైనాసరే వారు కోలావిధ్వంసుల చేతిలో ఓటమిని అంగీకరించవల్సినదే! ఎందుకంటే **అహంకార, మమకారాలు సాధకుని వివేకమును హరించివేస్తాయి, నశింపజేస్తాయి.** వివేకరాహిత్యంచేత అహంకారం మనిషిని అంధుడిని చేస్తుంది. మమత అనేది మాయ యొక్క భ్రాంతి మార్గాలను నిర్మిస్తుంది. ఈ స్థితికి లోనైన సాధకులు పరమ సమర్థులైనప్పటికి తమ సామర్థ్యమును సద్వినియోగపరచుకొనలేరు. అయినా ఆత్మసాధనా కులమును నష్టపరిచే శత్రువులు అల్పసంఖ్యాకులైనప్పటికి కూడా విజయమును వరిస్తారు. ఎందుకంటే ఏవిధంగా అయితే జూదగాని ధనరాశిని మరెవరో కాక, స్వయముగా అతని జూదప్రవృత్తే నశింపజేయుటలో సమర్థమైనదో, ఇదీ అటువంటిదే! సమస్త ధనం, మహా సామ్రాజ్యం కూడా ఈ ఒక్క చిన్న జూదక్రీడలో పణముగా పెట్టబడ్డాయి. నలమహారాజు మరియు యుధిష్ఠిరుని పురాణగాథలు ఈ విషయమునే ప్రమాణీకరిస్తున్నాయి. మహాతాపసులైన ఋషులను కూడా ఈ అహంకార, మమకారాలు ఎన్నోమార్లు పతనము గావించాయి. నూతన సృష్టి సంరచనలో సమర్థుడు, ప్రచండ తపోబల సంపన్నుడు అయిన విశ్వామిత్రుడు కూడా ఈ కారణముచేత ఎన్నోమారులు పరాజయం చూడవలసి వచ్చింది. ఇందువలన ఆత్మసాధన నష్టపరిచే వృత్తులు తక్కువగా ఉన్నప్పటికి కూడా సాధకుడిని పరాజితుడిని కావించుటలో సమర్థవంతమైనవే!

ఈ శ్లోకమంత్రము యొక్క ఆధ్యాత్మిక-దార్శనిక సత్యముతో పాటు ఆ మంత్రములో దాగిన సత్యము ఇవ్వబడినది.

## సాధనా విధానము

వినియోగము: ఓం అస్య శ్రీ "తస్య తైరభవద్ యుద్ధం" ఇతి సప్తశతీ షష్ఠ మన్త్రస్య శ్రీవేదవ్యాస ఋషిః, శ్రీవామాకాళీ దేవతా, హ్రాం బీజం, జ్వాలాముఖీశక్తిః, శ్మశానకాళీ మహావిద్యా, తమోగుణః, ఘ్రాణజ్ఞానేన్ద్రియం, ఉగ్రరసః, కరకర్మేన్ద్రియం, తీవ్ర స్వరం, అగ్నితత్త్వం, నివృత్తి కళా, క్రీం హ్రీం ఉత్కీలనం, ప్లావనీ ముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యమభి వృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణా యోగమాయా భగవతీ శ్రీ మహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ వాగ్బీజ స్వబీజ లోమ విలోమ పుటితోక్త షష్ఠ మన్త్రజపే వినియోగః ॥

### న్యాసః

| కరన్యాసము | షడంగన్యాసము | |
|---|---|---|
| ఓం ఏం హ్రాం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| ఓం నమోనమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| తస్య తైరభవద్ యుద్ధం | మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| అతిప్రబల దణ్డినః | అనామికాభ్యాం నమః | కవచాయహుమ్ |

న్యూనైరపి స తైర్యుద్ధే కనిష్ఠికాభ్యాం నమః నేత్రత్రయాయ వౌషట్

కోలావిధ్వంసిభిర్జితః కరతలకర పృష్ఠాభ్యాం నమః అస్త్రాయఫట్

### ధ్యానం

మేఘాఙ్గీ శశిశేఖరాం త్రినయనామానన్ద సంవర్ద్ధినీమ్ ।
నగ్నాం వా నృకరాం వరాం శవ శివారూఢాతి తీవ్రా రతిం ॥
కలాస్యావృత్యాంకుశం ప్రమథతీం సవ్యే హ్యామీతిం వరమ్ ।
దక్షాధోర్ధ్వ కరామ్బుజే నరశిరః ఖడ్గం వహన్తీం భజే ॥

### మంత్ర

ఓం ఏం హ్రాం నమః తస్య తైరభవద్ యుద్ధమతిప్రబలదణ్డినః ॥
న్యూనైరపి స తైర్యుద్ధే కోలావిధ్వంసిభిర్జితః ॥
నమో హ్రాం ఏం ఓం ॥ **6** ॥

**1000 జపాత్ సిద్ధిః దశాంశ తిల ఘృత హోమః గాయత్రీ మహామంత్రజప 10,000, గాయత్రీ విధానేన దశాంశ హోమః** గాయత్రీమహామంత్రజపం 10,000 చెయ్యాలి. గాయత్రీ విధానమును అనుసరించి నువ్వులు, నెయ్యిని కలిపి అందులో పదవవంతు హోమము చేయాలి.

10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము । ఈవిధంగా పదిదినములు అనుష్ఠించి, ఆ తరువాత ప్రతిఒక్క దానికి దశాంశముతో ప్రత్యేక హోమము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** ఆధ్యాత్మిక సాధనలో ఎదురయ్యే విఘ్నములను తొలగించుకునే సమర్థవంతమైన జ్ఞాన ప్రాప్తి.

**లౌకిక ఫలశృతి:** తన ఆంతరిక మరియు బాహ్య శత్రువులను గుర్తించే శక్తి ఒనగూడుట.

గాయత్రీమహామంత్ర సాధన చేత ఈ సప్తశతీ మంత్రసాధన కొద్ది సమయము లోనే తన అమోఘమైన ప్రభావమును చూపిస్తుంది. దీని ప్రభావముచేత సాధకుడు స్వయముగా తనలో ఎంత శక్తి సామర్థ్యములను వికసింపజేసుకుంటాడంటే తద్వారా సహజముగానే అతనికి తన అంతర్యాత్రలో ఎదురయ్యే అవరోధములు బోధపడతాయి. వాస్తవానికి అవి అతనితో మిత్రత్వపు పరదామాటున దాగి శత్రుత్వమును నిభాయించే ప్రయత్నము సాగిస్తూ ఉంటాయి. ఉపాసనా బలము చేత బాహ్య జీవితములో కూడా అతను వాటి మారువేషాలను గుర్తించ గలుగుతాడు. ఒక్కమారు వాటి నిజస్వరూపమును గుర్తించ గలిగినట్లయితే ఆదిశక్తి విశ్వజనని కృపచేత వాటిమీద గల మోహం కూడా పటాపంచలైపోతుంది. తత్కారణముగా అతని జీవనయాత్ర సహజముగాను, సుగమముగాను సాగిపోతుంది. అతని ఆధ్యాత్మిక మార్గము కూడా కాంతులీనుతూ ప్రశస్తమౌతుంది. కేవలము సాధనా జనులు మాత్రమే ఈ విధానమును స్వీకరించి దానిని అనుభూతి చెందగలరు. ఎందుకంటే సాధనా విధానములు తన సామర్థ్యమును క్రియాన్వితము కావించుకున్న తరువాతే ప్రత్యక్షానుభూతి కలుగజేస్తాయి. సాధనామయ జీవితమే శబ్దాలను మంత్రశక్తిగా మార్చగలదు.

# 30. సాధనలో రాబోయే అవరోధాలను గుర్తించండి

ఆదిశక్తి లీలాకథలో ఆధ్యాత్మిక విద్య యొక్క నిగూఢమైన, లోతైన రహస్యములు చాలా సహజముగా ప్రకటీకరించబడి దర్శనమిస్తాయి. బోధపడని అంతులేని సత్యాలను అనేక యుగాలకు చెందిన శ్రేష్ఠతములైన దార్శనికులు, మహామహులైన ఆచార్యులు కాలానికి నిలువగలిగే తమ గ్రంథాలలో బహు కష్టముతో అసంపూర్ణముగా, సగంసగమే చెప్పగలిగారు. లీలా పురుషోత్తములైన యోగిజనుల ఆరాధ్యుడు, ఈశ్వరుడు అయిన శ్రీకృష్ణభగవానుడు తమ భగవద్గీత బోధలో ఆ రహస్యాలను ఇలా వ్యాఖ్యానించారు. కొంతమంది మహాపురుషులు దుర్లభమైన ఈ ఆత్మతత్వమును ఆశ్చర్యంగా చూస్తారు, ఇంకొంతమంది దీని తత్వమును ఆశ్చర్యముతో వర్ణిస్తారు. మరికొంతమంది దీనిని గురించి వినికూడా ఏమీ తెలుసుకోలేరు. (గీత 1/19) అటువంటి దుర్లభ, జటిల సత్యము, తత్వము ఆదిశక్తి లీలాకథలో బహు సరసంగా, రోమాంచితముగా మరియు సహజధోరణిలో వర్ణించ బడినది. మాత భగవతి లీలా ప్రసంగాల ద్వారా బహు సుగమముగా, బాగా అర్థమయ్యే రీతిలో ఈ రహస్యముల ప్రకటీకరణ జరిగింది.

అసలు అలా ఎందుకు జరుగకూడదు? తల్లిని మించిన గురువు లేరు, ఆమెను మించిన ఆచార్యులు లేరు. జన్మధాత్రి అయిన జనని కేవలము ఈ జన్మను ఇవ్వటమేకాదు, జీవించే కళను కూడా నేర్పుతుంది. జీవితములోని చిన్న చిన్న విషయాలు మొదలుకొని అతి పెద్ద రహస్యాల శిక్షణను అతి తేలికగా ఇవ్వటం మాతకు చాలా సులభమైన విషయము! ఆమె ఒక్కతియే తమ బిడ్డల అంతశ్చేతనలో సుసంస్కారాల రూపములో జీవనవిద్యా రహస్యముల బీజారోపణను గావిస్తుంది. మహామహుడైన ఆచార్యుడు సైతము క్రియాత్మక ఆలోచనల తలము మీద మాత్రమే జీవితపు లౌకిక మరియు ఆధ్యాత్మిక రహస్యాల శిక్షణ ఇవ్వగలుగుతాడు. అయితే తల్లి తన బిడ్డకు ఇవి బోధించినప్పుడు ఆమె బోధన క్రియాత్మక ఆలోచన స్థాయిలోనే కాక సంస్కారముల తలము మీద కూడా సాగుతుంది. ఇందుచేతనే తల్లి ఆదిగురువు, ఆది ఆచార్యుడు అని కొనియాడబడినది. యుగ యుగాలుగా ఈ సత్యము అనుభవములోకి వస్తూనే ఉన్నది. భవిష్యత్తులోని అనేక యుగాలలో కూడా ఇది అనుభూతిలోకి వస్తూనే ఉంటుంది.

మా మనస్సు, మా అనుభవాలను ఈ పంక్తుల ద్వారా గొప్ప భరోసాతో, అనంతమైన విశ్వాసముతో ప్రియమైన పాఠకులతో పంచుకోవాలనుకుంటోంది. తమ ఆధ్యాత్మిక జిజ్ఞాసలకు సముచితమైన సమాధానము పొందలేనివారు, ఆధ్యాత్మిక ప్రగతికొరకు ఉచిత మరియు ఆవశ్యకమైన మార్గదర్శనం కావలసినవారు లేదా 'మా అంతశ్చేతన మరియు భావచేతనలు దారితప్పి గందరగోళములో చిక్కుకున్నాయని, ఇరుక్కున్నాయని మేము భావిస్తున్నాము' అని అనుకునేవారు, వీరందరు ఎక్కడికో వెళ్ళనక్కర్లేదు. మాత ఆదిశక్తి శరణుజొచ్చితే చాలు! మహాత్ములు, ఫకీరులను వెదుకకండి! మఠాలను, ఆధ్యాత్మిక సంస్థలను వెతుకుతూ తిరుగాడకండి! మన జన్మదాత్రి అయిన తల్లికి కూడా జన్మ నిచ్చిన దివ్యమాతను కేవలము మన శరీరానికే కాదు, మన ఆత్మకు కూడా మాతయైన ఆ పరదేవతను ఆర్తితో పిలవండి చాలు! అంతేగాక గాయత్రీమంత్ర సంపుటీకరణతో శ్రీదుర్గాసప్తశతీ పారాయణ అనుష్ఠానమును ఆరంభించండి. తక్కువలో తక్కువ 1108 పారాయణలు పూర్తి చెయ్యండి. నిత్యం ఒక పారాయణ పూర్తయినా చాలు, రమారమి మూడు సంవత్సరములలో ఈ 1108 పారాయణల అనుష్ఠానము పూర్తవుతుంది. తత్ఫలితముగా లభించే ఉపలబ్ధులు, చేకూరే లాభాలు నిశ్చయముగా చమత్కార వంతమైనవి, ఆశ్చర్యకరమైనవిగా దర్శనమిస్తాయి.

ఈ పారాయణ సాధన పూర్తవుతూ అవుతూ ఉండగానే స్వప్నముల మాధ్యమంగా ఆధ్యాత్మిక జిజ్ఞాసలకు సమాధానము లభిస్తూ ఉంటుందనేది అనుభవము వల్ల చెప్తున్నాము. అంతేకాదు, స్వయముగా అంతర్‌ప్రజ్ఞ ఎంత ప్రఖరమౌతుందంటే మీ ప్రశ్నలకు తగిన సమాధానములన్నీ స్వయముగా మీ మనస్సులోనే లభిస్తాయి. ఈ పారాయణాత్మక అనుష్ఠానక్రమంలో చాలాసార్లు సూక్ష్మలోకాలకు చెందిన దివ్యశక్తిగల ఋషులతో సహజముగానే సంపర్కమేర్పడుతుంది. వారంతా సాధకుని సాధనలో కృపా పూర్వకముగా అయాచిత సహాయమును అందిస్తారు. బాహ్య పరిస్థితులలో కూడా అందమైన, సుఖవంతమైన సుయోగములు ఒనగూడుతాయి. సత్యనిష్ఠులు–తపోనిష్ఠులు–ఈశ్వరనిష్ఠులు మరియు ఆధ్యాత్మిక తపో అనుభవ సంపన్నులైన సత్పురుషుల కలయిక భాగ్యము అతి సహజరీతిలో ఏర్పడుతుంది. దీనికొరకు బయట ఎక్కడో తిరుగవలసిన పనిలేదు. దయామయియైన మాత స్వయముగా వారిని తన సంతానము దగ్గరకు పంపుతుంది,

అంతేకాకుండా అనుష్ఠాన పరులైన వ్యక్తుల అంతర్‌భావనలలో సత్యనిష్ఠత తొంగిచూస్తే స్వయముగా భగవతి జగన్మాతయే ప్రత్యక్ష దర్శనమిచ్చి సాధకుని సాధనకు అడ్డుపడే అవరోధాలనన్నింటిని దూరం చేస్తుంది. ఇక్కడ చెప్పబడుతున్నదానిని కేవలము కల్పనగా ప్రోక్తమని భావించవలదు. కొద్దిపాటి ప్రయత్నము చేసి స్వీయానుభవముగా మలచుకోగల ఒక దివ్యానుభూతిగా భావించండి!

గురువులందరి అనుభూతులతో కూర్చబడిన ఈ పరంపరా సంచికలో ఆదిశక్తి లీలాకథ గతభాగములో ప్రథమ చరిత్రకు చెందిన ప్రథమ అధ్యాయములోని ఆరవ మంత్ర అంతర్ రహస్యము వెలుగులోకి తీసుకురాబడినది. అక్కడ ఈవిధముగా చెప్పబడినది. 'అత్యంత బలిష్ఠులను కూడా దండించగలిగే సురథ మహారాజుకు– ఆ మ్లేచ్ఛరాజులకు మధ్య పోరుసాగింది. మ్లేచ్ఛరాజులు అల్పసంఖ్యాకులైనప్పటికి, సురథుడు వారి చేతిలో ఓటమి చవిచూశాడు. అతి బలోపేతులను సైతము శిక్షించగలిగే సమర్థత గల సురథుడు ఈవిధముగా అపజయము పాలగుట ఆశ్చర్యము కలిగించే అంశమే అయినప్పటికిని ఆశ్చర్యము కానేకాదు. ఎందుకంటే సాధకుడు ఎంత తపస్వి, ఎంత ధర్మనిష్ఠుడు అయినప్పటికి కూడా భగవతి ఆశ్రయము లేకుండా అతని సామర్థ్యము ఎల్లప్పుడు అసంపూర్ణముగాను, సగం సగంగాను, సందిగ్ధముగాను ఉంటుంది. అహంకార–మమకారాలకు సహచరులు, స్నేహితులు తక్కువగానే ఉన్నప్పటికిని వారు తపో సాధన యొక్క ప్రబల శక్తులను వినాశము గావించివేస్తారు. సురథ మహారాజు కూడా అహంకార–మమకారాల కాటుకు గురైనవాడే!

ఈ కథాసూత్రములో ఆదిశక్తి లీలాకథ తరువాతి మహా మంత్రములో గుదిగ్రుచ్చబడిన విశేషమిలా ఉంది.

**తతః స్వపురమాయాతో నిజదేశాధిపోఽభవత్ ।**
**ఆక్రానంతః స మహాభాగస్తైస్తదా ప్రబలారిభిః ॥(1/1/17)**

**అర్థము:** అప్పుడు అతను (సురథమహారాజు) తన రాజధానికి తిరిగి వచ్చి తన దేశానికి రాజుగా మెలగుచున్నాడు. ఆ సమయములో అక్కడకూడా ఆ మహాభాగుడు అనగా సురథుడు ఆ ప్రబల శత్రువుల ద్వారా పీడించబడినాడు.

ఆదిశక్తి లీలాకథ ఈ మహిమగల మంత్రము కేవలము గొలుసుకట్టు కథమాత్రమే కాక, అంతకుమించిన ఆధ్యాత్మిక సత్యశృంఖల కూడా గత మంత్రముతో

కలుపబడి ఉంది. సురథ మహారాజు కోలావిధ్వంసరాజుల చేతిలో పరాజితుడైనప్పటినుండి అతని రాజ్యసరిహద్దులు తగ్గిపోసాగాయి. శత్రువులు బలవంతులు కాసాగారు. సురథుడు దుర్బలతను పొందసాగాడు. ఇక అక్కడినుండి అతని రాజ్యవిస్తరణ ఆగిపోయింది. అతను తన రాజధానివరకే పరిమితమైపోవలసి వచ్చింది. అయితే ఇంత జరిగినా శత్రువులు శాంతించలేదు, శమించబడలేదు. శత్రువులు సురథుడిని అక్కడ కూడా చుట్టుముట్టారు.

ఈ కథామంత్ర అంతర్భావనలో ఎన్నెన్నో రహస్యముడులు చిక్కగా అల్లబడి ఉన్నాయి. ఆదిశక్తి లీలాకథలో జీవాత్మకు ప్రతీకయైన సురథమహారాజు యొక్క రాజ్యపు రాజధాని ఆత్మకు ఆవాస ప్రదేశమే అయ్యుండవచ్చుగాక! అయితే మనస్సు శరీరాల వరకు రాజ్యవిస్తరణ సాగుతుంది. ఆత్మ మోహపాశాలతో బంధించినప్పుడు అహంకారము యొక్క దంభముతో వివేకమును కోల్పోతుంది. అప్పుడు ప్రప్రథమముగా ఆహార పానీయాలలోను, వ్యవహారములోను దాని కుసంస్కారములు లేక వికృతులు కనపడుతాయి. అప్పుడు మనిషి జీవనశైలి తప్పటగులు వేస్తుంది, జీవితపు రూపకల్పన చెడిపోతుంది. తత్కారణముగా శారీరిక రోగాల రూపములో దాని ఫలితము గోచరిస్తుంది. మనస్సు శరీరాల మధ్య ఏర్పడిన అసంతులనముతో పాటే మనోవికారాలలో పొడసూపిన అభివృద్ధి వలన ఆలోచనలు, భావనల సంరచన కూడా అస్తవ్యస్తము, చెల్లాచెదురవుతుంది. మనస్సు కూడా శోక సంతాపాలతో చుట్టుముట్టబడుతుంది. మనోవికారాలు, మనోవ్యథగా మారిపోతాయి.

రోగశరీరము మరియు మనోవ్యాధి ఆవాసములో జీవించే జీవాత్మకు తన మనస్సు శరీరాల మీద ఏవిధమైన పట్టూ ఉండదు. తత్పరిణామముగా తన ఆత్మరాజ్యములోనే ముడుచుకుపోయి మనవలసి వస్తుంది. అటువంటి పరిస్థితులలో అతని ఆత్మ యొక్క శత్రువులు మరింత బలోపేతమై పెచ్చరిల్లుతారు. స్వీయ పరిస్థితిని తృణమాత్రము గానైనా పర్యవేక్షించినప్పుడు వ్యాధి గల శరీరము, రోగముగల మనస్సు ఉన్న వ్యక్తి యొక్క సంకల్ప బలము, మనోబలము క్షీణించిపోతుంటాయని తెలుసుకుంటాము. అతను రోగములు, వికారాలకు ఎదురుగా నిలబడి పోరాడే బదులు వాటి ఎదుట వివశత్వమునకు లోనౌతాడు. పైగా అతను రోగాలు మరింత పెచ్చరిల్లే పనులనే చేస్తూ ఉంటాడు. సంకల్పము, సదాచారము, సంయమములకు బదులుగా అనారోగ్య హేతువైన, అసంయమనములే అతనికి తోడవుతాయి. తెలిసో

తెలియకో అతను తన శత్రువులను మరింత బలవంతులుగా చేస్తాడు. అప్పుడు ఈ ప్రబల శత్రువులు అతనిని అతని రాజ్యపు రాజధానిలో సైతము ఆక్రమణ చెయ్యటానికి ప్రయత్నిస్తారు. మహారాజు సురథుని విషయములో కూడా ఇదే జరిగింది.

ఈ ఆధ్యాత్మిక, దార్శనిక రహస్యముతోపాటు ఈ శ్లోకమంత్రము యొక్క మాంత్రిక సత్యము కూడా ఉన్నది. దీనికి తనదైన స్వీయ సాధనా విధానము ఉన్నది. అది క్రిందన ఇవ్వబడుతున్నది.

## సాధనా విధానము

**వినియోగము: ఓం అస్య శ్రీ "తతః స్వపురమాయాతో" ఇతి సప్తశతీ సప్తమ మన్త్రస్య శ్రీబ్రహ్మఋషిః, శ్రీమహాసరస్వతీ దేవతా, హ్రీం బీజం, ఛత్రేశ్వరీశక్తిః, తారామహావిద్యా, రజోగుణః, త్వక్ జ్ఞానేన్ద్రియం, ఉద్వేగరసం, పదకర్మేన్ద్రియం, మధ్యమస్వరం, జలతత్త్వం, ప్రవృత్తి కళా, ఏం ఉత్కీలనం, గాలినీముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీ మహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమో-యుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ లోమ-విలోమ పుటితోక్త సప్తమ మన్త్రజపే వినియోగః ॥**

## న్యాసః

| కరన్యాసము | షడంగన్యాసము | |
|---|---|---|
| ఓం ఏం హ్రీం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| నమోనమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |

తతః స్వపురమాయాతో మధ్యమాభ్యాం నమః శిఖాయై వషట్

నిజదేశాధిపోఽభవత్ అనామికాభ్యాం నమః కవచాయహుమ్

ఆక్రాన్తః స మహాభాగః కనిష్ఠికాభ్యాం నమః నేత్రత్రయాయ వౌషట్

తైస్తదా ప్రబలారిభిః కరతలకరపృష్ఠాభ్యాం నమః అస్త్రాయఫట్

## ధ్యానం

**ఘణ్టా-శూలహలాని శఙ్ఖ-ముసలే చక్రం ధనుః సాయకమ్ ।**
**హస్తాబ్జైర్దధతీం ఘనాన్త-విలసచ్ఛీతాశుం-తుల్య-ప్రభామ్ ॥**
**గౌరీదేశ-సముద్భవాం త్రి-జగతామాధార-భూతాం మహా ।**
**పూర్వామత్ర సరస్వతీమనుభజే శుమ్భాది-దైత్యార్దినీమ్ ॥**

## మంత్రం

**ఓం ఏం హ్రీం నమః**
**తతః స్వపురమాయాతో నిజదేశాధిపోఽభవత్।**
**ఆక్రాన్తః స మహాభాగస్తైస్తదా ప్రబలారిభిః ॥**
**నమో హ్రీం ఏం ఓం ॥ ॥ 7 ॥**

**1000 జపాత్ సిద్ధిః దశాంశ తిలఘృత హోమః ।**
**గాయత్రీ మహామంత్రజప-10,000**
**గాయత్రీ విధానేన దశాంశ హోమః ।**

గాయత్రీమహామంత్రజపం 10,000 చెయ్యాలి. గాయత్రీ విధానమును అనుసరించి నువ్వులు, నెయ్యి కలిపి అందులో పదవవంతు హోమము.

10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము. ఈవిధంగా పదిదినములు అనుష్ఠించి, ఆ తరువాత ప్రతిఒక్క దానికి దశాంశముతో ప్రత్యేక హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** ఆధ్యాత్మిక సాధనలో ఎదురయ్యే అవరోధములు నిరంతరము ఎలా ప్రబలమౌతాయి అనే రహస్యముల జ్ఞానం కలుగుతుంది.

**లౌకిక ఫలశృతి:** శత్రువులు బలోపేతులు అవ్వటానికి వెనుక గల కారణము తెలుస్తుంది.

గాయత్రీ మహామంత్ర సాధనతోపాటు చెయ్యబడే ఈ సప్తశతీ మంత్ర సాధనా ప్రభావము కొద్దికాలములోనే గోచరించుట ఆరంభమౌతుంది. సమ్యక్ సాధనా విధానము ఒక్కటే ఇక్కడ ఆవశ్యకమైనది, అంతే! దీని ప్రభావము చేత సాధనలో ఒక విలక్షణ అంతర్‌ప్రజ్ఞ వికసిస్తుంది. తద్వారా తన సాధనలో ఎదురవ్వబోయే ఉపద్రవాల వృద్ధికి గల భౌతిక, దైవిక మరియు ఆధ్యాత్మిక రహస్యములు ఏమిటి

అనేది తెలుస్తుంది. దీనితోపాటు వీటి నివారణకు మరియు నాశనము చేయుటకు గల విధివిధానములు కూడా మనస్సుకు బోధపడటము ప్రారంభమౌతుంది. ప్రాపంచిక జీవితములో శత్రువుల వలన బాధపడే మనుష్యులకు వారి శత్రువుల కుట్రలు, కుతంత్రాలు కూడా విశ్వజనని కృపచేత ప్రకటీకృతమౌతూ ఉంటాయి. మాత వరద హస్తము మన మీద ఉన్నట్లయితే సమాధాన స్వరము కూడా స్వయంగా ప్రతిధ్వనిస్తుంది. సాధకుని సాధనామయ జీవనము మరియు భగవతీ కృప ఈ రెంటి కలయికయే శబ్దములను మంత్రశక్తి సామర్థ్యము గలవానిగా పరివర్తితము గావిస్తాయి.

# 31. సాధనకు శత్రువులైన కుసంస్కారములు నశించిపోవాలి

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ శృంఖల సాధకులను ఆధ్యాత్మిక చింతనతో ముడివేస్తాయి. ఆధ్యాత్మిక చింతనతో ఎవరి చేతనత్వము ముడిపడి ఉంటుందో వారి జీవితములో ఆధ్యాత్మికపథము ప్రకాశితము మరియు ప్రశస్తము అయ్యే అవకాశం రూపుదాలుస్తుంది. ఈ కార్యము చూడటానికి సరళమైనదిగా అనిపించి నప్పటికి ఆచరణకు కష్టసాధ్యమైనది. ఏవో కొన్ని పుస్తకాలను అధ్యయనము చేసి, కొద్దిపాటి ఆధ్యాత్మిక చింతన–మననాదులను చేసినచో ఆలోచనావిధానమును, భావనలను ఆధ్యాత్మిక తరంగాలలో ఓలలాడింపజేయవచ్చునని, వాటిలో మునిగి తేలవచ్చునని సామాన్యంగా అందరు భావిస్తుంటారు. అయితే వాస్తవానికి అలా జరుగదు. ముందుగా అసలు ఈ దిశవైపు అభిరుచి ఉండనే ఉండదు. ఒకవేళ ఉన్నప్పటికి ఆధ్యాత్మిక చింతనలో మునిగితేలే సదవకాశము రాదు. అదృష్టవశమున ఆధ్యాత్మిక చింతనతో మమేకమయ్యే సువర్ణావకాశము లభించి నప్పటికి ఆ శృంఖల నిలిచి ఉండటము మరియు తరువాత అది ఇంకా ముందుకుసాగే బదులు బంధనాలు విడివడి–పటాపంచలై పోతాయి. ఎందుచేతనంటే జన్మజన్మాంతర సంస్కారముల ప్రబలత చింతనను ప్రాపంచిక జీవితము వైపుకు ఆకర్షిస్తూనే ఉంటుంది.

సంస్కారముల యొక్క ఈ ప్రవాహము యొక్క వేగం ఎంత ప్రబలముగా ఉంటుందంటే అందులో గొప్ప గొప్ప సమర్థ సాధకులు కూడా మునిగి కొట్టుకు

పోకుండా ఉండుట అసాధ్యము. మహామాయి కృప చేత ఉద్ధరించబడినవారే ఆ ప్రవాహము నుండి బయటపడి జీవన్ముక్తులౌతారు. పురాణాలలో ఎన్నో కథా ప్రసంగాలు దీనికి అద్దంపడుతూ సాక్ష్యంగా నిలుస్తున్నాయి. అతి మానవీయ తపోధనుడైన విశ్వామిత్రమహర్షి యొక్క సాధనా కథ కూడా దీనికొక ఉదాహరణ. వాల్మీకి రామాయణములో విశ్వామిత్ర మహర్షి కథా-ప్రసంగము చాలా ఆశ్చర్యము గొలిపే రీతిలో రోమాంచకముగాను మరియు మార్మిక శైలిలోనూ వర్ణించబడి ఉన్నది. త్రిశంకు మహారాజును సశరీరముగా స్వర్గానికి పంపగల సమర్థుడు, తన అలౌకిక తపోబలము చేత నూతన సృష్టిని చేయగలిగిన మహాపరాక్రమవంతుడు అయిన మహర్షి విశ్వామిత్రుడు మేనక యొక్క మోహాజాలములో చిక్కుకుపోవాల్సి వచ్చింది. ఆయన ఎన్నో మారులు తపోశిఖరాలని అందుకుని కూడా సంస్కారాల ప్రబలమైన దెబ్బల చేత క్రిందికి జారిపడ్డాడు. అతని పురుషార్థము కూడా ఆధ్యాత్మికచింతనను స్థిరంగా ఉంచలేకపోయింది. విశ్వామిత్రుని చేతనా ఔన్నత్యము పతనదిశగా జారిపోయింది.

విశ్వామిత్రమహర్షి ఆర్తి-స్వరముతో ఆదిశక్తి మహామాయ, వేదజనని గాయత్రీమాతను ఎలుగెత్తి పిలిచినప్పుడే పరిస్థితి చక్కబడింది, సాధన తిరిగి పుంజుకుని సవ్యదిశగా సాగింది. గాయత్రీ సాధన మరియు ఆమెకు శరణాగతి చేయటంచేత ఆ విశ్వామిత్రుడు ఋషి, మహర్షి మరియు బ్రహ్మర్షి పదవులను అలంకరిస్తూ సప్తర్షులలో ఒకనిగా చేరి గౌరవమును అంది పుచ్చుకున్నాడు. సమర్థవంతమైన సాధనకూడా లెక్కలేనన్నిమార్లు శక్తివంతమైన సంస్కారాల ముందు అసహాయురాలిగా నిలిచింది. అయితే భవానీదేవి శరణాగతి సమక్షములో సమస్త సంస్కారములు ధూళి-ధూసరితమై నశించిపోతాయి. భవానీమాత భక్తులు ఎప్పుడూ ఎక్కడా ఏ క్షణములోను పరాజితులై అసహాయులుగా మిగిలిపోవుట జరుగదు. ఇందుచేత సాధనతోపాటు మాతకు శరణాగతి అగుట ఆవశ్యకము. అలా జరిగినప్పుడు సాధన పావనము, ప్రఖరము, పూర్ణము అయి పరిణామదాయినిగా మలచ బడుతుంది. అప్పుడు ఆధ్యాత్మిక చింతననుండి సాధకుని చేతన ఎన్నడూ విముఖమవ్వదు. సాధనలో నిరంతర వికాసము మరియు ప్రగతి మార్గాన సాగే సదవకాశము ఒనగూడుతూనే ఉంటుంది.

సంస్కారము–సాధన మరియు శరణాగతుల ఈ సత్యమును జోడించే ఈ కథాశృంఖలలో ఆదిశక్తి లీలాకథ గత భాగము కూడా అనుసంధానించబడినది. ప్రస్తుత భాగములో ప్రథమచరిత్రలోని ప్రథమాధ్యాయమునకు చెందిన ఏడవ మంత్రము యొక్క అంతర్ మర్మము స్పష్టముగా వివరించబడినది. ఇందులో ఇలా వర్ణించబడినది. మహారాజు సురథుడు కోలావిధ్వంసరాజుల చేతిలో పరాజితుడై నప్పుడు అతని రాజ్యపు సరిహద్దులు కూడా తగ్గిపో సాగాయి. శత్రువులు మరింత సమర్థులుగాను మరియు సురథుడు మరింత బలహీనముగాను అవ్వసాగారు. ఇక అక్కడితో అతని రాజ్య విస్తారము ఆగిపోయింది. సురథుడు కేవలము తన రాజధానికే పరిమితమవ్వవలసివచ్చింది. ఓటమి–అపజయములు కలిగి, సరిహద్దులు తగ్గిపోయినప్పటికిని అతని శత్రువులు నశించలేదు, పైగా దీనికి విరుద్ధముగా వారు అధిక శక్తివంతులు గాను మరియు ప్రబల సమర్థులుగాను అవ్వసాగారు. వారు రాజధాని చేరుకుని అక్కడ కూడా సురథరాజుని చుట్టుముట్టారు. రాజాసురథుని ఈ జీవన సత్యము ప్రతి సాధకుని యొక్క సాధనా సత్యము. కర్మ–సంస్కారాల శత్రుత్వం ఎన్నడూ నశించిపోదు. వాటిని భవానీమాత కృపయే భస్మీపటలం గావిస్తుంది. సాధనారతులు, సాధన చేయాలనే ఆకాంక్ష కలిగిన సాధకుల కొరకు అనుభవజ్ఞులు ఒక్కమాట ఇలా చెప్తుంటారు. సాధనలోని విధివిధానములు, వ్యవస్థలన్నీ, అవి ఏవైనప్పటికి మాత యొక్క భావభరితమైన పిలుపులో మమేకమై ప్రతిధ్వనించాలి, ఆ పిలుపులో గుదిగ్రుచ్చబడాలి. ఎందుకంటే జటిలమైన సంస్కారములు జీవాత్మ యొక్క సహయోగులందరిని తన సహయోగులుగా మరియు జీవాత్మకు విరోధులుగా మార్చివేస్తాయి.

ఆదిశక్తి లీలాకథ తదుపరి మహామంత్రములో ఈ సత్యమే ప్రకటితమౌతుంది.

**అమాత్యైర్బలిభిర్దుష్టైర్దుర్బలస్య దురాత్మభిః ।**
**కోశోబలం చాపహృతం తత్రాపి స్వపురే తతః ।। (1/1/8)**

**అర్థము:** తదుపరాంతము అక్కడ రాజధానిలో కూడా దుష్టులు, దురాత్ములైన శక్తివంతులైన మంత్రులు దుర్బలుడైన సురథ మహా రాజు ఖజానాను మరియు సైన్యాది బలమును లాగేసుకున్నారు.

ఆదిశక్తి లీలలను వర్ణించే ఈ కథామంత్రములో సాధన యొక్క శత్రు-సంస్కారాల ప్రబలత చాలా గొప్పదైన మార్మికరీతిలో ప్రవచించబడినది. ఇది ఎటువంటి జీవన-సత్యమంటే, ప్రతి సాధకుని సాధనామయ జీవితములో పలుమారులు దర్శనమిస్తూనే ఉంటుంది. సామాన్యజనుల జీవనములో ఇటువంటి సత్య విషయము పలుమార్లు ఇలాగ వస్తూనే ఉంటుంది. దీనిలోని మర్మమును అవగతము చేసుకోని కారణముగా దేవాలయానికి వెళ్ళటము చేత, వ్రతం ఉపవాసాలను ఆచరించుట వలన, ఇంత జపానుష్ఠానము, పారాయణాదుల ద్వారా మాకేమి ఒరిగింది? అని అంటుంటారు, మనము వింటూనే ఉంటాము. యథార్థమునకు వీరంతా తమ ఆస్తికత మరియు సాధనలను మహిమామయి మాత యొక్క సర్వతోభావ శరణాగతిలో ఇమిడ్చి, దానిలో గుదిగ్రుచ్చటము విస్మరిస్తూ ఉంటారు. ఈ శరణాగతి లేకుండా వారి సమర్థవంతమైన సాధన అసమర్థమైనదిగా ఋజువౌతుంది. అంతేకాక ఆస్తికత - నాస్తికతగా పరివర్తనచెందే అవకాశము ఏర్పడుతుంది.

నిజానికి సాధనచేత సద్గుణములు అంకురిస్తాయి. అయితే శరణాగతి లేని కారణము వలన అహంకారము సాధకులను తన గుప్పిట బిగించివేస్తుంది మరియు సాధకులు అభిమాన పూర్వకముగా ఇలా అంటూ ఉంటారు 'నేను ఇంత గొప్ప సాధకుడిని, నా తపస్సు ఎంతో గొప్ప సమర్థవంతమైనది.' సాధకుని మనస్సులో భక్తి-శరణాగతి భావనలు నిండుగా ఉన్నట్లయితే అతను మాత యొక్క అలౌకిక అనంతత్త్వముతో జోడించబడతాడు. తత్కారణముగా 'మాతయే సాధకుడు, జగన్మాతయే సాధనా-విధానము మరియు సాధకునికి సిద్ధి-శక్తులను ప్రసాదించేది దేవియే!' అనే అనుభూతి సాధకునికి కలుగుతుంది. అటువంటి సాధకుడు మాత యొక్క పరాక్రమ వంతమైన సింహవాహనముగా రూపొందుతాడు. ఈ స్థితిలో శత్రు-సంస్కారములు ఎన్ని కుతంత్రములు పన్నినా, అవెంత దుష్ట పన్నాగాలకు ప్రణాళికలు వేసినా సాధకుని ధర్మపూర్ణమైన సాధన మరియు భవానీమాత కృపచేత అవన్నీ పటాపంచలై పోతాయి.

ఇలా జరగని పరిస్థితులలో సురథమహారాజుకు పట్టినగతే ఎదురౌతుంది. సాధకుడు సర్వగుణసంపన్నుడు అయినప్పటికి కూడా శరణాగతి లేనికారణము చేత ఆదినుండే ఓటమి పాలవుతాడు. శత్రు-సంస్కారములు అతనిని చుట్టుముట్టినప్పుడు

రాజు సమర్థుడు అయినప్పటికీ స్వీయ-రక్షణ గావించుకొనలేదు. ఎందుచేతనంటే అంతఃకరణ మర్మమును అవగతము చేసుకున్న మనస్వీ పురుషులకు 'చిత్తభూమిలో అంకురించే సంస్కారములు అంతఃకరణము అంతటిని తన ప్రభావము చేత పట్టి ఉంచుతాయి మరియు కేవలము మనఃస్థితి యొక్క ప్రతిబింబిమే ప్రత్యక్ష పరిస్థితులుగా ఎదురునిలుస్తుంది' అని వారికి తెలుసును. మనఃస్థితి మారిపోగానే ఈ పరిస్థితులలో పరివర్తన రావటానికి ఎక్కువ సమయము పట్టదు. మనఃస్థితి విరుద్ధముగా ఉంటే పరిస్థితులు కూడా ఎదురునిలుస్తాయి. మనుష్య జీవాత్మకు ప్రతీకయైన సురథమహారాజు సంస్కారముల యొక్క శత్రుసేనల చేతిలో పరాజయము పాలైనప్పుడు, ఈ స్థితిలో అతని అంతఃకరణ అనగా మనోబుద్ధి చిత్త అహంకారముల అభిమానములు కూడా అతనిని విడిచిపెట్టాయి. అంతేకాదు వీరంతా (సంస్కారాలు) రాజు(జీవాత్మ) సంచిత పుణ్యరాశిని దోచుకున్నాయి. అతని తపోబలమును సమాప్తము గావించాయి. నిర్బలుడైన మహారాజు సురథుడు జరిగినది చూసి నిశ్చేష్టుడై, అవాక్కై నిలబడిపోయాడు. ఎందు చేతనంటే ఈ క్షణాలలో 'మహామాయను ఆర్తితో ఎలుగెత్తి పిలవటములోను మరియు దేవికి శరణాగతి చేసుకొనుటలోనే సాధన యొక్క సార్థకత దాగి ఉన్నది' అన్న విషయమును అతను మరచిపోయాడు, అంతేకాక భవానీమాత భక్తులు ఎప్పుడు నశించి పోరు అన్న విషయము కూడా అతనికి స్మరణలో లేదు.

ఈ దార్శనిక మరియు ఆధ్యాత్మిక సత్యముతోపాటు ఈ కథా శ్లోకము యొక్క మంత్రపరమైన సత్యము కూడా క్రిందన ఇవ్వబడినది. దానికి తనదైన సాధనా-విధానమున్నది.

## సాధనా విధానము

**వినియోగము: ఓం అస్య శ్రీ "అమాత్యైర్బలిభిః" ఇతి సప్తశతీ అష్టమ మంత్రస్య శ్రీబ్రహ్మఋషిః, శ్రీమహాకాళీదేవతా, సౌం బీజం, డాకినీశక్తిః, ఛిన్నమస్తామహావిద్యా, రజోగుణః, త్వక్ జ్ఞానేన్ద్రియం, లజ్జారసం, లింగకర్మేన్ద్రియం, మధ్యమస్వరం, అగ్నితత్త్వం, నివృత్తి కళా, క్రీం క్రీం ఉత్కీలనం, విద్రోహిణీముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీ మహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమో-యుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ లోమ-విలోమ పుటితోక్త అష్టమ మంత్రజపే వినియోగః ॥**

## న్యాసః

| కరన్యాసము | షడంగన్యాసము | |
|---|---|---|
| ఓం ఏం సౌం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| నమోనమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| అమాత్యైర్బలిభిర్దుష్టై | మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| దుర్బలస్య దురాత్మభిః | అనామికాభ్యాం నమః | కవచాయహుమ్ |
| కోశో బలం చాపహృతం | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయ వౌషట్ |
| తత్రాపి స్వపురే తతః | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

**చర్వన్తీ చాస్థి ఖణ్డం ప్రకట-కటకటా-శబ్ద సజ్ఞాతముగ్రమ్ ।**
**కుర్వాణా ప్రేత-మధ్యే కహ-కహకహా-హాస్యముగ్రం కృశాఙ్గీ ॥**
**నిత్యం నిత్యప్రసక్తా డమరూ డిమి-డిమాన్ స్ఫారయన్తీ ముఖాబ్జమ్ ।**
**పాయాన్నశ్చణ్డికేయం ఝఝుమ-ఝుమఝుమా జల్పమానా భ్రమన్తీ ॥**

## మంత్రం

**ఓం ఏం సౌం నమః**
**అమాత్యైర్బలిభిర్దుష్టైదుర్బలస్య దురాత్మభిః।**
**కోశో బలం చాపహృతం తత్రాపి స్వపురే తతః ॥**
**నమో సౌం ఏం ఓం ॥ ॥ 8 ॥**

**1000 జపాత్ సిద్ధిః కూష్మాణ్డ-ఖణ్డ తిలైః సఘృతేన హోమః।**
**గాయత్రీమహామంత్రజప - 10,000**
**గాయత్రీ విధానేన దశాంశ హోమః ।**

గాయత్రీమహామంత్రజపం 10,000 చెయ్యాలి. గాయత్రీ విధానమును అనుసరించి గుమ్మడికాయ ముక్కలు, నువ్వులు, నెయ్యిని కలిపి పదవవంతు హోమము.

10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము। ఈ విధంగా పదిదినములు అనుష్ఠించి, ఆ తరువాత ప్రతి ఒక్క దానికి దశాంశముతో ప్రత్యేక హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** అంతఃకరణములో సాధన యొక్క శత్రు-సంస్కారముల బీజముల బలము మరియు వాటి దెబ్బలు ఎలా ఉంటాయి అనే జ్ఞానము ఉదయిస్తుంది.

**లౌకిక ఫలశృతి:** 'మేము నీవారము' అన్న భావనను ప్రదర్శించే శత్రువుల నైపుణ్యం తెలుస్తుంది మరియు తద్వారా వాటిని ధ్వంసము గావించుట సంభవమౌతుంది.

గాయత్రీమంత్రముతోపాటే సమన్వితమైన ఈ సప్తశతీమంత్ర సాధన శీఘ్ర ఫలితాన్నిస్తుంది. దీనివలన అంతఃకరణములో దాగి ఉండి, భావి కాలములో సాధనను నష్టపరిచే ఆ సంస్కార బీజముల బలము సమయానికి ముందే తెలిసిపోతుంది. ఈ విషయము తెలిసిన పిమ్మట శ్రీదుర్గాసప్తశతీ సాధన ద్వారా వాటి నివారణ జరిగి-తొలగించే కార్యము నెరవేరగలదు. అంతేకాదు ఈ సాధన ద్వారా 'మేము నీవారము' అన్న భావనను ప్రదర్శించే శత్రువుల భేదభావమును కూడా భగవతి జగన్మాత కళ్ళెదుట ఆవిష్కరిస్తుంది. అప్పుడు సాధకుడు సమయానికి ముందే అప్రమత్తుడౌతాడు. ఈ క్రమములో అన్నింటికన్నా మహత్వపూర్ణమైన విషయము ఏమిటంటే ఈ విధానము ద్వారా చిత్తమును శోధించగలిగే స్వాభావిక శోధనాశైలి తనకు తానే ఆవిష్కరింప బడుతుంది. గాయత్రీ-సాధనతోపాటు సాగే ఈ అంతర్ శోధనా పద్ధతి ప్రభావం గలది.

# 32. ఆత్మబల వికాసమే సాధన యొక్క ఫలశృతి

ఆదిశక్తి లీలాకథ నూతన భాగమును జోడించటముతోపాటు ఆధ్యాత్మిక రహస్యాల క్రొత్త ఆయామమును కూడా ఇక్కడ పొందుపరుస్తున్నాము. తమను తాము జగన్మాతతో మమేకము చేసుకునే సాధకులు, సాధకురాండ్రు స్వీయ అంతశ్చేతనలో కొంగ్రొత్త ఆధ్యాత్మిక గవాక్షము తెరుచుకున్నదనే అనుభూతిని

చెందుతారు. వారి అంతర్భావనలలో ఈ అద్భుత, శ్రేష్ఠ గవాక్షము వారిలో నూతన ప్రాణము, కొంగ్రొత్త కాంతి, నవ ప్రేరణలను నింపుతుంది. అవన్నీ కలసి వారికి జీవితములోని వివిధ ఆయామములలో ఆదిశక్తి జగన్మాత లీలల యొక్క నూతన అనుభూతులను చేతికందిస్తాయి. మాత భవానీని హృదయపూర్వక భావనతో స్మరించినప్పుడే జీవితములో శక్తి, శాంతి మరియు సమృద్ధిలతోపాటు సమస్త విభూతులు మరియు ఉపలబ్ధుల స్రోతము (source) గోచరిస్తుందని వారికి అవగతమౌతుంది. మానవ జీవితములో ఈ భక్తిపూర్వకమైన స్మరణ జరుగుతున్నప్పుడు సాధకులకు ఎన్నడూ కూడా ప్రతికూలత, పరాజయము మరియు పరాభవములను ఎదుర్కొనవలసిన దుస్థితి దాపురించదు. అయితే విధివిలాసము లేక కాలము యొక్క కుటిలతలు సాధకుల ఎదుట పరీక్షలనే ఎన్నెన్నో చిత్ర-విచిత్ర గీటురాళ్ళను అవరోధాలుగా నిలపవచ్చుగాక! కానీ ఏ పరిస్థితులలోనైనా సాధకులు భావమయి అయిన భవానీమాతను విస్మరించినచో అంధకారము వారిని చుట్టు ముడుతుంది. అయితే సాధకులు తమ తప్పు తెలుసుకుని జగన్మాతను భక్తితో స్మరించినప్పుడు అవన్నీ దూదిపింజ వలె కొట్టుకుపోతాయి. జగదంబను స్మరించనప్పుడు చేతికందబోయే సఫలతలు కూడా భవిష్యత్తులో వైఫల్యాల ద్వారాలను తెరుస్తాయి.

స్వయముగా ఈ విషయము అవగతము కాకపోయినప్పటికిని ఈ సత్యము ఉత్తరోత్తరా స్పష్టమౌతుంది. మాతను విస్మరించిన సాధకుల జీవితములో ఈ ప్రత్యేక ఉపలబ్ధి మరియు సమృద్ధి అశాంతి ద్వారాలను తెరుస్తాయి. సాఫల్యాల విశిష్ట శిఖరాలు వారి జీవితములో అహంకారమనే చీకటిని మరింత చిమ్మచీకటిగా, గాఢాంధకారముగా చేస్తాయి. ఈ గాఢాంధకారములో వాసనల యొక్క విషపూరిత సర్పాలు క్రొత్త విధానములో కాటువేస్తుంటాయి. సాధకులు కోరుకున్నప్పటికి మూర్ఛనుండి బయటపడలేరు. పైగా వారి అంతరంగములో తమకు తామే పరాయివారమనే ఒక దోషభూయిష్టమైన భావన ప్రవహిస్తుంది, ఎగసిపడుతుంది. కాల చక్రము పరివర్తనమవుతూనే వారికి స్వయముగా ఈ వాస్తవ విషయము కళ్ళెదుట ఆవిష్కృతమౌతుంది. అయితే అప్పటికే వారు తమ పూర్వార్జిత పుణ్య ప్రకాశమును మరియు తపోశక్తిని పోగొట్టుకుని ఉంటారు. ఈ వేదనాభరిత విహ్వలత్వములో ఒకవేళ అదృష్టవశాత్తు మరియు సుయోగము చేత అంతర్జగత్తులో 'అమ్మా!' అనే ఆర్తితో కూడిన పిలుపు ప్రతిధ్వనించినచో విశ్వజనని తన సంతానమునకు వాత్సల్యమనే కొంగును అందించుటలో ఎన్నడూ ఆలస్యము చేయదు.

పొరపాటు అంటూ జరిగితే మాత సంతానమైన మనవల్లనే జరుగుంది తప్ప మాత దయను వర్షించుటలో ఎన్నడూ ఆలస్యము చేయదు, మన ప్రాణాలను పీల్చివేసే విషయ వాసనలను మనవిగా భావించినప్పుడు, మనందరకు అమృతమనే క్షీరమును అందించి ప్రాణాలలో సుధామృతమును నింపే మాతను పరాయిగా భావించే పొరపాటు జరుగుతున్నది. ఈ లజ్జాపూరిత కార్యమే జీవాత్మయొక్క జీవన సత్యము. ఈ సత్యసూత్రములో మహారాజు సురథుని జీవనచక్రము కూడా అనుసంధానింప బడుతూనే ఉన్నది. అతను తన పుణ్యరాశిని, తపః సంపదను చేజార్చుకుంటూనే ఉన్నాడు. పైగా మోహపాశములో చిక్కుకుపోయి మనుతున్నాడు. ఓటమిచేత స్వజనుల మోసం మరియు దెబ్బలతో అతని మనస్సు పలుమార్లు వికలమైపోయిందేగాని జగన్మాతను మాత్రం 'మాతా!' అని ఆర్తితో పిలువలేకపోయింది. ప్రపంచము మరియు లౌకిక విషయవాసనల మోహపాశాలు జయాపజయాలలో ఒక్కమారు కూడా మహా మాయ దుర్గాదేవిని స్మరించనివ్వవు. సఫలతలు వరించినప్పుడు ఉన్మత్తాహంకారం శ్రేయస్సునంతటికి తాను అధికారిని, బాధ్యుడననే ప్రకటించుకుంటుంది. వైఫల్యాలు ఎదురైనప్పుడు అరచి అరచి ఇతరులపై వాటి దోషారోపణ గావిస్తుంది.

మాయామరీచిక యొక్క మారువేషము గురించి ఆదిశక్తి లీలాకథ ప్రథమ చరిత్రలోని ప్రథమాధ్యాయమునకు చెందిన అష్టమ మంత్రములోని లోలోపలి రహస్యములను సుస్పష్టముగా వివరించబడినవి. ఈ మంత్రములో ఏమని చెప్పబడుతున్నదంటే 'కోలావిధ్వంసరాజుల చేతిలో ఓటమిపాలైన పిమ్మట కూడా మహారాజు సురథుని మీద ఆక్రమణలు జరగటం, దెబ్బలు పడటం తగ్గలేదు. అతను తన రాజధానికి చేరుకున్నప్పటికీ శక్తివంతులైన దుష్టులు, దురాత్ములైన అతని మంత్రులు దుర్బలుడైన మహారాజు ఖజానాను దోచుకుని సైన్యబలమును లాగివేసుకున్నారు. ఆ పరిస్థితులలో సురథుడు పూర్తిగా ఏకాకి, నిరాధారుడు మరియు నిరాశ్రయుడు, సంపూర్ణముగా సాధనాహీనుడైపోయాడు. ప్రాపంచిక దృష్టితో చూసినప్పుడు ఈ స్థితి చాలా విపత్కరమైనది. ఈ విపత్కర పరిస్థితులలో అనుభూతి లోకి వచ్చే వ్యధలను ఒక్క అనుభవజ్ఞుడు మాత్రమే తెలుసుకొనగలడు. సురథుని వేదన కూడా ఆ సమయములో కొంతమేర పైన చెప్పిన విధముగానే ఉన్నది. అతను తప్ప తన స్వీయబాధలను పరులెవ్వరు అవగాహన చేసుకోలేరు.

అయితే ఈ ఏకాంత, సాధనావిహీన దశలో సాధనా బీజ క్రొత్త అంకురములు మొలకెత్తే ఆశ ఉంటుంది. ప్రాపంచిక సాధనములు, సంపదలన్నింటి నుండి విడివడిన పిమ్మట జీవాత్మ తానెవ్వరు అన్న సత్యమును గుర్తించుటకు యోగ్యమౌతుంది. విశ్వమాయను, దాని మోహ పాశమును త్రెంచుట అంత తేలికకాక పోయినప్పటికి ఆత్మ సత్యమును గుర్తిస్తుంది. సమస్తము లాగి వేసుకోబడిన తరువాత కూడా ప్రపంచము తన బంధనములను సడలనివ్వదు. మరియు బంధనాలను త్రెంచుకునే మార్గాలను అన్వేషించనివ్వదు. ఆ స్థితిలో జీవాత్మ అంతర్ వివేకము మరియు జగన్మాత అహైతుకీ కరుణయే మార్గదర్శనము చేస్తుంది. మహారాజు సురథునికి కూడా తన జీవితములోని ఈ క్షణాలలో అటువంటి అనుభవమే కలిగింది. ఆదిశక్తి లీలాకథ తదుపరి మంత్రములో ఈ సత్యము ఆవిష్కృతమైనది.

**తతో మృగయావ్యాజేన హృతస్వామ్యః స భూపతిః ।**
**ఏకాకీ హయమారుహ్య జగామ గహనం వనమ్ ॥(1/1/9)**

**అర్థము:** ఆ సురథమహారాజు అధికారము లాగివేసుకో బడినప్పుడు వేట మిషతో అశ్వమును అధిరోహించి దట్టమైన అడవిలోకి వెళ్ళిపోయాడు.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ శ్లోకమంత్రములో ప్రపంచపు దెబ్బలు, ఎదురుదెబ్బలు మరియు నిరంతర సవాళ్ళతో, దెబ్బల పిడుగుపాటులతో పీడించబడిన, అలసిన జీవాత్మ స్థితి గొప్పగా భావనాత్మకంగా వర్ణించినారు. అంతేకాక ఈ కింకర్తవ్య విమూఢ స్థితిలో కూడా కర్తవ్యపథ దర్శనము చేయించబడినది. ఈ సందర్భములో ప్రపంచము కేవలం సాధన, సమృద్ధి మరియు శాంతులనే లాగివేసుకోవటమేకాక, వాటితోపాటు పలువిధాలైన ఆరోపణలు, ప్రత్యారోపణల చేత కళంకితము గావించి, అవమాన, తిరస్కారముల దెబ్బలు వేసి పీడిస్తూ మనోబలమును తుత్తునియలు చేస్తుంది అన్న విషయము ఇక్కడ సర్వదా స్మరణీయము! దీని దెబ్బలు, ఎదురుదెబ్బలలో ఎంత బలం ఉంటుందంటే వాటి కుదుపులలో కొట్టుకునే సాధకుడు ఆలోచించి, అవగాహన చేసుకుని, వాటిని ఎదుర్కొనేందుకు సమయమే మిగలదు. ఇది ఎటువంటి స్థితి అంటే ఎవరైతే ఈ దెబ్బలను సహిస్తున్నారో వారే ఈ విషయమును స్వయంగా తెలుసుకోగలరు. ఈ పరిస్థితులలో ఆలోచనాశక్తి నశించిపోతుంది. ప్రాణము బలహీనమౌతుంది. క్రియాశక్తి క్షీణించి నిస్తేజము

మరియు ప్రభావహీనమౌతుంది. నలుదిశలా విరోధుల, శత్రువుల ప్రబల హుంకార ములే వినిపిస్తుంటాయి.

అయితే ఈ విషమ సంకటపరిస్థితులలో ఏదైనా ఒకానొక ఆలంబన, ఆధారము ఉన్నదీ అంటే అది జీవాత్మ యొక్క ఆత్మబలమే! కష్టకాలములో ఈ అశ్వముపైనే భరోసా పెట్టుకొన గలము, దానిమీద సవారీ చేయవచ్చును. అశ్వమును అధిరోహించి నప్పుడు 'దట్టమైన అడవివలె ఉన్న ఆ అజ్ఞాత భవిష్యత్తులో ఏదో ఒక సత్యపథము తప్పక లభిస్తుంది అని భావించగలము. ఆత్మబలమెన్నడు ఓటమి పాలవ్వదు. అలసిపోదు, దానికి ఎన్నడూ అపజయము కలుగదు. ఇది ఎన్నడూ ఎట్టి పరిస్థితుల లోను దిశాహీనమవ్వదు. ఎల్లవేళలా సరైన దిశను ఎన్నుకొనుట దీని స్వాభావిక లక్షణము. అయితే జీవాత్మ దీనిమీద విశ్వాసముంచక పోవటమనేది నిజంగా జీవాత్మ యొక్క దౌర్భాగ్యమనే చెప్పాలి. జీవాత్మకు ఎప్పుడూ ఈ ప్రపంచము, సృష్టి విషయాల పైన, తన సంబంధీకులపైనా భరోసా ఉంటుంది. ఇవన్నీ ఉన్నప్పుడు ఎవ్వరు ఆత్మబలము వైపు కన్నెత్తి చూడనే చూడరు. దానివైపు దృష్టిసారించాలనే తీరిక, అవకాశము ఉండనే ఉండదు.

ప్రాపంచిక దృష్టి క్షీణించినప్పుడే ఈ దిశగా మనిషి దృష్టి సారించగలుగుతాడు. లేనిచో ఈ ప్రకారముగానే ప్రపంచము అతని నుండి అతనిదైన సమస్తమును లాగివేసుకుంటుంది. అప్పుడు తెలిసో తెలియకో అతని దృష్టి ఆత్మబలము వైపు మరలుతుంది. కేవలము ఆత్మబలము వద్దనే జర్జర శరీరము, అలసిన, పీడితయైన, వికల మనస్సుకు ఒకవేళ ఏదైనా ఆశ్రయము, శరణు లభిస్తే అది కేవలము ఈ ఆత్మశక్తిదే! ఈ అశ్వశక్తిని అధిరోహించినప్పుడు అతను జీవితపు కొంగ్రొత్త దారులను అన్వేషించాలనే ఆలోచన చేస్తాడు. ఇక్కడ అతను మోసగించబడడు. ఎవరైనా ఒక సాధకుడు నిజముగా జీవితపు విషమక్షణాలలో ఆత్మబలమును ఆశ్రయించినచో అతను నిశ్చయంగా అంతర్‌ప్రజ్ఞ, మహామేధా స్థితికి తప్పక చేరుకుంటాడని తెలుసుకోండి! అతనికి అవశ్యం వింధ్యగిరి యొక్క హృదయ గుహలో మార్గము గోచరిస్తుంది.

ఈ మంత్రశ్లోకములో దాగిన ఈ దార్శనిక ఆధ్యాత్మిక సత్యముతోపాటు దీనికి మంత్రసాధన, విధానము కూడా ఉన్నది. అది క్రిందన ఇవ్వబడుతున్నది.

## సాధనా విధానము

వినియోగః ఓం అస్య శ్రీ "తతో మృగయావ్యాజేన" ఇతి సప్తశతీ నవమ-మన్త్రస్య శ్రీవేదవ్యాసఋషిః, శ్రీమహాలక్ష్మీదేవతా, ప్రేం బీజం, అభేద్యాశక్తిః, సున్దరీమహావిద్యా, తమోగుణః, శ్రోత్ర జ్ఞానేన్ద్రియం, ఘృణా రసం, గుదే కర్మేన్ద్రియం, మధ్యమ స్వరం, వాయుతత్త్వం, విద్యాకళా, ప్రూం ఉత్కీలనం, గోష్ఠీ ముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీ మహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమో యుత ప్రణవ వాగ్బీజ స్వబీజ లోమ-విలోమ పుటితోక్త నవమ మన్త్ర జపే వినియోగః ॥

## న్యాసః

| కరన్యాసము | షడంగన్యాసము | |
|---|---|---|
| ఓం ఏం ప్రేం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| నమోనమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| తతో మృగయావ్యాజేన | మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| హృతస్వామ్యః స భూపతిః | అనామికాభ్యాం నమః | కవచాయహుమ్ |
| ఏకాకీ హయమారుహ్య | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయ వౌషట్ |
| జగామ గహనం వనమ్ | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

జయతు జయతు దేవీ దేవ-సఙ్ఘాభి పూజ్యా ।
జయతు జయతు దేవీ భద్రా భార్గవీ భాగ్యరూపా ॥
జయతు జయతు సత్యా సర్వభూతాన్తరస్థా ।
కర పద-హృదయస్థా లుబ్ధచిత్తా భజే2హమ్ ॥

## మంత్రం

ఓం ఏం ప్రేం నమః
తతో మృగయావ్యాజేన హృతస్వామ్యః స భూపతిః।
ఏకాకీ హయమారుహ్య జగామ గహనం వనమ్ ॥
నమో ప్రేం ఏం ఓం ॥ ॥ 9 ॥

**1000 జపాత్ సిద్ధిః తిలఘృత హోమః ।**
**గాయత్రీమహామంత్రజప - 10,000**
**గాయత్రీ విధానేన దశాంశ హోమః ।**

గాయత్రీమహామంత్రజపం 10,000 చెయ్యాలి. గాయత్రి విధానమును అనుసరించి నువ్వులు, నెయ్యిని కలిపి అందులో పదవవంతు హోమము.

10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము । ఈ విధంగా పదిదినములు అనుష్ఠించి, ఆ తరువాత ప్రతి ఒక్కదానికి దశాంశముతో ప్రత్యేక హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** స్వీయ ఆత్మబల జ్ఞానం ఉదయిస్తుంది మరియు దాని ప్రయోగ సామర్థ్యం వికసిస్తుంది.

**లౌకిక ఫలశృతి:** విషమ-కష్టకాలములో తనమీద తనకు విశ్వాసము కుదురుతుంది మరియు కష్టము నుండి బయట పడేందుకు మార్గము ప్రశస్తమౌతుంది.

గాయత్రీమంత్రముతోపాటు సమన్వితమైన ఈ సప్తశతీమంత్ర సాధన శీఘ్రఫలదాయిని. చెప్పబడిన రీతిలో సాధన చేసినవారు దీని ప్రభావాల యొక్క చమత్కారాలను చూసి ఆశ్చర్యములో మునిగి పోతారు. నలుచెరగులా సంకటములు చుట్టుముట్టినప్పుడు, ఏ మార్గము గోచరించనప్పుడు ఈ మంత్రమును సఫలతా పూర్వకముగా ప్రయోగించవచ్చును. సాధకుడు దీనిని నిష్కామముగా ప్రయోగించినచో సాధకునిలో అద్భుతమైన, అంతులేని ఆత్మబలము వికసిస్తుంది. జీవితములో చీకట్లు అలముకున్న తుఫానులలో, చక్రవాకాలలో కూడా తన జీవితమును గురించి సాగించే అన్వేషణలో సఫలీకృతుడౌతాడు. ఈ మంత్రసాధనతో సాధకుడు భగవతి దయకు పాత్రుడౌతాడు. అతని కష్టములన్నీ తొలగి పోవటమేకాక, అతని జీవితములో కొంగ్రొత్త సత్పథము ప్రకాశిస్తూ, ప్రశస్తమౌతుంది.

## 33. ఉన్నత తలాలలోనికి ప్రవేశం

ఆదిశక్తి లీలాకథ సూత్రాలలో ఆధ్యాత్మిక ప్రక్రియలు మరియు మంత్ర విధానము లతో పాటు తత్త్వజ్ఞాన రహస్యములు కూడా ఇమిడి ఉన్నాయి. అయినప్పటికీ శ్రీదుర్గాసప్తశతిలో వర్ణించబడిన లీలాకథ యొక్క ప్రతి శ్లోకం ప్రత్యక్షముగా

మాతభవాని లీలలను రసరమ్యముగా అభివ్యక్తీకరిస్తాయనేది సత్యము. ఆ లీలలను స్ఫృజించిన శక్తి-సంతానము, భవాని భక్తులలో భక్తియొక్క మధురాను భూతిని మేల్కొల్పుతాయి. దీని పారాయణ, శ్రవణం మరియు మననములలో మనస్సు రమించినంతగా ఇతరమైన వాటిలో రమించకపోవటమే కాదు, అసలు స్పందించదు కూడా! కథా ప్రవాహముతోపాటుగా జగన్మాత వివిధ రూపాల భిన్నభిన్న ప్రతిబింబాలు అంతశ్చేతనలో ప్రకటీకరింపబడతాయి. ఆ ప్రాకట్యము ఎంత గాఢంగా ఉంటుందంటే సామాన్యమైన పారాయణ-సాధన ఎప్పుడు ధ్యాన-సాధనగా పరివర్తనం అయ్యింది అన్న విషయమే తెలియదు. మహిమామయి జగన్మాత యొక్క ఈరకమైన అనుభూతి ఎంత సుఖంగా ఉన్నప్పటికీ సాధనా క్రమములో ఇది కేవలము ద్వారమువంటిది మాత్రమే! సాధనా సత్యం యొక్క అనేక రహస్య ఆయామములున్న గర్భములోనే దీని రహస్యములన్నీ కూడా ఉంటాయి. అవన్నీ స్వయముగా ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానం యొక్క ఉన్నత మరియు ఉత్కృష్ట స్వరూపమును ప్రకటీకరిస్తాయి.

ఆదిశక్తి లీలాకథ గతభాగములో ఈ సత్యమే వివరించబడినది. ఈ భాగములో ప్రథమ చరిత్రలోని ప్రథమాధ్యాయములోని నవమమంత్ర అంతర్భావము సుస్పష్టం చెయ్యబడింది. ఈ మంత్రములో చెప్పబడినదేమిటంటే 'రాజ్యాధికారము లాగివేసుకొన బడిన మీదట మహారాజు సురథుడు వేట మిషమీద అశ్వమును అధిరోహించి ఒంటరిగా దట్టమైన అడవి దిశగా సాగిపోయాడు. మహారాజు సురథుని ఈ వనగమనము అతని అంతశ్చేతనలో వివేకము యొక్క ప్రథమాంకురం. ప్రపంచము మరియు దాని మాయామరీచికల గతి-నడక విచిత్రమైనది, విలక్షణ మైనది. అనేకమైన కష్టములు, అణచివేతలకు గురిచేసినప్పటికీ ప్రపంచము మరియు లౌకిక బంధము త్రెగిపోదు, మనిషిని వదిలిపెట్టదు. దారుణమైన బాధను పొందిన తరువాత సంసారబంధనాలను త్రెంచుకునే సమయం ఆసన్నమైనప్పుడు అకస్మాత్తుగా ఒక కెరటము ఎగసిపడి, అది తిరిగి చేతనను గట్టిగా ఒడిపిపట్టుకుంటుంది అని అనుభవజ్ఞులు చెప్తారు. ఆ అలల చేత తడిసిముద్దయిన భావనలు, తిరిగి మనస్సు మరియు జీవితము ఆ విషయమనే బురదలో కూరుకుపోయే విధంగా సాగుతాయి.

ఇందుచేత మహారాజుసురథుడు రాజ్యమును, నగరమును మరియు రాజభవనమును వదిలివెళ్ళుటకు వేట అనే సాకును చూపించవలసి వచ్చినది. రాజాసురథుడు వేటాడవలసిన అవసరమున్నది అన్నది నిజమే అయినప్పటికీ ఎక్కడో,

ఏవో జంతువులను అడవిలో వేటాడటం కాదు, తనలో దాగి ఉన్న దుర్బల ప్రవృత్తులను, స్వీయచిత్తములో వేళ్ళూనుకుని పాతుకు పోయిన దూషిత కర్మసంస్కారా లను వేటాడాలి. ఈ వేట సామాన్యమైనది కాదు, సామాన్యమైన వేటగాడైతే వేటాడటానికి ఈవిధంగా అడవుల్లో తిరుగుతూంటాడు మరియు నిరర్థకంగా వన్యప్రాణులను అన్వేషిస్తూంటాడు. అతనికి నిజమైన భీషణారణ్యము యొక్క చిరునామా తెలియనే తెలియదు. అడవిలో తిరుగాడుతున్నప్పటికీ వేటగాడు నిజానికి అసలైన వనమునుండి దూరంగా అన్వేషిస్తూ ఉంటాడు. ఎందుకంటే రాజాసురథునివలె ఆత్మశక్తియనే అశ్వమున్నవారే నిజానికి ఈ వనములోకి ప్రవేశించగలరు. ఈ ఆత్మశక్తియనే అశ్వమునధిరోహించి చిత్తమనే దట్టమైన అరణ్యములోకి ప్రవేశించ వచ్చును.

అయితే భావచేతనలో వివేకం ఉదయించినప్పుడు, వైరాగ్యము ప్రకాశించినప్పుడే ఇదంతా సంభవమౌతుంది. మహారాజు సురథుని విగతపుణ్యం మరియు తపోప్రభావంచేత అతనిలో ఈ వివేక–వైరాగ్య అంకురములు మొలకెత్తాయి. తద్వారా వాటి బలం ఆధారంగా అతను చెల్లాచెదరైన తన ఆత్మశక్తిని ఏకత్రితము గావించు కొని, ఆ ఆత్మశక్తి అనే అశ్వమును అధిరోహించి గహన చిత్తసీమలోకి కాలుమోపాడు. చిత్తము యొక్క పలు స్థితులను మరియు దాని విస్తీర్ణము గురించి ఆధ్యాత్మిక మరియు తాత్త్విక రీతిలో ఆలోచించినచో నిజముగానే చిత్తము ఒక దట్టమైన మహారణ్యమని తెలుస్తుంది. ఇందులో చెడుసంస్కారాల హింసాత్మక పశువులున్నట్లే, శుభసంస్కారాల సుఖప్రదమైన శీతల ప్రతిబింబాలు కూడా ఉంటాయి. వీటి విభిన్న వృత్తులు సమయానుసారం అంతులేనన్ని రూపాలను ధారణచేస్తాయి. సమర్థ సాధకులకే వాటి నిజస్వరూపమును గుర్తించుట కష్టము. అయితే నిజస్వరూపమును గుర్తించుట ఆవశ్యకమైన అంశము. ప్రతి సాధకుడు తన సాధనా యాత్రలో సమస్త ప్రపంచము మరియు ప్రాపంచిక శక్తులనుండి విముఖుడై కేవలము ఆత్మశక్తి భరోసాతో చిత్తము యొక్క దట్టమైన వనసీమలలోకి ప్రవేశించవలసి ఉంటుంది. సాధకుడు దట్టమైన చిత్తారణ్యములో ఎక్కడో అక్కడ సాధనకు విఘ్నాలను కలిగించి ఎదురుదెబ్బ తీసేందుకు సిద్ధమై ఉన్న సాధనా విఘ్నాలను వేటాడ వలసి ఉంటుంది.

సాధకుడు తన ఈ వేట అనే ప్రయాణములో లక్ష్యమును చేరుకుని విజయుడైనప్పుడు అతనికి సాధనలో ఇకముందు రాబోయే స్థాయి యొక్క ద్వారాలు తెరుచుకుంటాయి. పావనమైన లీలాకథ రాబోయే శ్లోకములో ఈ సాధనలోని రహస్యములు సుస్పష్టము చెయ్యబడినవి.

**స తత్రాశ్రమమద్రాక్షీద్ ద్విజవర్యస్య మేధసః ।**
**ప్రశాన్తశ్వాపదాకీర్ణం మునిశిష్యోపశోభితమ్ ॥ (1/1/10)**

**అర్థము:** సురథుడు వనములో ద్విజశ్రేష్ఠుడైన మేధాఋషి ఆశ్రమమును గాంచినాడు. ఆ ఆశ్రమమున హింసాప్రవృత్తి కలిగిన పశువులు తమ స్వాభావిక గుణమును త్యజించి పరమ శాంతభావముతో మెలగుతున్నాయి. మునియొక్క శిష్యులెంతో మంది ఆ వనశోభను ద్విగుణీకృతముచేస్తున్నారు.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ మనోహరమైన శ్లోకమంత్ర ఆధ్యాత్మిక రహస్యం కూడా ఉత్కృష్టమైనది, మనోహరమైనది. వాస్తవానికి ఇది ఆధ్యాత్మిక సాధకుని సాధనాయాత్ర యొక్క ప్రథమ మజిలి. తన ప్రాయశ్చిత్తభాగమును పూర్తిచేసుకున్న విశేష సాధకులకే ఈ అనుభూతి కలుగుతుంది. ఈ లీలాకథను చదువుతున్న పాఠకులలో నిష్ఠాపూర్వకంగా సాధన చేస్తున్న సాధకులకు, ముఖ్యంగా తమ సద్గురువు కృపను పొందినవారికి, 'సాధన ప్రారంభదశలో ఉన్న ప్రత్యేకమైన సాధకులకు తమ జన్మజన్మాంతర నకారాత్మకకర్మను (negative karma) తప్పనిసరిగా తమ గాఢతమ సాధనాతలములో అనుభవించాల్సి వస్తుంది' అనే విషయం అవగాహన అవుతుంది. సమర్థ సద్గురువు తమ విశేష సాధకులకు సాధన ప్రథమచరణములోనే ఈ సదవకాశమును కల్పిస్తారు. అలా చేయనిచో ఈ నకారాత్మకకర్మ సాధకులను ఏదో ఒక ఉన్నత ఆధ్యాత్మికస్థితినుండి పతనోన్ముఖము గావిస్తుంది. పౌరాణిక సాహిత్యంలో ఇలాంటి పలు ఉదాహరణలు తారసిల్లుతాయి. విశ్వామిత్రమహర్షి అప్సరస మేనక ద్వారా పతనమైన కథ ప్రతి ఆధ్యాత్మిక జిజ్ఞాసువుకు సుపరిచితమే!

ఇందువలన సమర్థసద్గురువు తమ ప్రియశిష్యుడిని సాధనా సమయ ఆరంభములోనే అనేక సంకటములలోకి నెట్టివేసి మున్ముందుగా అతని గతజన్మల కలుషిత ప్రారబ్ధమును అనుభవించేలా చేసి అది సమసిపోయేలా చేస్తారు. ఎందుకంటే భావికాలములో ఎప్పుడూకూడా ఏవిధమైన పతనము యొక్క సవ్వడి వినిపించకూడదనే యోచనతోనే సద్గురువు ఇలా చేస్తారు. తదుపరాంతము సాధకుని అంతర్యాత్ర ప్రారంభమౌతుంది. సాధకుడు తన ఆత్మశక్తిని అధిరోహించి సాధనను ఆరంభిస్తాడు. ఈక్రమములో సాధకుడు తన చిత్తములో ఇంతవరకు పేరుకుని ఉన్న సాధనావిఘ్నాలనన్నింటినీ వేటాడతాడు. ఈ సాధనా పథములో శుభసంస్కారాల

రహదారి అతనిని అంతర్‌ప్రజ్ఞ వరకు చేరుస్తుంది. సాధకుని తన ఈ అంతర్‌ప్రజ్ఞయే 'మేధాఋషి'. స్వీయ– అంతశ్చేతనలో ప్రతిష్ఠితమై ఉన్న తన ప్రియమైన సద్గురువు యొక్క చిద్ఘన చైతన్యస్వరూపమే మేధాఋషి. మహారాజు సురథ రూపుడైన జీవాత్మకు మేధా ఋషితో కలయిక ఆధ్యాత్మిక సాధన యొక్క ఉన్నతాధ్యాయములోకి కాలుపెట్టే ప్రథమచరణం. ఈ ఆధ్యాత్మిక ప్రకాశలోకములోకి సాధకుడు వేసే ప్రథమచరణం.

ఈ స్థితికి చేరుకున్నప్పుడే నిజమైన సాధన ఆరంభమౌతుంది అన్నది సత్యసమ్మతము. దీనికి ముందు కేవలము గతజన్మల కర్మానుభవం నడుస్తూ ఉంటుంది. ఈ పరిస్థితికి అర్థము "ఇక ఇప్పుడు సాధకుని అంతశ్చేతన చక్కదిద్దబడినది" అని. అంతేకాదు, తన ప్రియమైన సద్గురువు అంతర్యామిగా తన అంతశ్చేతనలోనే విరాజమానుడయ్యాడు అని. ఈ స్థితిలో సాధకుని అంతర్ వివేకము ప్రఖరతతో ప్రదీప్తమౌతుంది, ఉజ్జ్వలమౌతుంది. ఈ స్థాయిలో సాధకునికి తన ప్రశ్నలకు, జిజ్ఞాసలన్నింటికి సమాధానం స్ఫురిస్తుంది. ఈ అద్భుతస్థితిలో అన్నిరకాలైన అంతర్ విరోధములు సమాప్తమైపోతాయి. శుభమైన మరియు ప్రకాశ పూర్ణమైన ప్రవృత్తులన్నీ ఈ దివ్యావస్థలో అనంతానంతమవుతాయి, ప్రకాశిస్తాయి. ఇవే మేధాఋషి శిష్య సముదాయం. ఇతర గ్రంథాలలో ఈ మేధా మహర్షిని గూర్చి చెయ్యబడిన వర్ణనయే దేవీగాథలోకూడా చెయ్యబడినది. దేవీభాగవతములో 'సుమేధుడు' అనే నామముతో వర్ణించబడినాడు. బ్రహ్మవైవర్తపురాణములో 'మేధస్' అనే పేరున ఉటంకించబడినాడు. అయితే ఆధ్యాత్మిక సాధకుల అనుభూతిలో ఈయన 'అంతర్‌ప్రజ్ఞ'గా భాసిస్తారు. ఆ అంతర్‌ప్రజ్ఞ మరింత వికసించి 'ఋతుంభరాప్రజ్ఞ'గా పరిణమిస్తుంది. ఈ ఋతుంభరాప్రజ్ఞ ఉదయించగానే సాధకుడు సందేహములు మరియు ప్రశ్నలన్నింటినుండి విముక్తుడౌతాడు అనగా అతనికి సమాధానములు స్ఫురిస్తాయి. ఈ మంత్ర శ్లోకములో దాగిన ఈ దార్శనిక–ఆధ్యాత్మిక సత్యముతోపాటు దీనికి స్వీయమంత్రసాధన, విధానము కూడా ఉన్నది. అది క్రిందన ఇవ్వబడుతున్నది.

## సాధనా విధానము

**వినియోగః ఓం అస్య శ్రీ "స తత్రాశ్రమమద్రా–క్షీద్" ఇతి సప్తశతీ దశమ–మన్త్రస్య శ్రీబ్రహ్మఋషిః, శ్రీమహాసరస్వతీదేవతా, ప్రేం బీజం, ధర్మధారిణీశక్తిః, శ్రీభైరవీమహావిద్యా, సత్త్వగుణం, నేత్ర జ్ఞానేన్ద్రియం, ఆశా రసం, వాక్ కర్మేన్ద్రియం,**

మధ్యమ స్వరం, వాయుః తత్త్వం, శాన్తికళా, ద్రాం ఉత్కీలనం, క్షోభిణీ ముద్రా, మమ జ్ఞాన భక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ వాగ్బీజ-స్వబీజ-లోమ-విలోమ పుటితోక్త దశమ మన్త్రజపే వినియోగః॥

## న్యాసః

| కరన్యాసః | షడంగన్యాసః | |
|---|---|---|
| ఓం ఏం వ్రేం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| నమోనమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| స తత్రాశ్రమమద్రాక్షీద్ | మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| ద్విజవరస్య మేధసః | అనామికాభ్యాం నమః | కవచాయహుమ్ |
| ప్రశాన్తశ్వాపదాకీర్ణం | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయ వౌషట్ |
| మునిశిష్యోపశోభితమ్ | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయఫట్ |

## ధ్యానం

ఘణ్టాశూలహలాని శఙ్ఖముసలే చక్రం ధనుః సాయకమ్ ।
హస్తాబ్జైర్దధతీం ఘనాన్తవిలసచ్ఛీతాంశుతుల్య ప్రభామ్ ॥
గౌరీదేహసముద్భవాం త్రిజగతామాధారభూతాం మహా ।
పూర్వామత్ర సరస్వతీమనుభజే శుమ్భాదిదైత్యార్దినీమ్ ॥

## మంత్రం

ఓం ఏం వ్రేం నమః
స తత్రాశ్రమమద్రాక్షీద్ ద్విజవర్యస్య మేధసః ।
ప్రశాన్తశ్వాపదాకీర్ణం మునిశిష్యోపశోభితమ్ ॥
నమో వ్రేం ఏం ఓం ॥ ॥ **10** ॥
**1000** జపాత్ సిద్ధిః తిలఘృత హోమః ।

**గాయత్రీమహామంత్రజప – 10,000, గాయత్రీ విధానేన దశాంశ హోమః।** గాయత్రీమహామంత్రజపం 10,000 చెయ్యాలి. గాయత్రి విధానమును అనుసరించి నువ్వులు, నెయ్యిని కలిపి అందులో పదవవంతు హోమము. 10 మాలల గాయత్రి, 1 మాల సప్తశతీమంత్రము । ఈవిధంగా పదిదినములు అనుష్ఠించి, ఆ తరువాత ప్రతిఒక్కదానికీ దశాంశముతో ప్రత్యేక హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి :** అంతర్‌ప్రజ్ఞ జాగరణ

**లౌకిక ఫలశృతి :** కష్టకాలములు, సంకటములలో సరియైన, పరిష్కారమును సూచించే మార్గదర్శకుడు లభించుట.

గాయత్రీమంత్రముతోపాటు సమన్వితమైన ఈ సప్తశతీమంత్ర సాధన ప్రభావము, పరిణామము ఆశ్చర్యము గొలిపేది. ఈ సాధనలో అన్నింటికంటే మహత్వపూర్ణమైన విషయము ఏమిటంటే – దుఃఖములు, సంకటములు, కష్టములు ఆసన్నమైనప్పుడు తన వారు అనుకునే వారందరూ తనను విడిచిపెడతారు, అలాంటి సమయములో కూడా దయామయి అయిన మాత అంతఃప్రేరణగా నిలుస్తుంది లేదా ప్రత్యక్ష సమాధానమునందించే సమర్థ మహామానవుల రూపములో ప్రకటితమై ఎదుట నిలుస్తుంది. మాతను ఆర్తిభావనతో ఎలుగెత్తి పిలవటమే సాధకుని పని. గాయత్రీ మంత్రము మరియు సప్తశతీమంత్ర సమన్విత సాధనను నిరంతరము చేస్తూ ముందుకు సాగాలి. స్వయముగా మాతయే మిగిలిన విషయములను సంబాళిస్తుంది. 'తన సంతానము కొరకు భగవతి కోశాగారము ఎల్లవేళలా సమృద్ధిగా ఉంటుంది మరియు దయ నిరంతరము వర్షిస్తూ ఉంటుంది' అనే సత్యమును మాతయందు, ఆధ్యాత్మికతయందు విశ్వాసము, నమ్మకమున్న వారు తమ సాధనను చేస్తున్నప్పుడు అనుభూతి చెందుతూనే ఉంటారు. పలుమారులు ఈ సాధన యొక్క పరిణామం మనఃస్థితి మరియు పరిస్థితి అను రెండింటిలోనూ దృగ్గోచరమౌతుంది.

# 34. మార్గదర్శనము యొక్క సుయోగమును ప్రాప్తింపజేస్తుంది

ఆదిశక్తి లీలాకథా శృంఖల ఒకదాని తరువాత ఒకటి చొప్పున అనేక ఆధ్యాత్మిక ఆయామములను అభివ్యక్తం చేస్తుంది. శ్రీదుర్గా సప్తశతి కామనలను పరిపూర్తిచేసే, సంకటములను దూరం చేసే కల్పలత మరియు కల్పతరువు అని సాధారణ జనులు భావిస్తారు. ఈ అవగాహన కారణముగానే బహుశః జనబాహుళ్యం కర్మకాండ మరియు సకామసాధనా విధానాలలో చిక్కుకుని కొట్టుమిట్టాడు తుంటారు. 'శ్రీదుర్గాసప్తశతి యొక్క ప్రవేశద్వారము ఎటువంటి దంటే అక్కడికి ప్రవేశం లభించడముతోపాటు పరీక్షా విధానము కూడా ఉంటుంది' అన్న సత్యమును విస్మరిస్తున్నారు. ఈ విధానములో భక్తుల యొక్క భక్తి, జ్ఞానుల యొక్క జిజ్ఞాస, అనుభవజ్ఞుల బోధనలు పరీక్షించబడతాయి, తమను తాము ఆధ్యాత్మిక సాధకులమని చెప్పుకునేవారి వివేక, వైరాగ్యములు ఎంత దృఢమైనవి, సంకల్పయుక్తమైనవి అని పరిశీలించబడతాయి.

పరీక్ష, ప్రామాణికతల గీటురాళ్ళపై తమ స్వచ్ఛతను నిరూపించుకున్నవారే తమతమ అనుభూతులలో ఆధ్యాత్మిక ఆయామములను స్పృశించగలరు. అటువంటివారి భావచేతన లోనే జీవనసాధనా గవాక్షం తెరుచుకుంటుంది. చిత్తము యొక్క దట్టమైన అరణ్యము అతి విషమయమని వారు అప్పుడు గ్రహించ గలుగుతారు. సామాన్య మానవులేకాదు, మీదుమిక్కిలి ఉచ్చకోటికి చెందిన తాపసులు, సాధకులు సైతము అందులో ఉన్న సంస్కారాలనే దుర్గమమైన మార్గాలలో దారితప్పి చిక్కుకుపోయి తమ ఉనికినే కోల్పోతారు, తమను తాము మర్చిపోతారు, భగవంతుడుని మర్చిపోతారు. ఆ అరణ్యమే అంత దుర్గమమైనది, భయావహమైనది. అందులోకి ప్రవేశించడము సులభమేకానీ మార్గమును పట్టుకొనుట కష్టము. ఆ అరణ్యములో వెలుగులు నిండిన కాలిబాటను ఏర్పరచుకొనుట కొరకు భగవతి భక్తులు తమ సంపూర్ణ ఆత్మబలమును పణంగా పెట్టవలసి ఉంటుంది. ఆత్మబలమనే సమర్థవంతమైన అశ్వమును అధిరోహించి ప్రయాణించినప్పుడు మాత్రమే ఈ విషమయమైన భీషణారణ్యములో ఒక మార్గమును ఏర్పరచుకొనగలరు.

ఆత్మబలమైనా, శుభసంస్కారాల ప్రభావమైనా, అన్నింటినీ మించి భగవతి జగదంబ కృపయైనా, అది సాధకుడిని నిశ్చయంగా అంతర్వివేకం, అంతర్‌ప్రజ్ఞ వరకు చేరుస్తుంది. అంతర్‌ప్రజ్ఞ అనేది చేతన యొక్క ప్రథమ ప్రకాశపూర్ణమైన స్థితి. ఇక్కడ ఊహ కాక, అనుభూతి బలవత్తరంగా ఉంటుంది. అంతేకాదు అసమానత స్థానములో సమత్వం, విరోధ స్థానములో సమత, విద్వేషం స్థానములో ఆత్మీయత సహజంగానే ఉంటాయి. ఇక్కడికి చేరుకున్నప్పుడు ప్రగాఢమైన శాంతి ప్రప్రథమముగా అనుభవ మౌతుంది. మహారాజు సురథునికి కూడా మేధామహర్షి ఆశ్రమములోకి ప్రవేశించినప్పుడు ఈ అనుభవమే కలిగినది. అంతర్‌ప్రజ్ఞ యొక్క వెలుగు ఎక్కడ ఎంత ప్రగాఢంగా ఉంటుందో, అక్కడే ఈ అనుభవం కూడా అంత ప్రగాఢంగా ఉంటుంది. అక్కడ దోషం, దుర్భావనలు నిలువజాలవు. మహర్షి వాల్మీకి ఆశ్రమములో అనేకానేక పశుపక్ష్యాదులు కోలాహలం చేస్తున్నాయి. వాటిలో వాటికి ఏ రకమైన వైరం, భావం లేదు, అవన్నీ ప్రసన్న భావంతో విహరిస్తున్నాయి.

సుఖవంతమైన, శాంతిప్రదమైన, ద్వేషరహిత, దోషముక్త, దుర్భావనలు లేనటువంటి ఆ ఆశ్రమము సురథమహారాజు మనస్సును అమితముగా ఆకట్టుకున్నది. ఆదిశక్తి లీలాకథ గత భాగములో ఈ సత్యమే ఉల్లేఖించబడినది. మహారాజు సురథుడు మహర్షియైన మేధుని ఆశ్రమమును దర్శించి ముగ్ధుడై నిలిచి పోయాడు. అతను ఏ రాజ్యమునుండి అయితే ఆశ్రమమునకు వచ్చాడో అక్కడ ద్వేషం, దోషం, దుర్భావనల బాధాకరమైన అనుభవాలను అతను పలుమార్లు చవిచూశాడు. అతను ఆత్మీయులలోనే పరాయిత్వమును చూచాడు. విశ్వాసపాత్రులు అన బడేవారు అందించిన విశ్వాసఘాతుకం అనే విషమును అతను లెక్కలేనన్నిమార్లు పానం చేశాడు. ఆ అనుభూతి అతనికి ఎంత గాఢముగా కలిగినదంటే విశ్వాసం అనే శబ్దమే అతనికి విషప్రాయం అయింది. అతని గతానుభవములన్నీ బాధాకరమైనవి, దుఃఖమయ మైనవి!

అయితే మేధాఃమహర్షి ఆశ్రమములోకి అడుగిడుతూనే అతనికి ఒక కొంగ్రొత్త అనుభూతి ఎదురైంది. ఆ అనుభవమే అతని కాళ్ళను కట్టిపడవేసినది. ఈ సత్యమే ఈ పరమపావనమైన ఆదిశక్తి లీలాకథ యొక్క తరువాతి శ్లోకములో అభివ్యక్తీకరించ బడినది.

**తస్థౌ కంచిత్స కాలం చ మునినా తేన సత్కృతః ।**
**ఇతశ్చేతశ్చ విచరంస్తస్మిన్మునివరాశ్రమే ॥ (1/1/11)**

**అర్థము:** ఆ సురథమహారాజు ఆ మేధాముని ద్వారా స్వాగత సత్కార గౌరవములను అందుకున్నవాడై మునిశ్రేష్ఠుని ఆ ఆశ్రమము లోనే కొంత తడవు ఇటూ అటూ తిరుగాడుతూ గడిపాడు.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ శ్లోకమంత్రం రహస్యమయమైనదే కాక సౌందర్యపూర్ణమైనది. ఇందులో ఆధ్యాత్మిక సాధకుని ప్రప్రథమ ఆధ్యాత్మికానుభూతి యొక్క సారాంశమున్నది. జీవితములోని లెక్కలేనన్ని బాధలు, అమితమైన వేదనలు నిండిన అనుభవములు చవిచూసిన పిమ్మట ఇది మొట్టమొదటి ఆనందమును అందించే ప్రీతిపూర్ణమైన అనుభూతి. శ్రీమద్భగవద్గీత భాషలో 'జీవన విషాదం యోగరూపమును పొందుట' అని చెప్పబడిన పావన క్షణమిదే! పతంజలిమహర్షి వాక్కులలో చెప్పాలంటే యోగసాధన యొక్క సమస్త అనుశాసనములు 'అథ' అనే దాని అనుభవములను అన్నింటినీ అధిగమించి ఋతుంభరా ప్రజ్ఞగా రూపుదాల్చుట. గాఢాంధకారము తొలగిన పిమ్మట వెలుగు రేకులు దృగ్గోచరమయ్యే ఈ క్షణం పరమ సుఖప్రదమైనదే కాక, పరమ ఆశ్చర్యకరమైనది కూడా!

జీవితములోని సమస్త నకారాత్మక (negative) అనుభవాలను సకారాత్మకముగా (positive) మలచుకునే కళను తెలుసుకున్న వారికి ఈ అనుభూతి కలుగుతుంది. ఆ అనుభూతిచెందినవారిలా ప్రవచించారు. "బాధలోకూడా ఒక రసాత్మకత ఉన్నది। బాధలో కూడా లోతైన ఆధ్యాత్మిక రహస్యములున్నాయి. బాధలో కూడా అద్భుతమైన ఆధ్యాత్మిక మాధుర్యమున్నది." జీవితములోని వేదనలలో కూడా ఆధ్యాత్మిక అనుభూతులు జన్మతీసుకుంటాయి అని తెలుసుకున్నవారు వేదన లేకుండా తమ ఆధ్యాత్మిక ఆకారమును సాకారముగా మార్చుకొనలేరు. వేదన అనే పర్వతమును కూల్చివేసినప్పుడే ఆ దివ్యమైన క్షణం ప్రకటితమవుతుంది.

సద్గురువు లభించుటకూడా భగవతి ఆదిశక్తి కృపయొక్క ప్రథమ సాక్షాత్కారం వంటిదే. భగవతి నిజముగానే తన ప్రియమైన భక్తజనులపట్ల కృపను చూపించినచో ఆ తల్లి వారి అంతర్భావనలలో ఋతుంభరాప్రజ్ఞగా రూపుకట్టి సాక్షాత్కరిస్తుంది. 'దేవి' హృదయ రూపమనే వింధ్యాచలపర్వతములలో మహర్షిమేధారూపములో

సంప్రాప్తమౌతుంది. ఏ సాధకునకైనా మేధామహర్షిని కలుసుకోవటం అంత సులభం కాదు. జీవితాంతము అనుభవించిన బాధలు పుణ్యకర్మలుగా మారినప్పుడే ఇలా జరుగుతుంది, ఇది సంభవ మవుతుంది. జీవనపర్యంతము సహించిన దెబ్బలు తమ చరమ పరిణతిరూపంగా ఆధ్యాత్మిక అవరోధాలను సమర్థవంతముగా దూరం చేయుటలో సఫలం అవుతాయి. కేవలము అప్పుడే అంతశ్చేతనలో జగన్మాత కృప సద్గురు వాక్కుగా రూపుదాల్చి వినబడుతుంది. సాధకుడు దేవి దయ చేత సద్గురువు సాన్నిధ్యమును పొందుతాడు. కృపాపూర్ణమైన అనుభూతిని దర్శింపజేసే ఈ శ్లోక మంత్రమునకున్న తనదైన విశిష్ట సాధనావిధానము క్రిందన ఇవ్వబడుతున్నది.

## సాధనా విధానము

**వినియోగః : ఓం అస్యశ్రీ 'తస్థౌ కశ్చిత స కాలం' ఇతి సప్తశతీ ఏకాదశ మన్త్రస్య శ్రీనారదఋషిః, శ్రీమహాలక్ష్మీదేవతా, హ్రీం బీజం, ధర్మచారిణీశక్తిః, కమలామహావిద్యా, సత్త్వగుణః, ఘ్రాణజ్ఞానేన్ద్రియం, సౌమ్యరసః, పాద కర్మేన్ద్రియం, శాన్తస్వరం, భూతత్త్వం, ప్రవృత్తికళా, శ్రీం ఉత్కీలనం, ధేనుముద్రా, మమ జ్ఞానభక్తివైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాద సిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ-లోమ-విలోమ పుటితోక్త ఏకాదశ మన్త్రజపే వినియోగః ॥**

## న్యాసః

**కరన్యాసః షడంగ న్యాసః**

**ఓం ఏం హ్రీం అంగుష్ఠాభ్యాం నమః హృదయాయ నమః**

**నమో నమః తర్జనీభ్యాం నమః శిరసే స్వాహా**

**తస్థౌ కశ్చిత్స కాలం చ మధ్యమాభ్యాం నమః శిఖాయై వషట్**

**మునినాతేన సత్కృతః అనామికాభ్యాం నమః కవచాయ హుమ్**

**ఇతశ్చేతశ్చ విచరన్ కనిష్ఠికాభ్యాం నమః నేత్రత్రయాయ వౌషట్**

**తస్మిన్మునివరాశ్రమే కర-తలకరపృష్ఠాభ్యాం నమః అస్త్రాయ ఫట్**

## ధ్యానమ్

**ఓం అక్షస్రక్పరశుం గదేషుకులిశం పద్మం ధనుష్కుణ్డికాం ।**

**దణ్డం శక్తిమసిం చ చర్మ జలజం ఘణ్టాం సురాభాజనమ్ ।**

**శూలం పాశసుదర్శనే చ దధతీం హస్తైః ప్రవాల-ప్రభామ్ ।**
**సేవే సైరిభమర్దినీమిహ మహాలక్ష్మీం సరోజస్థితామ్ ॥**

## మంత్రం

**ఓం ఏం హ్రీం నమః**
**తస్థౌ కంచిత్స కాలం చ మునినాతేన సత్కృతః ।**
**ఇతశ్చేతశ్చ విచరం స్తస్మిన్మునివరాశ్రమే ॥**
**నమో హ్రీం ఏం ఓం ॥11॥**

**1000 జపాత్ సిద్ధిః - కుంకుమ - పాయసైః హోమః । గాయత్రీమహామంత్ర జపం - 10,000, గాయత్రీ విధానేన దశాంశ హోమః ॥** గాయత్రీమహామంత్ర జపం 10,000 చేయాలి. గాయత్రీ విధివిధానముతో దశాంశ హోమము చేయాలి.

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈవిధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత దశాంశ హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి :** ప్రకాశపూర్ణమైన అంతర్‌ప్రజ్ఞ యొక్క సాన్నిధ్యప్రాప్తి.

**లౌకిక ఫలశృతి :** మార్గదర్శకుని యొక్క స్నేహపూర్ణమైన సాన్నిధ్య సౌలభ్యము

గాయత్రీమంత్రముతో పాటు ఈ సప్తశతీమంత్ర సంపుటీ కరణం శీఘ్ర ఫలదాయినిగా నిలుస్తుంది. 'జీవితము బాధలు, కష్టములు మరియు కురీతులతో నిండి ఉన్నది, బయటపడటానికి ఏ మార్గమూ దృగ్గోచరమగుటలేదు' అన్నది మనలో చాలామందికి అనుభవపూర్వకమైన విషయమే. నిజము చెప్పాలంటే వ్యాకులతకు కారణం అజ్ఞానం, మార్గదర్శక లేమి. ఈ మంత్రమును భక్తి పూర్వకముగా సాధన చేసినచో మార్గదర్శకుని యొక్క మార్గదర్శనము లభించుట అనే సుయోగము సంప్రాప్తమవుతుంది. ప్రత్యక్ష, పరోక్ష మార్గదర్శనం పొందే సుయోగం ఈ సాధన ద్వారా లభ్యమగుట సునిశ్చితం. ఈ సాధన చేసేవారి అంతఃప్రేరణ స్వయముగానే ప్రకాశమయమై ప్రస్ఫుటిస్తుంది. అలా జరిగినప్పుడు ఆపదలు, వేదనల యొక్క సమూహములు స్వయముగానే క్షీణించిపోతాయి. జీవితములో సంపూర్ణముగా నవకాంతులు ప్రసరించే సదవకాశం ఉద్భవిస్తుంది.

# 35. మోహపాశములు వివేకమును కట్టి పడేస్తాయి

ఆదిశక్తి లీలాకథా స్వరం ప్రకృతిలోని ప్రతికణములోను వినిపిస్తూ ఉంటుంది. అనంతముగా విస్తరించి ఉన్న ప్రకృతి యొక్క లోగిలిలో ఎన్నెన్ని రూపములు, ఆకారములు ఉన్నాయో, వాటన్నింటికి ఆధారము భగవతి ఆదిశక్తియే! ప్రాణులైనా లేక వనస్పతులైనా లేక దేవాసురులైనా లేక వివిధ లోకములు లేక సువ్యాప్తమై ఉన్న బ్రహ్మాండములైనాసరే, వాటన్నింటి రూపం మరియు ఆకారములలో జగన్మాత ఆదిశక్తియే వ్యాపించి ఉన్నది. మనిషి చిత్తము, చింతన, చేతనల ప్రత్యేక తరంగాలు, కదలికలు అన్నీ ఆదిశక్తి లీలాకథ యొక్క శృంఖలతో అనుసంధానమై ఉన్నాయి. మాత భవానినుండి వేరుగా ఏదీ లేదు. సంపూర్ణ అస్తిత్వము జగన్మాతనుండే ఉద్భవించి, ఆమెలోనే పల్లవించి, తిరిగి ఆమెలోనే విలీనమైపోతుంది. మనిషి తన చిత్తము, చింతన మరియు చేతనలను సంస్కరించుకునే మార్గములో ఏయే రీతులలో ముమ్ముందుకు సాగుతుంటాడో, ఆయా రీతులలోనే అతనిలో స్వయముగా ఈ సత్యము సుస్పష్టముగా ప్రకటితమవుతుంది.

అయినప్పటికీ ఈ సంస్కరించబడే పథము సుగమమైనది కాదు. ఈ త్రోవ కంకర, మట్టిదిబ్బలు, రాళ్ళురప్పలు, ముళ్ళ పొదలతో కూడినది. కర్మసంస్కారముల కంకర, రాళ్ళురప్పలు అక్కడుంటాయి. ఈ మార్గమున ప్రయాణిస్తున్నప్పుడు కొన్నిచోట్ల పుణ్యముల యొక్క పుష్పములు లభిస్తే, మరికొన్నిచోట్ల పాపపంకిలములో కాళ్ళు కూరుకుపోతాయి. స్మృతుల యొక్క దట్టమైన వనములు, సంస్కారముల యొక్క పర్వత శిఖరములు, లెక్కలేనన్ని మోహపాశములు ఇక్కడ అడుగడుగునా అవరోధములు కల్పిస్తాయి. అయినప్పటికి సాధనకు సమర్పితమై ఉన్న, దృఢసంకల్ప బలము కలవారు నిరంతరము ముమ్ముందుకు సాగుతూనే ఉంటారు. దుర్గమత్వము వారిని అలసటకు లోనుచెయ్యలేదు, సుగమత్వము వారిని విశ్రాంతి తీసుకునేటట్లు చేయలేదు. లీలామయి యొక్క ఈ లీలాకథలో వర్ణించబడిన మహారాజు సురథుడు మరెక్కడో లేదు. అతను మా యొక్క, మీ యొక్క, మనందరి యొక్క జీవాత్మయే! అతని ప్రతి అనుభూతి మనందరి స్వీయఅనుభూతియే! అతని జీవితములో ఎదురునిలిచే సంకటములు మన స్వజీవనము సంకటములే! అవన్నీ మమతామయి అయిన మాత కృపచేత తిరస్కరించబడి, పటాపంచలైపోతాయి.

మహారాజు సురథుని జీవితములోవలెనే ప్రతి సాధకుని జీవితములో కష్టములు రావటం, మాత కృప ప్రసరించబడటం అనే అనుభవము ఎన్నడూ సమాప్తమవ్వదు. అంతర్మనస్సు యొక్క అంతర్వనములో సాధన యొక్క ప్రతి కొంగ్రొత్త ఆయామము సాధకుడు అన్నిరకాలుగా క్రొత్త సంకటములతో తలపడేటట్లు చేస్తుంది. ఈ సంకటములు సమీపించినంతనే జగన్మాత స్మరణ మరియు సమర్పణలో భావనాత్మకముగా లీనమైన సాధకుని భావచేతనలో తక్షణమే భగవతియొక్క సంపూర్ణమైన నవీనరూపం ప్రకటితమవుతుంది. తత్ప్రభావముచేత కేవలము ఆపదలు సమాప్తమైపోవటమేకాదు, సాధకుడు ఒక క్రొత్తశక్తిని పొంది సమర్థుడు, శక్తి సంపన్నుడుగా రూపుదాలుస్తాడు. సాధకుడు మాతను విస్మరించి తిరిగి మోహముతో నిండిన స్మృతులలో మునిగిపోయినప్పుడు క్లేశములు ఎదురు నిలుస్తాయి. మరల సాధకునికి ప్రపంచము మరియు ప్రాపంచిక బంధుత్వములు స్మరణలోకి వస్తుంటాయి. ఇందుచేత అనుభవజ్ఞులు 'సాధనా పథములో ప్రయాణిస్తున్న సాధకునికి భగవతిని విస్మరించడం కంటే మించిన పెద్ద విపత్తు ఏదీ ఉండదు, దేవిని స్మరించడమును మించిన సంపద మరేదీ లేదు' అని చెబుతారు.

ఆదిశక్తి లీలాకథ గత భాగములో సురథమహారాజు ఆదిశక్తి కృపచేత వనములోని ఆపదలు, అవరోధములనన్నింటిని అధిగమించి మహర్షియైన మేధుని ఆశ్రమమునకు చేరుకున్నాడు. ఈ ఆశ్రమము అంతా మేధామహర్షి యొక్క తపః కాంతులతో నిండి ఉన్నది. అక్కడ నలుచెరగులా శాంతి యొక్క సుఖప్రదమైన సామ్రాజ్యం ఉన్నది. ఆశ్రమములో వైరము లేదు, అసమానతా లేదు. ఇక్కడ పాశవికత్వము కూడా పరివర్తితమై పావనత్వము యొక్క రూపుధరించినది. మేధా మహర్షి ఆశ్రమము అద్భుతమైనది, ఆశ్చర్యకరమైనది. మహారాజు సురథుడు కూడా ఆశ్రమములో తనకు తాను సంతాపములనుండి ముక్తుడనైనట్లుగా అనుభూతి చెందాడు. ఇక్కడ కాలుపెడుతూనే రాజుకు ఇప్పటివరకు తాను గతకాలములో సహించిన కష్టములు, సమస్త విషాదములు, బలహీనతలు, వేదనలనుండి ముక్తి లభించినది. అయితే ఈ విశ్రాంతి సమయములో అతని మోహపు బీజములు మరల విజృంభించసాగాయి. ఆత్మీయులు అని అనుకున్నవారంతా అతనితో పరాయివారివలె నీచముగానే ప్రవర్తించారు, వారందరు అతనికి ఇప్పుడు గుర్తుకు రాసాగారు.

స్మృతుల యొక్క సంవేదనలు పలురకాలుగా అతని చింతన, చేతన మరియు చిత్తభూమిని ఆవరించినాయి. మోహముచేత వికలుడైన మహారాజు సురథుని ఈ మానసికస్థితి పరమ పావనమైన ఆదిశక్తి లీలాకథ యొక్క తరువాతి శ్లోకములో వర్ణించబడినది.

**సోఽచిన్తయత్తదా తత్ర మమత్వాకృష్టచేతనః ।**
**మత్పూర్వైః పాలితం పూర్వం మయా**
**హీనం పురం హి తత్ ॥ (1/1/12)**

**అర్థము:** ఆ సురథమహారాజు మమత చేత ఈ రీతిగా ఆలోచించసాగెను. పూర్వకాలములో మా పూర్వజులు ఏ నగరమును పరిపాలించినారో అది ఇప్పుడు నాకు దూరమైనది.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ శ్లోకమంత్రము కేవలము మహారాజు సురథునిదేకాక, స్వయముగా మనందరి జీవితాల యొక్క సాధనానుభూతి! జగన్మాత యొక్క అనంతమైన కృపచేత జీవితములో సద్గురువు లభిస్తాడు కానీ మనము ఆ సాన్నిధ్యమును పొందికూడా ఆయన సమ్ముఖమునకు చేరలేకపోతున్నాము. సదా ఆయన నుండి విముఖులమై మెలగుతున్నాము. ఇది స్వీయ దుష్కృతజన్య దౌర్భాగ్యము చేత ఎదురైన అవరోధము అనండి లేక మరేదైనా అనండి, కానీ తత్ఫలితముగా గురువునుండి విముఖులమై జీవిస్తున్నాము. ఆయన దగ్గర ఉంటూకూడా మానసికముగా ఆయననుండి దూరముగానే ఉంటున్నాము. ప్రాపంచిక సంబంధముల పట్ల మనకు గల మోహమే దానికి కారణము. అందువల్ల మనము మన ఆత్మకు పరమ స్నేహితుడు, సుఖప్రదుడు, సహృదయుడు అయిన సద్గురువు యొక్క ప్రేమానుభూతిని అందిపుచ్చుకోలేకపోతున్నాము. సద్గురువు మనలను తిరిగి తిరిగి తమవానిగా చేసుకుంటున్నారు, తమకు చెందినవారిగా స్వీకరిస్తున్నారు, ఆయనకు మనకు మధ్యగల అభిన్నత్వమును బోధిస్తున్నారు, కానీ మనము ప్రతీసారి ఆయననుండి ముఖం త్రిప్పుకుంటున్నాము, విముఖులమై మెలగుతున్నాము.

అలా ఎందుకు చేస్తామంటే మన చేతన మమతతో ఆవరించబడి ఉంటుంది. మన వివేకము అనే సూర్యుడు మోహములనే మేఘమాలికల చేత కప్పివేయబడి ఉన్నాడు. సామాన్యమైన సాధకులతోపాటు మహామానవుల జీవితములలో కూడా

ఈ స్థితి వస్తుంది. భగవతి మహాకాళి యొక్క అనన్య సాధకులైన శ్రీరామకృష్ణపరమహంస జీవితమునకు చెందిన ఒక రహస్యమైన విషయము కలదు. ఆ రోజులలో శ్రీరామకృష్ణ పరమహంస దక్షిణేశ్వరములోని కాళీమందిరములో నివసిస్తూ ఉండేవారు. కాళీమాత పూజ, అర్చన, వందనములు ఆచరిస్తూ అక్కడ ఆయన తమ లీలాసహచరుల కోసము ఎదురుచూస్తున్నారు. తమ యుగ కర్మను ముమ్ముందుకు తీసికెళ్ళుటలో సహాయపడే ఆత్మీయుల కొరకు ఆయన ప్రతీక్షిస్తున్నారు. ఆయన మాటలలోనే చెప్పాలంటే 'అప్పుడు మేము ఇంటి పైభాగమునకు చేరుకుని అందరినీ ఆహ్వానిస్తు ఉండేవారం. వారిని శీఘ్రమే మావద్దకు పంపమని మాతను వేడుకుంటూ ఉండేవారం.'

ఆయన పిలుపు ప్రభావము మరియు మాతకృప ఈ రెంటి సంయుక్త ప్రభావము వలన ఒక్కొక్కరుగా అందరు రాసాగారు. ఈ క్రమములోనే తరుణవయస్సులోకి అడుగుపెడుతున్న నరేంద్రనాథ్ కూడా వచ్చాడు. అతనిని చూస్తూనే శ్రీరామకృష్ణ పరమహంస హర్షముతో భావవిహ్వాలులయ్యారు. ఆయన నరేంద్రుడిని భావభరిత హృదయముతో ఆహ్వానించినారు, కానీ ఇది ఆయన పిచ్చి అయి ఉండవచ్చునేమోనని నరేంద్రుడు భావించినాడు. అప్పుడు శ్రీరామకృష్ణపరమహంస తమ మరియు నరేంద్రుల మధ్య ఉన్న సంబంధములను గుర్తుచేయుట కొరకు నరేంద్రుని ఛాతిని చేతితో స్పృశించారు. తక్షణమే నరేంద్రుని చేతన ఒక్కసారిగా ఊర్ధ్వగామియైనది. ఈ వేగమును నరేంద్రుడు సహించలేకపోయినాడు. 'అరే! నాకు తల్లిదండ్రులున్నారు, సహోదరులున్నారు, నువ్వు నన్నెక్కడికి తీసికెడుతున్నావు?' అని పెద్దపెద్దగా అరవసాగాడు. శ్రీరామకృష్ణపరమహంస వివశులై నరేంద్రుడిని సామాన్య భావభూమికలోకి తీసుకురావలసి వచ్చినది. మహారాజు సురథుని చిత్తము, మేధామహర్షి సాన్నిధ్యములో ఉంటూ కూడా మోహగ్రస్తయైనది. తననుండి బలవంతముగా లాగుకొన బడిన నగరమును గురించే అతను మళ్ళీ మళ్ళీ ఆలోచిస్తున్నాడు. తిరిగి తిరిగి గడచిన స్మృతులు అతనిని చుట్టుముట్టసాగాయి. మోహపు సంకెళ్ళు అతని వివేకమును బంధించసాగాయి. అతని సాధనాపథములో ఈ క్రొత్త సంకటము ఉద్భవించినది.

ఈ శ్లోకమంత్రములో దాగి ఉన్న ఈ సాధనా అనుభవమే కాక దీని సాధనావిధానముకూడా క్రిందన ఇవ్వబడుతున్నది.

## సాధనా విధానము

వినియోగః : ఓం అస్యశ్రీ 'సోఽచిన్తయత్తదా' ఇతి సప్తశతీ ద్వాదశ మన్త్రస్య శ్రీవేదవ్యాసఋషిః, శ్రీమహాకాళీ దేవతా, క్లీం బీజం, హాకినీశక్తిః, ధూమా మహావిద్యా, రజోగుణః, త్వక్ జ్ఞానేన్ద్రియం, గాంభీర్య రసః, గుద కర్మేన్ద్రియం, గంభీర స్వరం, జలతత్త్వం, నివృత్తి కళా, ఘూం ఉత్కీలనం, మత్స్య ముద్రా, మమ జ్ఞానభక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ-లోమ-విలోమ పుటితోక్త ద్వాదశ మన్త్రజపే వినియోగః ॥

### న్యాసః

| కరన్యాసః | షడంగన్యాసః |
|---|---|
| ఓం ఏం హ్లీం | అంగుష్ఠాభ్యాం నమః హృదయాయ నమః |
| నమో నమః | తర్జనీభ్యాం నమః శిరసే స్వాహా |
| సోఽచిన్తయత్తదాతత్ర | మధ్యమాభ్యాం నమః శిఖాయైవషట్ |
| మమత్వాకృష్టచేతనః | అనామికాభ్యాం నమః కవచాయహుమ్ |
| మత్పూర్వైః పాలితం పూర్వం | కనిష్ఠికాభ్యాం నమఃనేత్రత్రయాయవౌషట్ |
| మయా హీనం పురం హి తత్ | కర-తలకరపృష్ఠాభ్యాంనమః అస్త్రాయఫట్ |

### ధ్యానం

వామేకర్ణే మృగాఙ్కం ప్రలయ పరిగతం దక్షిణేసూర్యబింబమ్ ।
కణ్ఠే నక్షత్ర-హారం వర వికట జటాజూటకే మృణ్డమాలామ్ ।
స్కన్ధే కృత్వోరగేన్ద్ర-ధ్వజ నికరయుతం బ్రహ్మకఙ్కాల భారమ్ ।
సంహారే ధారయన్తీ మమహరతు భయం భద్రదా భద్రకాళీ ॥

## మంత్రం

**ఓం ఏం మ్లీం నమః**
**సోఽచిన్తయత్ తదా తత్రమమత్వాకృష్ట చేతనః ।**
**మత్పూర్వైః పాలితం పూర్వం మయా హీనం పురం హి తత్ ॥**
**నమో మ్లీం ఏం ఓం ॥ 12 ॥**
**1000 జపాత్ సిద్ధిః -సర్షప్-తిలైశ్చ హోమః ।**

ఆవాలు-నువ్వులు కలిపి హోమము చేయవలెను.

గాయత్రీమహామంత్ర జపం -10,000, గాయత్రీ విధానేన దశాంశ హోమః॥

గాయత్రీ మహామంత్ర జపము 10,000 చేయాలి. గాయత్రీ విధివిధానముతో దశాంశ హోమము చేయాలి.

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈవిధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత ప్రతిదానికి దశాంశ హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** మోహవికారములు ఎందుకు ఏర్పడతాయనే జ్ఞానము కలుగుతుంది.

**లౌకిక ఫలితము:** భావనాత్మకమైన వేదన శమిస్తుంది.

గాయత్రీమంత్రముతోపాటు ఈ సప్తశతీమంత్రము యొక్క సమన్విత సాధనతో సాధకులు స్వయముగా తమలో ఉన్న మోహమును గుర్తించగలుగుతారు. విరహము, వియోగముల యొక్క స్థితులలో భావనసంవేదనలు వ్యక్తిని అతిగా వికలం కావిస్తాయి అన్నది ప్రాపంచిక, ఆధ్యాత్మిక జీవన సత్యము! మోహజనిత అజ్ఞానమే ఈ వికలత్వమునకు కారణము. ఏ రకమైన బౌద్ధిక విషయములతోను, తర్క-వితర్కముల తోను ఇవి నశించిపోవు. ఇవి కేవలము సంస్కారములు నశించినప్పుడే సమాప్తమవు తాయి. ఒకవేళ గాయత్రీ మంత్రముతోపాటు ఈ సప్తశతీమంత్ర సాధన చేసినచో దాని ప్రభావము చేత సంస్కారములు నష్టమగుట సంభవమే! ఈ అవకాశాలను సాధకుడు తన జీవితములో సాకారము చేసుకొనవచ్చును. ఎందుకంటే మోహం ఉన్నప్పుడు ప్రసన్నత లభించదు, తృప్తి చేకూరదు. మోహమునకు చెందిన భ్రమ నశించినప్పుడే ప్రసన్నత మరియు ప్రకాశము రెండూ లభించుట సంభవమవుతుంది.

# 36. సాధకునిలో అంతర్వివేకము ఎప్పుడు జాగృతము కాగలదు?

ఆదిశక్తి లీలాకథలోని పంక్తులు కర్మశృంఖలాలకు సంబంధించిన రహస్యములను బహిర్గతము చేస్తాయి. జీవనమనే వనములో భ్రమతో కొట్టు మిట్టాడుతూ తిరుగుతూ ఉండే జీవుడు ఈ కర్మశృంఖలాలతోనే బంధించబడు తున్నాడు. పశుపక్ష్యాదులు మొదలుకొని క్రిమికీటకాల యోనులలోనో లేదా దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షస యోనులలో ఎప్పుడైనా సరే జన్మించడమనేది జీవుని కర్మపాశముతోనే ముడిపడి ఉంటుంది. ఈ విధముగా లక్షోపలక్షల యోనులలో భ్రమిస్తూ వెదుకులాడుతూ తిరగటం మినహా జీవునకు లభ్యమయ్యేదేదీ ఉండదు. ఈవిధమైన వెదుకులాటలన్నీ నశించిపోగల అవకాశము ఒక్క మానవజన్మకు మాత్రమే లభిస్తుంది. దుర్లభమైన ఈ మానవ జీవితములో మానవుడు ఆదిశక్తియైన మహామాయను పిలవడము నేర్చుకొని, 'అమ్మా! అమ్మా!' అని కనుక పిలిస్తే మానవ జీవితము మోక్షమునకు మహాద్వారంగా తయారౌతుంది. అయితే ఇదంతా జరగటము అంత తేలికైన పనికాదు. ఇక్కడ నేను-నాది-నీది అనే తేడా అతడి అంతరంగమును ముక్కలుచేస్తూ ఉంటుంది. అతడి ఆలోచనలు పదే పదే మోహమనే బురదలో కూరుకుపోతూ ఉంటాయి. మోహమనే బురదలో చిక్కుకుపోయి, అతడు ఈ మానవ జీవితమనే సదవకాశమును మాటిమాటికీ చేజార్చుకుంటున్నాడు.

ఈ మోహం అతడిని సద్గురువు నుండి, లీలామయి అయిన అమ్మ నుండి వేరుచేస్తుందన్న విషయము తెలుసుకున్నప్పుడు ఎంతో ఆశ్చర్యము కలుగుతుంది. సద్గురువు యొక్క సన్నిధిలో కూడా అతని ప్రాపంచిక వాంఛలు నశించవు. గురుధామంలో కూడా ప్రాపంచిక విషయవాసనలు అతడిని పట్టి పీడిస్తాయి. బాంధవ్య బంధనములు పదే పదే అతడి ఆలోచనా చేతనత్వమును భ్రమింపజేస్తాయి. అటు ఇటు తిరుగాడజేస్తాయి. ఈ క్రమములో అతడు తన సద్గురువు నుండి కూడా విముఖుడు అవుతాడు. ఎల్లప్పుడూ తన పట్ల దయామృతమును వర్షింపజేసే సద్గురువు అతడికి పరాయివానిగాను, ఎప్పటికీ తనది కానటువంటి ఈ ప్రపంచము అతడికి సర్వస్వముగాను కనిపిస్తాయి. ఈ విధమైన వ్యతిరేకత (తారుమారు) అతడిని నిరంతరము భ్రమింపజేస్తూ, అటు-ఇటూ వెదుకులాడుతూ తిరిగేవిధంగా

తయారుచేస్తుంది. ప్రతి జన్మలో దానికి సంబంధించిన జీవితములోను, భ్రమతో కూడిన ఈ వెదుకులాట అతనిని వదిలిపెట్టదు.

మహారాజు సురథుడు ప్రస్తుతము ఈ స్థితిని ఎదుర్కొన వలసిన పరిస్థితి కలిగిందని ఆదిశక్తి యొక్క లీలాగాథ మనకు తెలియజేస్తున్నది. మమతాబద్ధుడైన సురథమహారాజు 'ఇంతకు పూర్వము పూర్వీకులు పరిపాలించిన నగరములో ఈనాడు నేను' లేనే అని ఆలోచిస్తున్నాడు. ఇటువంటి ఆలోచనల కారణముగా మేధా ఋషి ఆశ్రమములోని పవిత్రమైన అనుభూతిని కూడా అతడు పొందలేకపోతున్నాడు. ఆయన ఆలోచనలు, మనస్సు, చేతనత్వము మొదలైనవన్నీ మోహమనే మబ్బులతో కమ్మి వేయబడినాయి. వాస్తవానికి ప్రాపంచికత, ఆధ్యాత్మికత అనేవి కేవలము భావనల యొక్క దిశను అనుసరించి తమ రూపురేఖలను ఏర్పరచుకుంటాయి. భావనల ప్రపంచము, ప్రపంచ సంబంధిత విషయములతో బంధించబడినప్పుడు, ప్రపంచము, ప్రాపంచిక విషయములు ఆ భావనలను వాసనలుగా(తీవ్రమైన ఆకాంక్షలుగా) మార్చివేస్తాయి. అలాకాక, అవే ఆలోచనలు భగవతియైన మహామాయతో తమ సంబంధమును స్థాపించుకొనగలిగితే వాటికి 'భక్తి' అనే స్థాయి లభిస్తుంది.

తమ భావనలను 'వాసన లేదా భక్తి' క్రింద మార్చుకొన వలసిన బాధ్యత ప్రతి ఒక్కరిపైనా ఉన్నది. చాలామంది వ్యక్తులు తాము చూడకపోవటము మాట అటుంచి, కనీసము తమ తల్లిదండ్రులు కూడా చూడనటువంటి పూర్వీకులతో సంబంధమును ఏర్పరచుకుంటూ ఉంటారు అనే విషయము ఎంతో ఆశ్చర్యమును కలుగజేస్తుంది. తాతముత్తాతలు, ఇంకా వారి తాతముత్తాతల గురించి కూడా రోజుకు ఎన్నోమార్లు ఘనంగా చెప్పుకుంటూ ఉంటారు. వారితోటి తమ సంబంధ బాంధవ్యములను, దగ్గరి తనమును అతిశయముగా వర్ణిస్తుంటారు. 'మా ముత్తాతగారి ముత్తాతగారికి కూడా ఇంతే పేరు ప్రఖ్యాతలుండేవి' అని పదే పదే చెప్పుకొనడము ద్వారా వారి మనస్సు పులకికాంకితమౌతూ ఉంటుంది. కానీ ఎవరి గర్భమునుండి ఆత్మ జన్మించినదో ఆ లీలామయియైన ఆదిశక్తి మాత యొక్క స్మృతి మన భావనలలో ఎటువంటి పులకింతను ఎప్పుడూ కలుగజేయదు. మన ఆలోచనలు ఎన్నడూ ఆర్ద్రము కావు. ఇది ఎంతో విచిత్రమైన వైరుధ్యము కాక మరేమిటి? వేలకొలది, లక్షలకొలది దెబ్బలు తిన్నప్పటికీ ప్రపంచములోనుండి 'నాది' అనే భావన నశించడం లేదు. అలాగే మాటిమాటికీ ఎన్నోసార్లు విపత్తు తాలూకు వేదనల బారినుండి రక్షణ

ప్రసాదించే భవానీమాత గురించిన ఆలోచనలు ఏనాడు మన హృదయములను ఆకట్టుకొనవు. ఇది మానవుని దౌర్భాగ్యము కాక మరేమిటి? ఇటువంటి దారుణమైన దౌర్భాగ్యములో పూర్తిగా మునిగిపోయి ఉన్న సురథమహారాజు గారు ఇంకా ఏమి ఆలోచిస్తున్నారనేది ఆదిశక్తి లీలాకథ యొక్క తరువాత శ్లోకములో వర్ణించబడుతున్నది.

**మద్భృత్యైస్తైరసద్వృత్తైర్ధర్మతః పాల్యతే న వా ।**
**న జానే స ప్రధానో మే శూరహస్తీ సదామదః॥(1/1/13)**

**అర్థము:** 'నేను లేనటువంటి నా నగరమును దురాచారులైన నా సేవకగణము ధర్మపూర్వకముగా పాలిస్తూ రక్షిస్తూ ఉన్నదో? లేదో? ఎల్లప్పుడు మదధారలను వర్షించే పరాక్రమశాలియైన నా ఏనుగు ఇప్పుడు ఎట్లా ఉన్నదో?'

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ శ్లోకమంత్రం కేవలము సాధకుని జీవన చేతనత్వమునకు సంబంధించిన కథ. ప్రపంచము, ప్రాపంచికమైన గాయాలు, వాటిద్వారా కలిగే ఆఘాత-ప్రతిఘాతాలు మనిషి మనస్సులో క్షణకాలముపాటు వైరాగ్యమును కలుగ జేస్తాయి, ప్రపంచమన్నా, ప్రాపంచికమైన విషయములన్నా విరక్తి కలుగుతుంది. దీనిని తొలగించుకొనటానికి మనస్సు వికలము అవుతుంది. ఈ వేదనలో ప్రపంచమును వదిలివేయాలనే ప్రయత్నము చెయ్యాలనికూడా అనిపిస్తుంది. కానీ కొంచెము సేపటి తరువాత తిరిగి శాంతి ఏర్పడుతుంది. తన జీవితములోని గడచిన రోజులు అతనికి గుర్తుకొస్తాయి. పదే పదే వాటిని గురించి ఆలోచిస్తూ వానిలోనే తన భావనలను రమింపజేస్తూ సంతృప్తి చెందుతూ ఉంటాడు. అతని యొక్క ఈవిధమైన ఆలోచనా విధానము అతనిని జీవన సాధనా మార్గములో అడుగుకూడా ముందుకు సాగనీయదు.

అంతరంగములో ఇటువంటి మానసిక స్థితిని క్షణకాలము సేపైనా ఉండనీయని మహనీయులనే సంత్‌లని, సాధువులని, తపస్వులని అంటారు. కొన్ని దశాబ్దముల క్రిందట చిత్ర కూటములో, జానకీ శరణదాసు అనే మహాత్ముడు జీవించేవారు. ఆయన సార్థక నామధేయులు. నిజముగా ఆయన జీవితమంతా జానకీమాతను శరణువేడటంలోనే గడిపారు. ఆయన పనులే కాదు, ఆలోచనలు, భావనలు అన్నీకూడా జానకీమాత యొక్క ధ్యానములోనే కలసి ఉండేవి. సాధువు కాకముందు ఆయన గొప్ప ధనవంతులైన కుటుంబమునకు చెందినవారు. అప్పుడప్పుడు

కుటుంబసభ్యులు ఆయనను కలవటానికి వచ్చేవారు. వారితో కూడా ఆయన ఇతరులవలెనే వ్యవహరించేవారు. ఎవ్వరివద్దా ఏమీ తీసుకోకూడదనేది ఆయన నియమము. అదే నియమమును తన కుటుంబ సభ్యులపట్లకూడా పాటించేవారు, కాబట్టి వారు ఏమైనా తీసుకువచ్చినా నిరాకరించేవారు. ఒకసారి ఎవరో ఒక వ్యక్తి 'స్వామీ? మీకు ఎప్పుడు ఎవరు జ్ఞాపకము రారా?' అని ఆయనను ప్రశ్నించాడు. అప్పుడు ఆయన బదులుగా చిన్న నవ్వు నవ్వి ఊరుకున్నారు. పదే పదే అడిగిన తరువాత ఆయన ఈ క్రింది విధముగా జవాబు చెప్పారు.

'సంబంధాలు, సాహచర్యాల తాలూకు అనుభూతుల ఫలితముగా జ్ఞాపకము అనేది ఏర్పడుతుంది. ఏదైనా సంఘటన లేదా ఎవరైనా ఒక వ్యక్తి మన భావనలలో స్పందన కలిగిస్తే సహజముగానే తత్సంబంధమైన స్మృతి ఏర్పడుతుంది. ఆ జ్ఞాపకం అప్పుడప్పుడు మదిలో మెదులుతూ ఉంటుంది. నాకు సంబంధించి నంతవరకు, నా భావనల తాలూకు అనుభూతులన్నీ ఆ తల్లియైన జానకీదేవివరకే పరిమితమై ఉంటాయి. అందుచేత నా జ్ఞాపకములలో కూడా ఆమెతప్ప వేరెవ్వరికీ స్థానము లేదు.' భావనాత్మకమైన ఈ స్థితి భక్తుడిని ఈ ప్రపంచము, ప్రాపంచికత నుండి కాపాడుతుంది. ఆదిశక్తి లీలాగాథకు చెందిన ఈ శ్లోక మంత్రములో ఆధ్యాత్మిక భావనలతోపాటు, దీనియొక్క మంత్ర పరమైన సత్యము కూడా ఇమిడి ఉన్నది. అది క్రిందన ఇవ్వబడు తున్నది.

## సాధనా విధానము

**వినియోగః: ఓం అస్య శ్రీ 'మద్-భృత్యైస్తై' ఇతి సప్తశతీ త్రయోదశ మన్త్రస్య శ్రీబ్రహ్మ ఋషిః, శ్రీమహాకాళీదేవతా, స్త్రీం బీజం, శాకినీశక్తిః, ధూమామహావిద్యా, రజోగుణః, త్వక్ జ్ఞానేన్ద్రియం, గాంభీర్య రసః, గుద కర్మేన్ద్రియం, గమ్భీర స్వరం, జలతత్త్వం, నివృత్తి కళా, ఘూం ఉత్కీలనం, మత్స్య ముద్రా, మమ జ్ఞానభక్తి వైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ మాతా రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ-లోమ-విలోమ పుటితోక్త త్రయోదశ మన్త్రజపే వినియోగః॥**

## న్యాసః

కరన్యాసః షడంగన్యాసః

ఓం ఏం స్త్రీం అంగుష్ఠాభ్యాం నమః హృదయాయనమః

నమో నమః తర్జనీభ్యాం నమః శిరసేస్వాహా

మద్ భృత్యైస్తైరసద్వృత్తైః మధ్యమాభ్యాంనమః శిఖాయైవషట్

ధర్మతః పాల్యతే నవా అనామికాభ్యాంనమః కవచాయహుమ్

నజానే స ప్రధానో మే కనిష్ఠికాభ్యాంనమః నేత్రత్రయాయవౌషట్

శూరహస్తీ సదామదః కర-తలకరపృష్ఠాభ్యాంనమః అస్త్రాయఫట్

## ధ్యానం

ధూమ్రాభాం ధూమ్ర-వస్త్రాం ప్రకటిత
ముక్తా బాలాంబరాఢ్యామ్ ।
కాకణ్డ స్పందనస్థాం ధవళకరయుగాం

శూర్పహస్తా తిరుక్షామ్ । నిత్యం క్షుక్షామ్-దేహాం రజత-

రజ యుతామన్తరశ్శాన్త చిత్తామ్ । ధ్యాయేద్ ధూమావతీం వామనయన

యుగళాం భీతిదాం భీషణాస్యామ్ ॥

## మంత్రం

ఓం ఏం స్త్రీం నమః
మద్భృత్యైస్తైరసద్వృత్తైర్ధర్మతః పాల్యతే నవా ।
న జానే స ప్రధానో మే శూరహస్తీ సదామదః ॥
నమో స్త్రీం ఏం ఓం ॥ **13** ॥
**1000 జపాత్ సిద్ధిః - సర్షప్ (ఆవాలు)-తిలైశ్చ హోమః ।**

అనగా ఆవాలు-నువ్వులు కలిపి హోమము చేయవలెను.

గాయత్రీమహామంత్ర జప – 10,000, గాయత్రీ విధానేన దశాంశ హోమః ॥

గాయత్రీమహామంత్ర జపము 10,000 చేయాలి. అందులో పదవవంతు గాయత్రీ విధివిధానముతో హోమము చేయాలి.

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈ విధంగా పదిరోజులు చేయవలెను. తరువాత దశాంశ హవనము చేయాలి.

**దీనికి ఆధ్యాత్మిక ఫలశృతి:** మోహ సంస్కారమునకు చెందిన అంతర్జ్ఞానం కలుగుతుంది.

**లౌకిక ఫలితము:** భావనాత్మకమైన బాధలకు ఉపశమనము.

గాయత్రీమంత్రముతో పాటు ఈ సప్తశతీమంత్రమును సాధన చెయ్యడము ద్వారా సాధకునిలో అంతర్వివేకము ఉదయిస్తుంది. ఏ ఆలోచనలు, సంస్కారములు, వికారములు తనను ఈ ప్రపంచములో పట్టి బంధిస్తున్నాయో, వాటిని గురించిన జ్ఞానము అతనికి కలుగుతుంది. మనస్సు పదే పదే ప్రాపంచిక విషయముల వైపు ఆకర్షించబడుతున్నదని అతడు తెలుసుకుంటాడు. సాధకునికి వీటి గురించిన జ్ఞానము అవగతమైతే, భవానీమాత కృప వలన వీటిని తొలగించు కొనగలడు. గాయత్రీ మంత్రముతోపాటు ఈ సప్తశతీమంత్ర సాధనను నిరంతరము క్రమము తప్పకుండా చేసినచో దాని ప్రభావము చేత సాధకునికి భావనాత్మకమైన బాధల నుండి విముక్తి కలుగుతుంది. ఫలితముగా అతనికి సహజముగానే సంతోషము లభిస్తుంది. విధి విధానమైన సాధనను చేస్తూ ఉండాలి. అలా చేసిన వ్యక్తి సహజముగానే పులకిత హృదయముతో సుఖ శాంతులతో మనగలడు.

## 37. భావనాత్మకమైన వేదనల నుండి ముక్తి ఎలా లభిస్తుంది?

ఆదిశక్తి లీలాకథ ఆధ్యాత్మిక సాధనకు చెందిన కాంతులీనే మార్గమును సాక్షాత్కరింపజేస్తుంది. భవానీమాత యొక్క ఈ భక్తిమయ కథలో లీనమైనప్పుడు సాధకుని అంతశ్చేతనలో ఆధ్యాత్మిక ప్రకాశం యొక్క సహస్ర–సహస్రధారలు

వర్షిస్తాయి. తత్ప్రభావముచేత చింతన, చేతనత్వములలో ఉన్న సంశయములు, సందేహములు, భ్రమలు హఠాత్తుగా సమసిపోతాయి. ఒక ఆంతరికమైన శుభ్రత, స్వచ్ఛతలు సహజముగానే ప్రాప్తిస్తాయి. దీని ప్రభావము చేత సాధన–సాధకుడు–సాధ్యము ఈ మూడు ఏకమౌతాయి. ఇలా జరుగనిచో తప్పుదారిలో పయనించడము, భ్రమలు అన్నవి వెన్నంటే ఉంటాయి. జీవితము మొత్తం ఒక నిపుణుడైన ఇంద్రజాలికుని మాయవలె గోచరిస్తూ ఉంటుంది. దృగ్గోచరమౌతున్నదేది జరుగదు. జరుగుతున్నదేది చూడబడదు. అటువంటిస్థితిలో పథము–పథికుడు రెండూ విచిత్రమైన అంధకారముతో ఆవరించబడతాయి. మధ్యమార్గంలో అవసరమైన వనరులు సమకూడవు. మార్గ దర్శకుని గురించి ఏ స్పష్టత ఉండదు. దీనితోపాటు గమ్యం మరింతగా దూరమవుతూ ఉంటుంది. అయినప్పటికి గమ్యమును చేరుకోవాలనే భ్రమ ఎల్లవేళలా ఉంటూనే ఉంటుంది.

ఆదిశక్తిలీలాకథ గత భాగములో మహారాజు సురథుని యొక్క మనస్సులోని ఈ పరిదృశ్యము శబ్దరూపములో బయటికి వెలువరించబడినది. అందులో ఇలా చెప్పబడి ఉన్నది. 'గత కాలములో మహాపరాక్రమవంతుడు అని చెప్పబడిన సురథ మహారాజును మళ్ళీ మళ్ళీ మోహజనితమైన స్మృతులు చుట్టు ముడుతున్నాయి.' అతనిలా ఆలోచిస్తున్నాడు. 'దురాచారులైన నా సేవకగణము నేను లేనటువంటి నా నగరమును ధర్మ పూర్వకముగా పాలిస్తూ రక్షిస్తున్నదో? లేదో? ఎల్లప్పుడూ మదధారలను వర్షించే పరాక్రమశాలియైన నా ఏనుగు ఇప్పుడు ఎలా ఉన్నదో? ఇవేమీ నాకు తెలియవు.' ఇటువంటి అనేకానేక విషయములచేత అతని మనస్సు అశాంతిగా ఉన్నది. మనస్సు ఈ అశాంతినుండి బయట పడటానికి లేదా దానిని తగ్గించుకోవటానికి అసలు ప్రయత్నించడము లేదు. ఈక్రమములోనే అతనిని క్రొత్తక్రొత్త సంశయములు, నవీన సందేశములు మరియు అపరిచితమైన గాడితప్పిన ఆలోచనలు వ్యాకులతకులోనుచేసి కలవరం పుట్టిస్తున్నాయి. గతవిషయములు గతించి పోయినప్పటికి సాధకుడిని అవి స్మృతుల సూత్రములతో మరియు రాగ–ద్వేషముల బంధనములతో గట్టిగా బిగించివేస్తాయి.

అతని ఈ బాధ ఉపశమించే బదులు పోనుపోను పెరుగు తున్నది. ఈ విషయమే ఆదిశక్తిలీలాకథ తరువాత శ్లోకములో చెప్పబడినది.

**మమ వైరివశం యాతః కాన్భోగానుపలప్స్యతే ।**
**యే మమానుగతా నిత్యం ప్రసాదధనభోజనైః ॥(1/1/14)**

**అర్థము:** 'నా ప్రధాన ఏనుగు ఇప్పుడు శత్రువుల ఆధీనమై ఏ (కష్టములను) భోగములను అనుభవిస్తున్నదో తెలియదు. నా కృప, ధనము మరియు భోజనాదులను పొందుట వలన సదా నా వెన్నంటి నడిచే నా స్వజనులు ఇప్పుడు ఏ దశలో ఉన్నారో తెలియదు.

ఆదిశక్తి లీలాకథ యొక్క ఈ శ్లోకమంత్రము సాధకులకు ఆత్మవిశ్లేషణ, ఆత్మవివేచన చేసుకొనుటకు ప్రకాశస్థంభం. తమకు తమ స్థితి గురించి పరిచయమున్న వారికి జీవితానుభవము ద్వారా స్మృతులు వెంటాడుతూనే ఉంటాయి అని వారికి తెలుస్తుంది. సమస్తం వెనక్కు గతించిపోయినప్పటికిని స్మృతులు బలవంతముగా తిరిగి తిరిగి నవ్విస్తూ, ఏడిపిస్తూ ఉంటాయి. స్మృతుల వలన పలుమార్లు నేత్రాలు అశ్రువులతో నిండిపోతాయి. ఎన్నోమారులు అనాయాసముగా పెదవుల మీద చిరునవ్వుల కాంతి తళుక్కు మంటుంది. ఇవి మనస్సును మళ్ళీ మళ్ళీ ఆర్ద్రము కావిస్తాయి, అలాగే పొడిబారిపోయేటట్లు చేస్తాయి. అయినప్పటికీ వివేకమనే గీటురాయిమీద పరీక్షించి చూసినప్పుడు వాటికి ఔచిత్యమేమీ ఉండదు. అయినాకూడా వీటి మాయమరీచికలు తమ యొక్క అనేక మాయాజాలాలను విసిరి, అనేకానేక మారులు మనస్సును భ్రమింపజేస్తాయి, దారితప్పేటట్లు చేస్తాయి. సురథమహారాజు ఈ దారితప్పిన, భ్రమపూరిత మనోస్థితిలో కొట్టుమిట్టాడుతూ ఉన్నాడు. అతను మహామాయనుండి విముఖుడై మోహపాశములలో బంధింప బడ్డాడు. ఆ మోహపాశములు అతనిని రకరకములుగా పీడిస్తున్నాయి.

కర్మసూత్రమును గురించి వాస్తవ జ్ఞానమున్నవారికి ప్రతియొక్క కర్మ, ఇచ్ఛ అన్నవి భావన మరియు సంకల్పముతో ముడిపడి కర్మగా మారుతాయి అని తెలుసు. ఈ కర్మను కాలం తన ఒడిలో ఒకానొక పరిపక్వస్థితికి తెస్తుంది. సరైన సమయములో దానిని కర్మఫలరూపములో ప్రకటింపజేస్తుంది. ఇది సృష్టి మరియు సృష్టికర్త యొక్క తొలగించలేని, నశింపజేయలేని ఒకానొక సత్యము. ఇది ప్రతి ఒక్కరికి సమాన రూపములో అమలు అవుతుంది. కర్మఫలం ఎదుట సామాన్యప్రాణులు మొదలుకొని అవతారముల వరకు అందరూ సరిసమానులే! ఇది ఎన్నడూ ఎవ్వరికి తగ్గదు.

ఎవ్వరికీ ఎక్కువగా రాదు. అందుచేత దూరదృష్టి, వివేకశీలత ఉన్నవారు ఎల్లప్పుడూ కర్మఫలమునకు అనురూపముగానే తమ జీవితమును రూపొందించుకుంటారు, నిర్మించుకుంటారు, తీర్చిదిద్దుకుంటారు. దానిని గుర్తించలేనివారు ఎప్పటికీ దారి తప్పుతూనే ఉంటారు, భ్రమపడుతూనే ఉంటారు. బహుశ చివరికి జీవితమును నష్టపరచుకుంటారు.

ఈ కర్మయొక్క ప్రత్యక్షస్వరూపమునకు సూక్ష్మరూపమే సంస్కారము! అది చిత్తభూమిలో సంచితమై, సంగ్రహించబడి ఉంటుంది. తగిన సమయమున పరిపక్వత చెందినప్పుడు ఇదే ప్రారబ్ధరూపంలో ప్రకటితమౌతుంది. అప్పుడది అనాయాసంగానే చిత్తభూమిలో అంకురిస్తుంది. ఇది అంకురించగానే దానికి అనురూపముగా మానసికస్థితి మరియు పరిస్థితులలో వ్యాపకమైన పరివర్తన పొడచూపుతుంది. అప్పుడప్పుడు ఏమౌతుందంటే ఆలోచించనిది, చింతించనిది, భావించనిది కంటిముందు నిలుస్తుంది. అనగా అనుకోనిది, భావించనిది జరిగిపోతుంది. ఈ సంస్కారముల యొక్క ఇరుకైన దారులగుండా ప్రతి ఒక్కరు ముందుకు నడువవల్సినదే! ఎవ్వరూ, ఎట్టి పరిస్థితులలోను దీనినుండి తప్పించుకోలేరు. వివేక వంతులు, వైరాగ్య సంపన్నులు, తమను తామ భగవతి మహామాయకు అర్పించుకున్న వారు సహజముగానే ఈ మార్గముగుండా నిరాటంకముగా సాగిపోగలరు. అలా ఎందుకు జరుగుతుందంటే భావమయమైన భక్తి కారణముగా అంకురించిన అనాసక్తి వారికి ఎక్కడాకూడా రాగద్వేషముల బురదను అంటుకోనివ్వదు.

లేకపోతే గడచినకాలపు సంస్కారములు బలవంతముగా మనస్సును చుట్టు ముడతాయి. మహారాజు సురథునికి ఇలానే జరిగినది. శత్రువుల చేతిలో పరాజయం పాలై నగరమును వీడి బయట ఉన్నప్పటికీ నగర సేవకులు మరియు ధనము, కోశాగారములనే వెతుకుతున్నాయి అతని స్మృతులు. తానిప్పుడు అనుభవించలేని, తాను నిజముగా పొందలేని వస్తువులను రాజు తన స్మృతులలో వెతుక్కుంటున్నాడు. ఆలోచించి ఆలోచించి మనస్సు దుఃఖమునకు, బాధకు లోనౌతున్నది. మనస్సు మళ్ళీ మళ్ళీ రోషము, ఆక్రోశములతో నిండిపోతున్నది. ఋషి మేధుని ఆశ్రమములోని సురమ్య, సుఖమయ వాతావరణము కూడా అతనికి ఇసుమంతైనా సుఖమును ఇవ్వలేనంతగా అతనిని ఈ బాధ మరియు వ్యాకులత పట్టిపీడిస్తున్నాయి. మహారాజు సురథుని సంస్కారముల మరియు స్మృతులతో నిండిన దుఃఖము. భవాని యొక్క

భావమయ స్మరణ చేస్తున్నప్పుడు, ఆమెకు భక్తి పూర్వకముగా సమర్పణ గావించు కున్నప్పుడే ఈ దుఃఖము నుండి బయట పడగలడు. ఎందుకంటే అలా చేసినప్పుడే సంస్కారములు మరియు స్మృతులు సరైన రీతిలో ప్రక్షాళన గావించబడతాయి. అలా జరుగనప్పుడు వీటి బాధ జన్మ జన్మాంతరముల వరకు వెంటాడుతూనే ఉంటుంది.

సాధనాపథములో అగ్రసరులవ్వాలనుకునే సాధకులకు మహారాజు సురథుని యొక్క ఈ అనుభవము ప్రేరణాప్రదమైనది, మార్గదర్శకమైనది. నిజానికి దుర్భావనలు, దుష్టచింతన కారణముగానే కుసంస్కారములు మరియు దోషపూరిత స్మృతులు చెలరేగుతాయి. వీటినుండి బయటపడటానికి మళ్ళీ మళ్ళీ భవానీ మాతను స్మరించాలి, తిరిగి తిరిగి ఆ మహామాయకు సమర్పణ చేసుకొనవలెను. లేకున్నచో రాగ–ద్వేషములు, అభిరుచులు–ఆకాంక్షలు ఎన్నటికీ నశించిపోవు. అవి నిరంతరము పెరుగుతాయి. ఎన్నడూ నశించవు. మనస్సు కూడా మళ్ళీమళ్ళీ వీటిగురించే ఆలోచిస్తూ ఉంటుంది. పలుమార్లు గతములోకి తొంగిచూసి వాటిని సమీక్షిస్తూ ఉంటుంది. సాధకుడు వీటిని గుర్తుకుతెచ్చుకుని తన రాగ–ద్వేషములను, అభిరుచులను మరియు ఆకాంక్షలను మరింతగా పెంచుకుంటాడు. అయితే వీటిగురించి ఎన్నడు ఆలోచించకుండా ఉండటమే ఉచితమైన కార్యము. ఆలోచనలు సాగించుటకు యోగ్యమైనది కేవలము విశ్వజనని మహామాయ మాత్రమే!

ఆదిశక్తి లీలాగాథకు చెందిన ఈ శ్లోకమంత్రములో దాగి ఉన్న ఆధ్యాత్మిక–దార్శనిక భావనలతోపాటు, దీనియొక్క మంత్ర పరమైన సత్యము కూడా ఇమిడి ఉన్నది. అది క్రిందన ఇవ్వబడు తున్నది.

## సాధనా విధానము

**వినియోగః: ఓం అస్యశ్రీ 'మమవైరివశం యాతః' ఇతి సప్తశతీ చతుర్దశ మన్త్రస్య శ్రీమహర్షి వేదవ్యాసఋషిః, శ్రీమహాలక్ష్మీ దేవతా, క్రాం బీజం, దశాశక్తిః, పీతామ్బరామహావిద్యా, రజోగుణ, త్వక్ జ్ఞానేన్ద్రియం, గామ్భీర్య రసః, గుద కర్మేన్ద్రియం, గమ్భీర స్వరం, భూతత్త్వః, ప్రవృత్తి కళా, హ్లీం ఉత్కీలనం, ధేను ముద్రా, మమ జ్ఞానభక్తివైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ–వాగ్బీజ–స్వబీజ–లోమ–విలోమ పుటితోక్త చతుర్దశ మన్త్రజపే వినియోగః ॥**

## న్యాసః

కరన్యాసః షడంగన్యాసః

| | | |
|---|---|---|
| ఓం ఏం క్రాం | అంగుష్ఠాభ్యాం | నమఃహృదయాయనమః |
| నమో నమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |

మమ వైరివశం యాతః మధ్యమాభ్యాంనమః శిఖాయైవషట్

కాన్భోగానుపలప్స్యతే అనామికాభ్యాంనమః కవచాయహుమ్

యే మమానుగతా నిత్యం కనిష్ఠికాభ్యాంనమః నేత్రత్రయాయవౌషట్

ప్రసాదధన భోజనైః కర-తలకరపృష్ఠాభ్యాంనమః అస్త్రాయఫట్

## ధ్యానం

పీతామ్బరాం పీతమాల్యాం పీతాభరణ భూషితామ్ ।
పీతకఞ్జ పద ద్వన్ద్వాం కమలాం చిన్తయేఽనిశమ్॥

## మంత్రం

ఓం ఏం క్రాం నమః
మమవైరివశం యాతః కాన్భోగానుపలప్స్యతే ।
యే మమానుగతా నిత్యం ప్రసాదధనభోజనైః ॥
నమో క్రాం ఏం ఓం ॥ 14 ॥
1000 జపాత్ సిద్ధిః -పాయస-ఘృతతిలైః,
హరిద్రయా చ దశాంశ హోమః ।

పాయసము-నెయ్యి-నువ్వులు, పసుపు కలిపి హోమము చేయవలెను.

గాయత్రీ మహామంత్ర జపము 10,000 చేయాలి. అందులో పదవవంతు గాయత్రీ విధివిధానముతో హోమము చేయాలి.

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈ విధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత ప్రతిదానికి పదవవంతు హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** మోహ సంస్కారమునకు చెందిన అంతర్‌జ్ఞానము కలుగుతుంది.

**లౌకిక ఫలితము :** భావనాత్మకమైన వేదనలకు ఉపశమనము.

గాయత్రీ మంత్రముతో పాటు చేసే ఈ సప్తశతీమంత్ర సాధన సాధకునిలో అంతర్‌ప్రజ్ఞను జాగృతపరుస్తుంది. తత్కారణముగా సాధకునిలో స్వయముగానే ఒక అంతఃప్రకాశం అనుభవములోకి వస్తుంది. ఈ అనుభూతితోపాటే సాధకునికి తన సాధనలో ఎదురయ్యే అవరోధములు, అడ్డంకులు మరియు వ్యతిరేక పరిస్థితులను గురించిన జ్ఞానం ఉదయిస్తుంది. తన భావచేతన ఏ ప్రతిబంధకముల వలన ఎక్కడ, ఎంతమేర బంధించబడినది అన్న జ్ఞానమును పొందుతాడు. దాని ప్రత్యక్షజ్ఞానము కలుగుతుంది. ఈ జ్ఞానం ఉదయించడముచేత అతనికి తన మోహజనితమైన అవరోధములను గురించి తెలుస్తుంది. అప్పుడతను వాటిని అధిగమించుటకు సమర్థుడౌతాడు. ఈ మోహం నశించిపోగానే అతని భావనాత్మకమైన వేదనలన్నీ స్వయముగానే సమసిపోతాయి. ఎందుకంటే అంతర్వివేకం జాగృతమై ఉన్నప్పుడు, మోహ పాశములు మెడకు చుట్టుకోనప్పుడు భావనాత్మకమైన వేదనలు మనిషిని ఎన్నడూ బాధించవు. అతను సర్వదా సంపూర్ణముగా సుఖశాంతులతో ప్రసన్నముగా జీవిస్తాడు. అతని అంతర్మనస్సులో దివ్యప్రకాశం వెదజల్లబడుతూ ఉంటుంది.

# 38. బంధనముల నుండి విముక్తి

ఆదిశక్తి లీలాగాథలోని ప్రతి చరణములోను అనేకమైన ఆధ్యాత్మిక రహస్యములు జోడించబడి ఉన్నాయి. ఆధ్యాత్మికత అనేది 'అజ్ఞాతపథముపైన చెయ్యబడే అంతర్యాత్ర, ఇది అంత తేలికైన పని కాదు'. దీనిపైన పయనించడము దుర్గమమైన, దుష్కరమైన పని. ఈ దుర్గమమార్గమును సుగమము చేసికొన వలెనని అనుకునేవారు తమ మనస్సును సంస్కరించుకొనటమే జీవన లక్ష్యముగా చేసుకొనటం అత్యవసరమైన, ఆవశ్యకమైన పనిగా స్వీకరించాలి. అలా చెయ్యలేనివారు ఈ మార్గముపైన పయనించడమనేది అసంభవమైన పనిగా తెలుసుకోవాలి. బంధనములు, వాటి వలన ఏర్పడే ఆకాంక్షలు, కోరికల కారణముగా హృదయము (మనస్సు)

అపరిష్కృతముగా (అవికసిత స్థితి) ఉండిపోతుంది. ఈ బంధనముల కారణముగానే మిత్రత్వం, శత్రుత్వం వృద్ధి చెందుతాయి. తదనుగుణముగానే ప్రేమ-పగ, రాగద్వేషములు వృద్ధి చెందుతాయి. తత్ఫలితముగా సాధారణ మనుష్యులేకాదు, అసాధారణ స్థాయిలో ఉండే సాధకులు, సిద్ధులు, జ్ఞానులు, యోగులు కూడా జన్మజన్మాంతరముల వరకు మోహపాశములలో బంధించవేయబడుతుంటారు.

చిత్తశుద్ధికి ప్రాముఖ్యత ఇవ్వదల్చినవారు ముందుగా బంధనములను వదిలించుకొనటము పట్ల దృష్టిసారించాలి. వెదురుముక్కే లేకపోతే పిల్లనగ్రోవి ఎక్కడ? అన్న సామెతను అనుసరించి అసలు బంధము అనేదే లేకుండా చేసుకొనగలిగితే, ఇక ఆకాంక్షలు, మోహము అనేవి వృద్ధిచెందటానికి ఆస్కారము ఉండదు. కానీ దీనిని సాధించటం అంత తేలికైన విషయం కాదు. ఎందుకంటే మానవులకు జీవములేని వస్తువుల పట్లనే బంధము ఎంతగానో ఏర్పడుతుంది. ఇక జీవమున్న వ్యక్తుల ఎడ బంధము ఎంత దృఢముగా ఉంటుందో ఊహించలేము. ఎక్కడ ఏ కొద్దికాలము గడిపినా సరే ఆ కొంచెము సేపటిలోనే అక్కడి వాతావరణం, వస్తువులు, వ్యక్తులు మన మనస్సులో కొంత స్థానమును సంపాదించుకుంటారు. అయితే ఈ స్థానము సకారాత్మకమైనదా, ప్రేమపూరితమైనదా అన్న అంశము ముఖ్యము కాదు. ద్వేషపూరితమైనది, నిషేధాత్మకమైనది కూడా కావచ్చు, ఏదైనాసరే దీని ఫలితం మటుకు మన మనస్సుమీద తప్పకుండా ముద్రవేస్తుంది. కాలము కూడా దీని ప్రభావమును తగ్గించలేదు. ఒక్కొక్కసారి సంవత్సరములేకాదు, జీవితాలుకూడా గడచిపోతాయి కానీ మనస్సులోని బంధనములు యథాతథముగా ఉండిపోతాయి.

ఈ బంధనముల కారణముగానే జరిగే క్రియప్రతిక్రియలు, తదనుసారముగా ఏర్పడే పరిణామములేవైతే ఉంటాయో వాటి కారణముగా మన మనస్సు కలుషితం, మలినయుక్తం కావటము చేత నిరంతరము మసకబారి ఉంటుంది. ఈ ప్రక్రియ ఎక్కడా ఆగటముకాని, అలసిపోవటముకాని ఉండదు. ఒక జన్మనుండి మరొక జన్మకు నిరంతరము సాగిపోతూనే ఉంటుంది. దీనితోపాటే మనస్సులోని మాలిన్యములు పెరిగిపోతుంటాయి. కాలక్రమేణ తమవంతు వచ్చినప్పుడు అవి వివిధ సంఘటనల రూపములో మనముందు ప్రకటీకృతమౌతుంటాయి. భవనాశిని, భవతారిణియైన భవానీమాత పట్ల భక్తి ఒక్కటే ఈ ఆపదలనుండి రక్షించుకొనగలిగే మార్గము. ఈ భక్తి కారణముగానే మన భావనలు మాత ఆదిశక్తితో జోడించ

బడతాయి. మనకు, మన ఆలోచనలకు మధ్య ఉన్న అంతరం స్వయముగా మనకు అనుభవమౌతుంది. ఈ అనుభూతి దృఢతరమయ్యేకొద్దీ, మన మనస్సు జగన్మాత ఎడల భక్తితో పరిపూర్ణమౌతుంది. క్రమముగా బంధనములు, కల్మషములు తొలగి పోతుంటాయి.

ఇలా జరుగని స్థితిలో ఎంతో వ్యతిరేక పరిస్థితులు ఎదురవుతున్నప్పటికి, మానవుడు మోహబంధనములలోనే చిక్కుకుపోయి ఉంటాడు. అంతేకాదు, సుమేధా మహర్షి వంటి మహాజ్ఞాని సన్నిధిలో ఉన్నప్పటికీ, స్మృతుల ప్రవాహములో కొట్టుకుపోతుంటాడు. ఆదిశక్తి లీలాకథకు చెందిన గత సంచికలో సురథమహారాజు గారి ఈ మానసిక పరిస్థితి శబ్దాంకితము చెయ్యబడినది. శత్రువుల అధీనములో పడి ఉన్న నా ప్రధాన ఏనుగు ఎలాంటి కష్టములను, భోగములను అనుభవిస్తున్నదో గదా!' అని మహారాజు పదే పదే ఆలోచిస్తుండేవాడు. 'నా దయతో అన్న వస్త్రములను, ధన సంపదలను పొందిన కారణముగా ఎల్లప్పుడూ నన్ను వెన్నంటి తిరుగుతుండే నా అనుయాయులు ఇప్పుడు ఏ స్థితిలో ఉన్నారోగదా!' అనికూడా వేదనపడుతుండే వాడు. ఆయన యొక్క ఈ వైకల్యము కాలం గడిచినా కూడా ఏవిధముగాను ఉపశమించలేదు. వారు పదే పదే ఆలోచించి వ్యాకులత చెందుతుండేవారు. దెబ్బతిన్న మనస్సుతో, బాంధవ్య జనితమైన స్మృతులను మరల మరల గుర్తుచేసుకుంటుండే వాడు.

ఆయన జీవితములోని ఈ సత్యమే ఆదిశక్తిలీలాకథ తరువాతి శ్లోకములో చెప్పబడినది.

**అనువృత్తిం ధ్రువం తేఽద్య కుర్వన్త్యన్యమహీభృతామ్ ।**
**అసమ్యగ్వ్యయశీలైస్తైః కుర్వద్భిః సతతం వ్యయమ్ ॥(1/1/15)**

**అర్థము:** 'ఎప్పుడూ నన్ను అనుసరించి, నా దయకు పాత్రులుగా ఉండే జనం ఇప్పుడు నిశ్చయముగా ఇతర రాజులను అనుసరిస్తూ ఉండి ఉండవచ్చు. నియమము లేకుండా అనవసరమైన ఖర్చులుపెడుతుండే ఆ వ్యక్తులు, వారి ఇచ్చ వచ్చినట్లు ధనమును ఖర్చుచేస్తూ ఉండి ఉండవచ్చు.

ఆదిశక్తి లీలాగాథకు చెందిన ఈ మంత్రము, సాధకులకు నిత్యం మననము చేసుకొని ఆలోచించదగిన విషయము. **బంధం అనేది ఎంత లోతుగా ఉంటుందో,**

**భావనలు అంత అలజడితో ఉంటాయి,** ఫలితముగా మనస్సు అస్థిరంగా ఉంటుంది. బంధనమనేది నావను ఒడ్డుకు కలుపుతూ, కట్టి వేసేటటువంటి దృఢమైన త్రాడు వంటిది. ఇట్లా కట్టివేయబడిన నావ తాను స్వయముగా నీటిలో కదలలేదు, నావలో కూర్చున్న వ్యక్తులను ఎక్కడికీ తీసుకొనిపోలేదు. గతకాలపు మోహబంధనాలతో చింతితుడై ఉన్న సురథమహారాజుగారి పరిస్థితి కూడా ఇంతే! ఏ రాజ్యమునైతే శత్రువులు ఆక్రమించి, తనను బలవంతముగా బయటకు వెళ్ళగొట్టారో, అక్కడ ఎవ్వరినుండి కూడా తనకు కొంచెమైనా సహాయము, సహకారము లభించదో, అక్కడి అణువణువులోను అతడి మనస్సు మాటిమాటికీ రమిస్తున్నది. మేధామహర్షి ఆశ్రమములో అతని ఆధ్యాత్మిక వికాస మార్గమునకు అనుకూలమైన వాతావరణం, సౌకర్యములు లభించి నప్పటికీ కూడా ఆవైపు ఎంతమాత్రము ఆలోచించే స్థితిలో లేడు.

ఆయన ఆలోచన ఎంతసేపూ సేవకుల గురించే! వాళ్ళు తనను కీర్తించటానికి ఎప్పుడూ అలసిపోయేవారుకాదు. అప్పుడు అంత నిజాయితీగా ఉన్న సేవకులే ఇప్పుడు ఇతర రాజుల సేవలో నిమగ్నమై ఉన్నారు. సురథమహారాజుగారికి తన కోశాగారము గురించిన ఆలోచనకూడా అధికముగానే ఉండేది. అసలే పని వాళ్ళందరూ ఖర్చుచేసే మనుషులు. ఇప్పుడు వారిని నియంత్రించే వారు కూడా లేరు. ఇకవారి మితిమీరిన ఖర్చువలన ఖజానా మొత్తము పూర్తిగా ఖాళీ అయిపోయుండవచ్చు. తన యొక్క భూతకాలపు అంశములు అతనిని తీవ్రంగా ఆలోచింపజేస్తూ అశాంతికి గురిచేస్తుండేవి. అయితే అసలు సత్యమేమిటంటే–**ప్రతి ఒక్క జీవాత్మకూడా అనంతపథముపైన యాత్రికుడు. కర్మను అనుసరించి అతని జీవితములో సుఖదుఃఖములు వస్తుంటాయి. ఇక కాలము, విధి వీటికి ఎవ్వరినో బాధ్యులను చెయ్యవలసిన పనేమున్నది?**

జీవితము–ప్రకృతిలకు సంబంధించిన ఈ సత్యమును తెలుసుకొన్నవారిని రాగద్వేషములు, మిత్రత్వ–శత్రుత్వములు ప్రభావితము చెయ్యలేవు. 'జరుగుతున్న సంఘటనలకు ఎవరో ఒక ప్రత్యేకమైన వ్యక్తి కారణము కాదు, కానీ గతకాలములో జరుగుతున్న సంఘటనలకు ఎవరో ఒక ప్రత్యేకమైన వ్యక్తి కారణము కాదు అని గతకాలములో మనము చేసుకొన్న శుభాశుభ కర్మలకు ఫలితములే!' అని వారికి అర్థమౌతుంది. అయితే ఈ జరుగుతున్న సంఘటనలలో సకారాత్మకమైన మార్పులు

కావలసి ఉంటే, తదనుగుణముగా సకారాత్మకమైన (positive) శుభ కర్మలను నిరంతరం చెయ్యవలసి ఉంటుంది. జీవితములో అవరోధములు ప్రబలముగా ఉంటే, తపస్సును మరింత శక్తివంతము చేయవలెను. ఇదే సత్యము, సిద్ధాంతము! జీవితము యొక్క, ప్రకృతి యొక్క నియమము కూడా ఇదే! దీనిని ఎవ్వరు తీసివెయ్యలేరు, మార్చివెయ్యలేరు. ఎందుకంటే అనంతమంతట వ్యాపించి ఉన్న ప్రకృతికి, అనంతానంతమైన నియమాలుకూడా ఉంటాయి. వాటిని ఏదో ఒక వ్యక్తిద్వారా మార్పు చెందించ గలగటం సాధ్యం కాదు. అవును, ఈ సత్యమును తెలుసుకొని, అర్థము చేసుకొని జీవితమును ప్రకృతి యొక్క సహచర్యములో నిలుపుకుంటూ, తద్వారా అనంతానంతమైన శుభఫలములను, అసాధారణమైన సామర్థ్యమును, అద్భుతమైన శక్తులను వరదానములుగా పొందగలము. దీనికి వ్యతిరేకముగా ఆలోచిస్తూ నడుచుకునే వ్యక్తులు ఎల్లప్పుడూ ఆపదలనే సుడిగుండములలో చిక్కుకుని బాధలు పడుతుంటారు. వారిని ఈ స్థితినుండి భావానీమాత మాత్రమే పైకి లేవనెత్తగలదు.

ఆదిశక్తి లీలాగాథకు చెందిన ఈ శ్లోకమంత్రములో దాగి ఉన్న ఈ ఆధ్యాత్మిక, దార్శనిక భావనలతోపాటు, దీనియొక్క విశేష సాధనా విధానము కూడా క్రిందన ఇవ్వబడినది.

## సాధనా విధానము

**వినియోగః ఓం అస్యశ్రీ 'అనువృత్తిం ధ్రువం' ఇతి సప్తశతీ పఞ్చదశమన్త్రస్య శ్రీబ్రహ్మఋషిః, శ్రీమహాలక్ష్మీదేవతా, ఎహ్లీం బీజం, హస్తినీశక్తిః, మాతఙ్గీమహావిద్యా, తమోగుణః, చక్షుః జ్ఞానేన్ద్రియం, ద్వేషో రసః, లింగకర్మేన్ద్రియం, సౌమ్య స్వరం, భూతత్త్వ ప్రవృత్తిః కళా, ప్రీం వృం ఉత్కీలనం, ధేను ముద్రా, మమజ్ఞానభక్తివైరాగ్య క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి మాతా గాయత్రీ రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ–వాగ్బీజ–స్వబీజ–లోమ–విలోమ పుటితోక్త పఞ్చదశ మన్త్ర జపే వినియోగః ॥**

## న్యాసః

| కరన్యాసః | షడంగన్యాసః | |
|---|---|---|
| ఓం ఏం ఎహ్లీం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయనమః |
| నమో నమః | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |

అనువృత్తిం ధ్రువం తేఽద్య మధ్యమాభ్యాంనమః శిఖాయైవషట్

కుర్వన్త్వన్యమహీభృతాం అనామికాభ్యాంనమః కవచాయహుమ్

అసమ్యగ్వ్యయ శీలైస్తైః కనిష్ఠికాభ్యాంనమః నేత్రత్రయాయవౌషట్

కుర్వద్భిః ఎతతం వ్యయమ్ కర–తలకరపృష్ఠాభ్యాంనమః అస్త్రాయఫట్

## ధ్యానం

కాన్త్యా కాఞ్చన సన్నిభాం హిమగిరి–ప్రఖ్యైశ్చతుర్భిర్గజైః ।
హస్తోత్క్షిప్త–హిరణ్యామృత–ఘటైరాసిచ్యమానాం శ్రియమ్ ।
విభ్రాణాం వరమబ్జ, యుగ్మమభయం హస్తై కిరోటోజ్జ్వలామ్ ।
క్షౌమాబద్ధ నితమ్బ బిమ్బ వలితాంవన్దేఽరవిన్ద స్థితామ్ ॥

## మంత్రం

ఓం ఐం ఎహ్లీం నమః
అనువృత్తిం ధ్రువం తేఽద్య కుర్వన్త్వన్యమహీభృతామ్ ।
అసమ్యగ్వ్యయశీలైస్తైః కుర్వద్భిః సతతం వ్యయమ్ ॥
నమో ఎహ్లీం ఐం ఓం ॥ **15** ॥
**1000** జపాత్ సిద్ధిః పలాససమిధ ఘృతేన దశాంశ హోమః ॥

అనగా 1000 గాయత్రీ జపము చేసి, పలాస సమిధలు, నెయ్యితో హోమము చేయవలెను.

గాయత్రీ మహామంత్ర జపము 10,000 చేయాలి. అందులో పదవవంతు గాయత్రీ విధివిధానముతో హోమము చేయాలి.

10 మాలలు గాయత్రి చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈవిధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత ప్రతీదానికి పదవ వంతు హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** ఆసక్తి గురించిన అంతర్జ్ఞానం కలుగుతుంది.

**లౌకిక ఫలితము:** ఆసక్తి వల్ల కలిగే వేదనల నుండి ఉపశమనము.

గాయత్రీ మంత్రముతో పాటు సమన్వయపూర్వకముగా చేయబడే ఈ సప్తశతీమంత్ర సాధన సాధకుని అంతరంగములో వివేకపూర్ణమైన అంతర్దృష్టిని జాగృతము చేస్తుంది. తత్ఫలితముగా సాధకుడు తానే స్వయముగా ఆసక్తి తాలూకు దోషములను గుర్తించుటలో సమర్థుడౌతాడు. 'తనలో కలుగుతున్న భావనాత్మకమైన అలజడి, మానసిక ఆందోళనలకు తానే స్వయముగా కారణం' అన్న విషయమును సాధకుడు గ్రహించగలుగుతాడు. అంతేకాదు, ఏదో ఒకవిధముగా పైన చెప్పిన రెండింటినీ తొలగించుకొన గలిగితే, ఇక కేవలము మాత యొక్క స్మరణ, ఆమెపట్ల సమర్పణ మాత్రమే చేస్తూండటము సాధ్యము కాగలదు' అన్న అంశము కూడా సాధకునికి అవగతమౌతుంది. మనము నిరంతరము వాటినే స్మరిస్తుంటాము కాబట్టి బంధనమునకు బలమెక్కువ అనేది ఎంతో పరిశీలించి, పరీక్షించి నిగ్గుదేల్చబడిన ఆధ్యాత్మిక సత్యము. మనము స్మరణ చేసే దిశను మార్చుకొనగలిగితే దాని స్వరూపములో కూడా మార్పు సంభవమే. జగన్మాత భగవతి స్మరణతో మాత్రమే ఇది సాధ్యము. ఈ మంత్రము యొక్క చేతన దీనిని మరింత సుగమం చేస్తుంది, తత్ఫలితముగా సాధకుని మనస్సు బాంధవ్య జనితమైన బాధలనుండి విముక్తి పొందగలదు.

# 39. సాధకుని జీవితములో ఎదురయ్యే ఒకే ఒక్క అవరోధము 'మోహం'

ఆదిశక్తి లీలాగాథ మానవ జీవితము యొక్క రూపాంతరణ గురించి తెలియజేసే కథ! జగన్మాతయైన ఆదిశక్తినుండి విముఖమైన జీవాత్మ నిరంతరము ఈ ప్రాపంచిక బంధనములలో చిక్కుకుని కొట్టుమిట్టాడుతుంటుంది. బంధనము తాలూకు క్రొత్త క్రొత్త మోహపాశములు ఆధ్యాత్మికపథమును అడ్డుకుంటుంటాయి. ఆధ్యాత్మిక

పథములో ఉన్న వ్యక్తిని అతని ఆలోచనలు, భావనల ద్వారా గుర్తించవచ్చునని శాస్త్రములే కాదు, పండితులు కూడా చెప్తున్నారు. 'ఆలోచనల దిశ ఎటువైపు ఉన్నది? వాటి స్వరూపము, నిర్మాణము ఎలా ఉన్నది?' ఈ అంశములను బట్టి ఒక వ్యక్తి ఆధ్యాత్మికమార్గములో ఉన్నాడా? లేక ప్రాపంచిక మార్గములో ఉన్నాడా? అనేది నిర్ధారించబడుతుంది. ఆలోచనలలో అస్థిరత, ఆందోళన ఉన్నవా? లేక శాంతి, సమర్పణ ఉన్నవా? ఆలోచనలు ఎక్కడ సమర్పించబడుతున్నవి? ఈ అంశములను బట్టి ఆ వ్యక్తి సాధకుని స్థాయిలో ఉన్నడో లేక సామాన్య మానవునివలె ప్రాపంచిక విషయములతో చుట్టు ముట్టబడి ఉన్నాడో తెలుస్తుంది. భక్తుడా? లేక భవబంధనములతో బంధించబడినవాడా? అన్నది ధనవైభవములతో కాక, అతని ఆలోచనలు, భావనలనుబట్టి గుర్తించవచ్చు, పరీక్షించవచ్చు.

జీవితములో అత్యంత కఠినమైన ఆఘాతములకు గురియైన సురథ మహారాజు తన పుణ్యప్రభావము వలన, మేధాఋషి ఆశ్రమములోకి రావడమైతే జరిగిందికానీ, అతని మనస్సు, హృదయం మాత్రము అక్కడి వాతావరణములోనికి ఇంకా ప్రవేశించలేదు. గతకాలపు స్మృతులు మనస్సును వికలం చేస్తున్నాయి. అతనికి తన రాజ్య సుఖము, పూర్వ వైభవము పదే పదే గుర్తుకొస్తున్నవి. ఆ స్మృతుల వేదన ఎంత తీవ్రమైనదంటే, మేధాఋషి ఆశ్రమము యొక్క సౌమ్యమైన సురమ్య వాతావరణము కూడా అతనికి శాంతిని చేకూర్చలేకపోయినది.

శత్రువుల కుట్ర, వారి కుయుక్తులు, తను ఓడిపోయిన వైనము, శత్రువులచేత తన రాజ్యము ఆక్రమించబడిన విధానము మొదలైనవన్నీ అతనికి మరల మరల గుర్తుకొస్తున్నవి. తాను సంపాదించి దాచిన ధనవైభవములన్నింటినీ శత్రురాజులు అనుభవిస్తున్న వైనము అతని హృదయమును వికలము చేస్తున్నది. ప్రపంచం చేత తాను తిరస్కరించబడి నప్పటికీ ప్రపంచమును వదిలిపెట్టలేని స్థితిలో ఉన్నది మహారాజు మానసికస్థితి!

'ఒకప్పుడు నన్ను అనుసరించి, నా దయకు పాత్రులైన ప్రజలు ఇప్పుడు ఇతర రాజులను అనుసరిస్తున్నారు. వ్యర్థముగా ఖర్చుచేసే వ్యక్తులు, ఇప్పుడు నిరంతరము వారి ఇష్టం వచ్చినట్లు ఖర్చుచేస్తూండవచ్చు' మొదలైన ఆలోచనలతో సురథ మహారాజుగారి మనస్సు వికలమౌతూండటం చేత ఒక్కక్షణమైనా ఆయనకు

శాంతి లభించటము లేదు. హతాశ, నిరాశలకు గురియైన ఈ మానసిక స్థితిలో ఆయన పదేపదే గతకాలపు స్మృతులలోకి నెట్టివేయబడుతుండేవాడు. **జీవితములో లాభము, నష్టము దేనినైనా పొందగలగటము-పొందలేకపోవటము అనేవి మన ఇష్టాయిష్టాల వల్లకాక, కేవలము కర్మయొక్క కఠోర నియమమును అనుసరించి జరుగుతుంటాయనే సత్యమును మోహజనితమైన భ్రమలలో చిక్కుకుని, రాజు మరచిపోతున్నాడు.**

ఆయన జీవితములోని ఈ సత్యము ఆదిశక్తి లీలాగాథ యొక్క ఈ క్రింది శ్లోకమంత్రము ద్వారా తెలియజేయబడుతున్నది.

**సఞ్చితః సోఽతిదుఃఖేన క్షయం కోశో గమిష్యతి ।**
**ఏతచ్చాన్యచ్చ సతతం చిన్తయామాస పార్థివః ॥ (1/1/16)**

**అర్థము:** 'అనవసరముగా వ్యయము చేసే వ్యక్తుల వల్ల, ఎంతో కష్టపడి సంపాదించి జమ చేయబడిన నా ధనమంతా ఖర్చయి పోతుంటుంది' అని, ఇంకా ఇలాంటివే మరికొన్ని ఆలోచనలు ఆయన మనస్సును పట్టి వేధిస్తున్నాయి.

ఆదిశక్తి లీలాగాథకు చెందిన ఈ మంత్రము సాధకుల ఆలోచనలకు ఒక హెచ్చరిక వంటిది. సాధకుని మనస్సు, ఆలోచన, చేతనత్వము ఈ మూడూ కూడా అతని నియంత్రణలో స్థిరంగా ఉండాలి. పైన చెప్పిన మూడింటిలో ఏవిధమైన భ్రమగాని, పొరపాట్లుగాని, అస్థిరత్వముగాని ఏర్పడినట్లయితే అతని ద్వారా చేయబడే సాధన వ్యర్థమైపోతుంది. అందుచేతనే మనస్సును, హృదయమును నిరంతరము భవతారిణియైన భవానీ మాత యొక్క నామము, రూపము, గుణములు, లీలాకథల యొక్క కథన-శ్రవణములయందు, పఠనమునందు లగ్నము చెయ్యవలసిన ఆవశ్యకతను గురించి, శాస్త్రములు పలుమార్లు హెచ్చరిస్తున్నాయి. అందుచేతనే సత్సంగము యొక్క ప్రాముఖ్యత గురించి అనేక మార్లు, ఎన్నోవిధాలుగా చెప్పబడినది కూడా! మనస్సును చంచలము కానీయకుండా, దానికి ప్రేరణ, ప్రకాశములు లభించటానికి సత్సంగము దోహదము చేస్తుంది. ఏ కారణము చేతనైనా మనస్సు అస్థిరమైనప్పటికీ, సత్సంగము ద్వారా లభించే మంచి ఆలోచనలు దానిని మరల సన్మార్గములోనికి మళ్ళించగలవు.

‘సాధన అనేది కేవలము ఒక క్రియమాత్రమే కాదు. అది మాతయైన భవానిలో భావపూరితముగా లీనం కావటం’ అని సాధు సంత్‌లు, సాధకులు చెప్తున్నారు. ‘భావనాత్మకముగా లీనము కావడము’ అనేది జరగనప్పుడు, మిగిలిన క్రియలన్నీ కేవలము భ్రమ, మనలను మనము మోసగించుకొనడం మాత్రమే అవుతాయి. ఈ విషయమై బెంగాలుకు చెందిన ప్రఖ్యాత సాధువు విజయకృష్ణ గోస్వామి జీవితమునకు సంబంధించిన ఒక సంఘటన ఎంతో కుతూహలమును కలిగిస్తుంది. వ్రజక్షేత్రములో, యమునా తీరమున వారు తపస్సు చేసుకుంటున్నప్పటి సమయమునకు సంబంధించినది ఈ సంఘటన! ప్రాతః సాయంకాలములు, రాత్రింబవళ్ళు, అన్ని జాములలోను సర్వదా వారు భగవంతుని నామస్మరణలోనే లీనమై ఉండేవారు. జీవితమునకు సంబంధించిన ఇతర కార్యకలాపములన్నీ ప్రకృతి ప్రేరణాత్మకముగా వాటంతట అవే జరిగిపోతూండేవి. కానీ వారి భావపూరితమైన ఆలోచనలు, భావనలు సదా భగవంతుని యందే లగ్నమై ఉండేవి.

ఎప్పటివలెనే ఆరోజుకూడా వారు ప్రాతఃకాలము, బ్రహ్మ ముహూర్తములో యమునా తీరమునకు వచ్చి జపము చేసుకోవటానికి కూర్చున్నారు. జపము చేసుకొనటానికి అనువైన ఆసనమును వారు ఇంకా స్థిరపరచుకోకముందే, నీడలాంటి ఒక ఆకృతి వారి కళ్ళముందు కదలాడింది. ఆ ఆకారము యొక్క నోటినుండి గాయత్రీ మంత్రము ఉచ్చరించబడుతున్నది. అయితే ఆ ఆకారము యొక్క ముఖము మాత్రము అశాంతితో ఉన్నది. ఆ నీడ ఉండుండి కనబడుతూన్నా, వెనువెంటనే మాయమై పోతుండేది. దాని పరిస్థితి చూస్తే ఏదో చెప్పాలనుకుంటున్నట్లు, కానీ చెప్పలేని నిస్సహాయ స్థితిలో ఉన్నట్లు అనిపిస్తున్నది. నీడవంటి ఆ ఆకృతిని చూసి గోస్వామిగారు కూడా ఆలోచనలోపడ్డారు. ఆయన తమ కమండలములోని నీటిని ఆ ఆకృతిమీద చిలకరించారు. తపశ్శాలియైన ఆయన చిలకరించిన పవిత్ర జలము ప్రభావముతో ఆ నీడ ఇప్పుడు స్థిరంగా నిలబడింది.

‘ఎవరు నీవు? ఏమి చెప్పాలనుకుంటున్నావు’ అని గోస్వామి వారు ప్రశ్నించగా, ‘నా పేరు రామప్రసాదవంద్యోపాధ్యాయ. నేను గాయత్రీ సాధకుడను! కానీ నేను పైకి గాయత్రీమంత్రమును వల్లించేవాడినే కానీ నా అంతరంగము ఎప్పుడూ ధనమును కూడబెట్టడము మీదనే లీనమై ఉండేది. జీవితపు చరమాంకములో నా అదృష్టము కొద్దీ బృందావనమునకు వచ్చాను. అక్కడే నేను అంతిమశ్వాస విడిచాను.

కూడబెట్టుకున్న ధనం మీద వ్యామోహం నన్ను ప్రేతాత్మగా మార్చింది. ఇక మీరే నన్ను రక్షించాలి' అని ఆ ఛాయారూపము తన గాథను వినిపించినది. ఆ కథను విన్న గోస్వామిగారు చకితులయ్యారు. 'నిన్ను రక్షించడము ఎలా?' అని ఆయన ఆ ఛాయనే ప్రశ్నించారు.

'నేను దాచుకున్న ధనమును ఫలానా ప్రదేశములో పాతి పెట్టాను. దానిని త్రవ్వి బయటకు తీసి సత్కార్యములకు వినియోగించండి. ఈ విధముగా చెయ్యటము వల్ల దానిపట్ల నాకున్న మోహబంధము నశించిపోతుంది. ఆ చేయబడే సత్కార్యముల పుణ్య ప్రభావమువల్ల నాకు ముక్తి లభించగలదు' అని ఆ ప్రేతాత్మ సమాధానమిచ్చినది.

నీవు కోరుకున్న విధముగా చేస్తానని, విజయగోస్వామివారు ఆ ప్రేతాత్మకు చెప్పి ఊరడించారు. గాయత్రీ మంత్రమును జపించినప్పటికీ ప్రేతయోనిలోకి వెళ్ళవలసిన అగత్యం ఎందుకు కలిగిందో చెప్పమని ఆయన కోరిన మీదట ఆ ఛాయారూపము 'మహాత్మా! గాయత్రీమహామంత్రము యొక్క సామర్థ్యము మీద సందేహము వద్దు. ప్రేతయోనిని పొందటానికి నాలోని మోహ బంధమే కారణము! గాయత్రీమంత్రజపము యొక్క ప్రభావము వల్లనే మీవంటి తపస్సంపన్నులైన మహానుభావులను కలవ గలిగాను. తమరే నన్ను ఉద్ధరించే మార్గము చూడగలరు' అని ప్రత్యుత్తరమిచ్చినది. ఆ సమాధానమునకు విజయకృష్ణగోస్వామి గారు సంతృప్తిచెందారు. వారు ఆ ఛాయారూపము చెప్పిన విధంగానే అన్ని పనులను నిర్వహించారు. తరువాత ఆ ప్రేతాత్మకు విముక్తి లభించి మేలు చేకూరినది. తన జీవితములోని ఈ ప్రసంగమును వినిపిస్తూ ఆయన తన శిష్యులతో, 'సాధకుని జీవితములో ఏదైనా అవరోధమున్నదీ అంటే అది ఒక్క మోహమే!' అని చెప్పేవారు. సురథ మహారాజుగారు కూడా ఈవిధమైన మోహ బంధనముతోనే చుట్టివేయబడి ఉన్నారు. భవతారిణియైన భవానీ మాత యొక్క దయమాత్రమే ఆయనను రక్షించగలిగే సామర్థ్యము కలిగి ఉన్నది.

ఆదిశక్తి లీలాగాథకు చెందిన ఈ శ్లోకమంత్రములో ఇమిడి ఉన్న ఈ ఆధ్యాత్మిక-దార్శనిక భావనలతోపాటు, దీనియొక్క విశేష సాధనా విధానము కూడా క్రిందన ఇవ్వబడినది.

## సాధనా విధానము

**వినియోగ:** ఓం అస్యశ్రీ 'సఞ్చిత సోఽతి దుఃఖేన' ఇతి సప్తశతీ షోడశ మన్త్రస్య శ్రీబ్రహ్మఋషిః, శ్రీమహాలక్ష్మీదేవతా, క్రీం బీజం, క్షేమకరీశక్తిః, బగళామహావిద్యా, తమోగుణః, శ్రోత జ్ఞానేన్ద్రియం, ద్వేషో రసః, లిఙ్గ కర్మేన్ద్రియం, సౌమ్య స్వరం, జల తత్త్వం, నివృత్తికళా, హ్లీం ఉత్కీలనం, యోని ముద్రా, మమ జ్ఞానభక్తివైరాగ్య పూర్వకం క్షేమస్థైర్యాయురారోగ్యాభివృద్ధ్యర్థం శ్రీఆదిశక్తి గాయత్రీమాతా రూపేణ యోగమాయా భగవతీ శ్రీమహాదుర్గా ప్రసాదసిద్ధ్యర్థం చ నమోయుత ప్రణవ-వాగ్బీజ-స్వబీజ-లోమ-విలోమ పుటితోక్త షోడశమన్త్రజపే వినియోగః ॥

### న్యాసః

| కరన్యాసః | షడంగన్యాసః | |
|---|---|---|
| ఓం ఏం క్రీం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| నమో నమః | తర్జనీభ్యాం నమః | శిరసే స్వాహా |

సఞ్చితసోఽతిదుఃఖేన మధ్యమాభ్యాంనమః శిఖాయై వషట్

క్షయం కోశోగ మిష్యతి అనామికాభ్యాంనమః కవచాయ హుమ్

ఏతచ్చాన్యచ్చ సతతం కనిష్ఠికాభ్యాంనమః నేత్రత్రయాయ వౌషట్

చిన్తయామాస పార్థివః కర-తలకరపృష్ఠాభ్యాంనమః అస్త్రాయ ఫట్

### ధ్యానం

కాన్త్యా కాఞ్చన సన్నిభాం హిమగిరి-ప్రఖ్యైశ్చతుర్భిర్గజైః ।
హస్తోత్క్షిప్త-హిరణ్యామృత-ఘటైరాసిచ్య మానాం శ్రియమ్ ।
విభ్రాణాం వరమబ్జ, యుగ్మమభయం హస్తై కిరోటోజ్జ్వలామ్ ।
క్షౌమాబద్ధ నితమ్బబిమ్బ వలితాం వన్దేఽరవిన్ద స్థితామ్ ॥

## మంత్రం

**ఓం ఏం క్రీం నమః**
**సఞ్చితః సోऽతి దుఃఖేన క్షయం కోశో గమిష్యతి ।**
**ఏతచ్చాన్యచ్చ సతతం చిన్తయామాస పార్థివః ॥**
**నమో క్రీం ఏం ఓం ॥ 15 ॥**
**1000 జపాత్ సిద్ధిః - పాయస హోమః ।**

అనగా పాయసముతో హోమము చేయవలెను.

**గాయత్రీమహామన్త్ర జప - 10,000**
**గాయత్రీ విధానేన దశాంశ హోమః ॥**

గాయత్రీమహామంత్ర జపము 10,000 చేయాలి. అందులో పదవవంతు గాయత్రీ విధివిధానముతో హోమము చేయాలి.

10 మాలలు గాయత్రీ మంత్రం చేసి ఒక మాల సప్తశతీమంత్రం చేయాలి. ఈవిధంగా పదిరోజులు చేయవలెను. ఆ తరువాత ప్రతిదానికి పదవవంతు హవనము చేయాలి.

**ఆధ్యాత్మిక ఫలశృతి:** మోహ బంధనమును గురించిన అంతర్ జ్ఞానము కలుగుతుంది.

**లౌకిక ఫలశృతి:** మోహము వల్ల కలిగే వేదనలనుండి ఉపశమనము.

గాయత్రీమంత్రముతో పాటు చేసే ఈ సప్తశతీమంత్ర సాధన వలన సాధకుని అంతరంగములో భగవతి దయవలన ప్రకాశము ఉదయిస్తుంది. తద్వారా సాధకుడు తనలో ఏర్పడుతున్న మోహమును గుర్తించగలుగుతాడు. దానితోపాటు అతడు తన వివేకముతో, మోహమువల్ల ఉత్పన్నమయ్యే మనోవికారములను నివారించు కొనుటలోను, అడ్డుకొనుటలోను సమర్థుడు అవుతాడు. అంతే కాదు, మోహము లేదా బంధము వల్ల ఏర్పడ్డ బాధలు వాటంతట అవే ఉపశమిస్తాయి.